నవంబరు 2007

19

సంపుటి :2 సంచిక : 7

వెల : రూ.5/-

MARXISTU

# మార్క్సిస్టు

## సైద్ధాంతిక మాసపత్రిక

ఈ సంచికలో.....

స్ఫూర్తి

# దళిత చైతన్యదీప్తి జోతిబా ఫూలే

యు. రామకృష్ణ

ఆధునిక యుగంలో దళితుల జీవితాల్లో విప్లవాత్మక మార్పు తెచ్చేందుకు, దళితుల చరిత్రను భౌతికవాద దృక్పథంతో తిరగరాసేందుకు ఆయన మహత్తర కృషి జరిపాడు. మహారాష్ట్ర ప్రాంతంలో బ్రాహ్మణాధిక్యతపై వ్యవసాయ కులాల తరుపున తిరుగుబాటు చేశాడు. అస్పృశ్యుల కోసం పాఠశాలలూ, ఉద్యమాలూ నడిపించాడు. అగ్ర వర్ణాల వారి నుంచే కాదు, భావజాలంతో వారిని పోలిన తన సహచరులయిన ప్రత్యర్థుల నుంచి కూడా అనేక దాడులను ఎదుర్కొన్నాడు. సమాన హక్కులకు అవకాశమే లేని సమాజంలో ఉండీ కుల వ్యవస్థ నిర్మూలన, స్త్రీ పురుషులకు సమాన హక్కులు, సమాన అవకాశాల గురించి ప్రబోధించాడు. ఆయనే జోతిబా ఫూలే. పూర్తి పేరు జోతిరావు ఫూలె.

జోతిరావు ఫూలే 1827లో జన్మించాడు. ఏడాది వయసప్పుడే తల్లి చిమ్నాబాయి మరణించింది. జోతిరావు పుట్టే నాటికి సమాజంలో కింది తరగతులవారు చదువుకునే పరిస్థితి లేదు. అక్కడక్కడా చెదురుమదురుగా గ్రామ పాఠశాలలుండేవి. వాటిలో వర్తకులు, ధనవంతుల పిల్లలకూ చదువు చెప్పేవారు. కొన్నాళ్లపాటు బడికి వెళ్లిన జోతిరావు మానేసి పార, తవ్వుగోల చేత పుచ్చుకొని తోట పనులు చూడటం, తండ్రి గోవిందరావుకు పొలం పనుల్లో సాయపడటం వంటివి మొదలు పెట్టాడు. అప్పటి ఆచారం ప్రకారం జోతిరావుకు 13 ఏళ్ల వయస్సులో వివాహం జరిగింది. భార్య సావిత్రీబాయి వయసు ఎనిమిది సంవత్సరాలు. వధూవరుల్లో ఎవరికీ పెళ్లంటే ఏంటో తెలీదు. చిన్నప్పుడు చేసిన కష్టం జోతిరావుకు ఉత్తరోత్తరా లాభించింది. కష్టపడి పనిచేయడంలో ఆనందం తెలిసివచ్చింది. బడిమానేసినా పుస్తకాలు చదవడం మానలేదు. రోజూ తోట పనీ, పొలం పనీ అయిన తరువాత రాత్రులు బుడ్డి దీపం ముందు కూర్చొని చదువుతుండేవాడు. అతడి తెలివితేటలకు ముచ్చటపడిన ఓ ముస్లిం ఉపాధ్యాయుడు జోతిరావు భవిష్యత్తుకూ, మేధో వికాసానికీ విద్య ఎంత దోహదకారి కాగలదో అతడి తండ్రికి విడమరిచి చెప్పాడు. దీంతో తండ్రి తన పొరబాటు తెలుసుకొని జోతిరావును మళ్లీ పాఠశాలకు పంపడానికి నిశ్చయించాడు. ఆ రోజుల్లోనే హిందూ మతంలో మతం పేరిట జరిగే అన్యాయాలను తెలుసుకున్నాడు. బీద బ్రాహ్మణ కుటుంబానికి చెందిన గోవాండే పాఠశాలలో జోతిరావు సహధ్యాయి. ఇద్దరూ తెలివైనవారే. పుస్తక పఠనం వారి మెదడుకు మరింత పదును పెట్టింది. శివాజీ, జార్జి వాషింగ్టన్‌ల జీవిత చరిత్రలు చదివి వారు ప్రభావితులయ్యారు. అప్పటికి బ్రిటీష్‌వారిని భారతదేశం నుంచి తరిమికొట్టడమే ఆయన ఉద్దేశంగా ఉంది. ఇంగ్లీషు విద్య పూర్తి చేశాడు.



ఆ రోజుల్లో జరిగిన ఓ సంఘటన జోతిరావు జీవిత గమనాన్నే మార్చి వేసింది. ఓ బ్రాహ్మణ మిత్రుని వివాహానికి జోతిరావుకు ఆహ్వానం అందింది. పెళ్లికి వెళ్లాడు. పెళ్లి ఊరేగింపు నడుస్తోంది. అందులో ఉన్నవాళ్లంతా బ్రాహ్మణులే. ఇతర వర్ణాలవారు ఒక్కరూ కనిపించలేదు. జోతిరావు కూడా వారితోపాటు నడవసాగాడు. హఠాత్తుగా ఓ బ్రాహ్మణుడు జోతిరావును గమనించి 'ఓరీ శూద్ర వెధవా! బ్రాహ్మణులతోపాటు నడవటానికి ఎంత ధైర్యంరా నీకు, వర్ణవ్యవస్థనూ, కుల కట్టుబాట్లనూ అతిక్రమించి మమ్మల్ని అవమానిస్తావా? ఇక్కణ్నుంచి వెళ్లిపో. బ్రిటీషువాళ్ల రాజ్యంలో అందరికీ గర్వం బలిసింది' అంటూ తిట్లకు లంఘించుకున్నాడు. జోతిరావు నిర్విణ్ణుడయ్యాడు. తత్తరపాటుతో, కలవరంతో ఏం చేయాలో అతనికి అర్థం కాలేదు. ఒక నిముషంలో తనను తాను సంభాళించుకున్నాడు. అవమానం అతడి నరనరాన వ్యాపించింది. వారి నిందా వాక్యాలు శూలాలై హృదయాన్ని తూట్లు తూట్లు చేశాయి. ఊరేగింపు నుంచి బయటపడి ఇంటి ముఖం పట్టాడు. తనకు జరిగిన అవమానాన్ని తండ్రికి చెబుతూ ఆగ్రహావేశాన్ని ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడ్చాడు. ఆ రాత్రి జోతిరావు నిద్రపోలేదు. సమాజంలో సమానత్వం కోసం ఏం చేయాలా అనే ఆలోచనలతోనే గడిపాడు.

సమాజంలో కింది వర్గాలపై జరుగుతున్న అన్యాయాలకు ప్రతిఘటన ఒక్కటే తగిన చర్య అని అతడు నిశ్చయించాడు. సంఘంలో త్వరితగతిన మార్పు రావాలంటే విద్య ద్వారానే సాధ్యమని తలచాడు. వెంటనే పూనేలో ఒక పాఠశాల ప్రారంభించాడు. అది నిమ్న జాతుల బాలికలకు ఉద్దేశించిన పాఠశాల. బాలురు వచ్చి చదువుకోవడానికి కూడా అభ్యంతరం లేదు. జోతిరావు స్వయంగా బోధించేవాడు. పాఠశాల ఏర్పాటుతో అగ్ర వర్ణాల్లో పెద్ద అలజడి ప్రారంభమైంది. 'శూద్రులకు అసలు చదువు నేర్చుకునే హక్కే లేనప్పుడు, నేర్పే హక్కు ఎక్కడిది? పైగా పరాయి మగవాడి కంట పడకూడని ఆడపిల్లలకు చదువు చెబుతాడా' అంటూ వారు జోతిరావుపై మండిపడ్డారు. అయితే ఆయన హిందూ ధర్మాన్నీ, శాసనాలనూ సవాలు చేశాడు. 'మనువు పెట్టిన ఆంక్షలన్నీ నిజం కాదు. వాటిని ఇప్పుడు పాటించవలసిన అవసరం లేదు. రండి. చదువుకోండి. నేను మీకు చేయూత నిస్తాను. నన్ను అనుసరించండి' అన్నాడు. దీనిపై అగ్రవర్ణాలు తమ కోపాన్నీ, ద్వేషాన్నీ జోతిరావుపై ఎలా తీర్చుకోవాలా అని తర్జన భర్జనలు చేశారు. ఆయన దీన్ని ఖాతరు చేయలేదు. పైగా అగ్నికి ఆజ్యం పోసినట్లు తన బడిలో పాఠాలు చెప్పడానికి భార్య సావిత్రీబాయిని నియమించాడు. ఆడపిల్లలకు చదువు చెప్పడానికి ఉపాధ్యాయులు దొరకలేదు. మహిళా ఉపాధ్యాయులు అప్పటికి లేరు. దీంతో చదువురాని తన భార్యకు చదువు నేర్పి ఆమెను

(మిగతా 51వ పేజీలో)

KRSA1024146

## లోపలి పేజీల్లో...




## సంపాదక వర్గం

పాటూరు రామయ్య (సంపాదకులు)
ఎస్.వెంకట్రావు (వర్కింగ్ ఎడిటర్)
డా. వై. రాధాకృష్ణమూర్తి



భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు)
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ తరుపున
ప్రచురణ కర్త, ముద్రాపకుడు : బి.వి.రాఘవులు
సంపాదకులు : పాటూరు రామయ్య
ముద్రణ : ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్,
1-1-60/2, ఆర్టీసీ క్రాస్ రోడ్స్,
హైదరాబాద్ -20
ఫోన్ : ఎడిటోరియల్ 27665420, 27663761
మేనేజర్: 27673787 ఫ్యాక్స్ : 27639921
EMail:: marxist@cpimap.com
Visit cpi(m) site at : cpim.org


# అక్టోబర్ విప్లవానికి జేజేలు

నవంబరు 7న అక్టోబరు విప్లవ 90వ వార్షికోత్సవం ప్రపంచమంతటా జరుగుతున్నది. మానవజాతి చరిత్రనే గొప్ప మలుపు తిప్పిన మహత్తర విప్లవమది. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం ఆధారంగా, లెనిన్ సారథ్యంలో, బోల్షివిక్కుల నాయకత్వంలో రష్యన్ ప్రజలు సాధించుకున్న విప్లవం, సోవియట్ సమాజానికే కాదు మొత్తం ప్రపంచానికే వెలుగు నిచ్చింది. కార్మికవర్గ రాజ్యంలో స్టాలిన్ నేతృత్వంలో నిర్మించబడిన సోషలిస్టు వ్యవస్థ, దేశదేశాల ప్రజలకు స్ఫూర్తి నిచ్చింది. పెట్టుబడిదారీ ప్రపంచంలో కార్మికవర్గానికి ప్రత్యామ్నాయ బాట చూపింది. వలస దేశాల్లో విముక్తి పోరాటాలను పెంపొందించింది. సామ్రాజ్యవాద దోపిడీకి వ్యతిరేకంగా పోరాడే శక్తులకు పెట్టని కోటగా నిలిచింది. రెండో ప్రపంచ యుద్ధంలో ఫాసిజాన్ని ఓడించి మూడో వంతు ప్రపంచాన్ని దోపిడీ పీడనలనుండి విముక్తి గావించింది. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాల్లోని అనేక వలస దేశాల విముక్తికి బాటలు వేసింది. అటువంటి మహత్తర విప్లవం పుట్టిన గడ్డమీదనే సోషలిజం ఎదురుదెబ్బ తినడం విప్లవ శక్తులకు కలత కలిగించే విషయం. సోవియట్ విచ్ఛిన్నం, సోషలిస్టు శిబిరానికి ఎదురుదెబ్బలు తగలడంతో సామ్రాజ్యవాదం తనకు తిరుగులేదని భావించింది. కమ్యూనిజానికి కాలం చెల్లిందని, సోషలిజానికి ప్రపంచంలో నూకలు చెల్లాయని ప్రచారం చేసింది. పెట్టుబడిదారీ వ్యవస్థతో చరిత్ర గతి ఆగిపోతుందని సూత్రీకరించింది. ప్రపంచంపై తన ఏకధ్రువ ఆధిపత్యాన్ని రుద్దడానికి అన్ని విధాలా ప్రయత్నాలు ప్రారంభించింది. కాని పదిహేనేళ్లలోనే పరిస్థితి దానికి ఎదురు తిరిగింది. దోపిడీ ఉన్నంత కాలం కమ్యూనిజం ఉంటుందనీ, పెట్టుబడిదారీ వ్యవస్థకు సోషలిజమే ప్రత్యామ్నాయమనీ నిరూపించే ప్రపంచ పరిణామాలు వేగం పుంజుకున్నాయి. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటాలతో లాటిన్ అమెరికా ఖండం అరుణిమ దాలుస్తోంది. చైనా, క్యూబాతో సహా మిగిలిన సోషలిస్టు దేశాలు శరవేగంతో పురోగమిస్తూ సోషలిజం విశిష్టత చాటుతున్నాయి. సామ్రాజ్యవాద దురాక్రమణకూ, దోపిడీకీ ప్రపంచ వ్యాపితంగా ప్రతిఘటన పెరుగుతోంది. కమ్యూనిస్టు పార్టీలు కూడదీసుకుంటున్నాయి. సోవియట్ విచ్ఛిన్నంతో మహత్తర అక్టోబర్ విప్లవం అంతం కాలేదనీ, ఆ విప్లవం ప్రపంచ వ్యాపితమైందనీ పరిణామాలు తెలియజేస్తున్నాయి. అందుకే మహత్తర అక్టోబర్ విప్లవం అజరామరం. దాని స్ఫూర్తి అనంతం. 90వ వార్షికోత్సవం సందర్భంగా ఆ మహా విప్లవానికి జేజేలు చెబుతున్నాం.

పాటూరు రామయ్య


## చందా వివరాలు

విడిపత్రిక : రు.5.. సంవత్సర చందా : రు.60
పోస్టు ద్వారా లేదా ఏజెంటు ద్వారా తెప్పించుకోవచ్చు.
లేదా మీ స్థానిక పార్టీ కార్యాలయంలో సంప్రదించండి.
ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలలోనూ లభిస్తాయి



**చిరునామా**

మార్క్సిస్టు
(సైద్ధాంతిక మాసపత్రిక)
వీధి నెం1, అశోక్‌నగర్,
హైదరాబాద్-20

# దళితులపై ప్రభుత్వ వివక్ష

## ఎస్‌సి ఉప ప్రణాళిక అమలులో నిర్లక్ష్యం

**గత పాతికేళ్లుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎస్‌సి ఉప ప్రణాళికను అమలు చేయడంలో చూపిన నిర్లక్ష్యం వల్ల దళితులు 3,75,000 కోట్ల రూపాయలు నష్టపోయారు. 1980లో ఈ పథకాన్ని ప్రవేశపెట్టినప్పటినుండీ ప్రభుత్వాలు దీనికి సంబంధించిన అన్ని నిబంధనలనూ గాలికి వదిలేశాయి.**

**ఎస్ విశ్వనాథన్**

ఒక సెక్షన్ ప్రజలపై మరో సెక్షన్ ప్రజలు వివక్ష చూపితే దారుణమంటాం. కాని ప్రభుత్వమే ఒక సెక్షన్ ప్రజలపై వివక్షచూపితే, అదికూడా వారికి న్యాయంగా చెందాల్సిన ప్రభుత్వ నిధులను ఇవ్వకుండా ప్రభుత్వమే అడ్డుకుంటుంటే దాన్నేమంటాం. ఘోరం, మహా దారుణం...ఇలాంటి మాటలేవీ సరిపోవు. ప్రస్తుతం మనం దేశంలోని 17 కోట్లమంది -జనాభాలో 16.2 శాతం మంది దళితుల విషయంలో ఇదే జరుగుతోంది.

దళితులకు స్పెషల్ కాంపొనెంట్ ప్లాన్ (ఎస్‌సిపి) పేరుతో ప్రత్యేక ఉప ప్రణాళికను 28 ఏళ్ల క్రితం ప్రవేశపెట్టారు. దళితుల సర్వతోముఖాభివృద్ధి కోసం ఈ ఉప ప్రణాళిక ప్రవేశపెడుతున్నట్లు ఆనాడు చెప్పారు. దాన్ని గనుక నిజంగానే ఈ కాలంలో నిజాయితీతో అమలు జరిపి ఉంటే ఈపాటికి దళితుల జీవితాల్లో పెద్ద మార్పులు వచ్చి ఉండేవి. అధికానిర్లక్ష్యం, సర్కారులో స్వార్థపర వర్గాల నిర్వాకం వల్ల జరగాల్సిన పని జరగలేదు.

స్పెషల్ కాంపొనెంట్ ప్లాన్ (ఎస్‌సిపి) పేరును ఇటీవల షెడ్యూల్డ్ కులాల ఉప ప్రణాళిక (ఎస్‌సిఎస్‌పి)గా మార్చారు. వేలాది సంవత్సరాలుగా సామాజిక వివక్షకూ, పీడనకూ గురవుతున్న ప్రజలకు పంచవర్ష ప్రణాళికల ఫలితాలు చేర్చడంలో ప్రభుత్వాలూ, దాని సంస్థలూ విఫలమైనాయని గుర్తించిన తరువాతనే ఇటువంటి ఉపప్రణాళిక తయారు చేయడం జరిగింది. దీని ప్రకారం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ జనాభాలో దళితుల శాతానికి అనుగుణంగా నిధులను ఈ ఉప ప్రణాళికకు కేటాయించాలి.

అసలు జనాభాలో దళితుల శాతానికి మించి నిధులు కేటాయించాల్సిన అవసరం ఉందని ఈ పథకాన్ని ప్రవేశపెట్టినప్పుడు కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. ఈ పథకం క్రింద ప్రభుత్వానికి చెందిన ప్రతి శాఖా దళితుల వాటాకింద రావాల్సిన నిధులను ఉప ప్రణాళికకు కేటాయించాలి. ఇది నిజంగా జరిగి ఉంటే ఈ 28 ఏళ్ల కాలంలో దళితుల అభివృద్ధికి వేలాది కోట్ల రూపాయలు కేటాయించబడి ఉండేవి. కాని చాలా రంగాలు అసలు అటువంటి కేటాయింపులు చేయలేదు. చేసినవి కూడా మార్గదర్శక సూత్రాలకు అనుగుణంగా లేవు. చివరికి కొద్దిపాటి మొత్తాలు కేటాయించిన చోట కూడా వీటిని ఖర్చు చేయకుండా ఇతర కార్యక్రమాలకు మళ్లించడమో, లేక మురిగిపోయేల్లు చేయడమో జరిగింది. ప్రణాళికా సంఘం పదే పదే ఆదేశాలు జారీ చేస్తున్నప్పటికీ ఈ ఘోరం జరిగింది. అధికార యంత్రాంగంలో పాతుకుపోయిన కుల వివక్షే దీనికి కారణమని దళిత సంఘాల నాయకులు, మేధావులూ విమర్శిస్తున్నారు.

"గత 30 ఏళ్లలో దళితులు అభ్యున్నతి సాధించాన్న దాంట్లో సందేహం లేదు. ఇంజినీరింగ్, వైద్యం, ఉపాధ్యాయ, న్యాయ, సివిల్ సర్వీస్ రంగాల్లో వారు గణనీయంగా ఉన్నారు. అయితే షెడ్యూల్డ్ తరగతుల ఉప ప్రణాళిక గనుక అనుకున్నట్లు అమలయి ఉంటే ఈ పాటికి ఈ రంగాల్లో వారి సంఖ్య పదిరెట్లు ఎక్కువ ఉండేది" అని సీనియర్ ఐఎఎస్ అధికారి ఆర్. క్రిస్టోదాస్ గాంధీ చెప్పారు.

దళితులకు విద్యనందించే విషయంలో ఉప ప్రణాళిక నిధులను పెద్ద ఎత్తున వినియోగించవచ్చు. ఈ పథకం క్రింద ప్రభు త్వం దళిత విద్యార్థులకు స్కాలర్‌షిప్పులూ, ఫెల్లోషిప్పులూ ఇవ్వడమే కాదు పాఠశాలలూ, కళాశాలలూ నిర్మించిడానికి దళితులను ప్రోత్సహించాలి. ఆవిధంగా దళితులకు ఆస్థులు ఏర్పడేవి. ప్రజాపనులూ, సరుకుల సరఫరా కాంట్రాక్టులను కూడా ప్రభుత్వం దళితులకు ఇవ్వాలి.

గిరిజన ఉప ప్రణాళిక మాదిరిగానే దళితుల సత్వర అభివృద్ధి కోసం షెడ్యూల్డ్ కులాల ఉప ప్రణాళిక ప్రవేశపెట్టడం వెనుక ఒక చరిత్ర ఉంది. 1965 నుండి 1971 వరకు పాకిస్థాన్‌తో యుద్ధం కారణంగా 1970వ దశకం కల్లోలంగా తయారైంది. ధరలు విపరీతంగా పెరిగాయి. అనేక ప్రాంతాల్లో పేదరికం

జడలు విప్పింది. ద్రవ్యోల్బణం చుక్కలనంటడంతో ఆర్థిక వ్యవస్థ అస్థిరంగా మారింది. యుద్ధాలమీద పెద్ద ఎత్తున ఖర్చు చేయడం, పొరుగు దేశాలనుండి వలసలు పెరగడం వల్ల ఈ పరిస్థితి తలెత్తింది. దీనివల్ల సమాజంలో అట్టడుగున ఉన్న దళితులు మొట్టమొదట తీవ్రంగా దెబ్బతిన్నారు.

ఈ కాలంలోనే రాజకీయ అస్థిరత నెలకొంది. ఎమర్జెన్సీ విధించబడింది. పత్రికలు, ప్రతిపక్షాల నోళ్లు నొక్కారు. కుల, మత పరమైన సంస్థలు భయంకరంగా తలెత్తాయి. ఈ వాతావరణంలో అనేక రాష్ట్రాల్లో దళితులపై దాడులు విపరీతంగా పెరిగాయి.

1977లో బీహార్‌లోని బెల్చిలో అగ్రవర్ణాలవారు 11 మంది వ్యవసాయ కార్మికులను సజీవదహనం చేశారు. ఈ మారణ హోమం తరువాత వరుసగా రెండు దశాబ్దాల పాటు దేశంలోని అనేక రాష్ట్రాల్లో దళితులమీద హింసా కాండ పెరిగిపోయింది. బీహార్‌లో దళితులు పెద్ద ఎత్తున నక్సలైట్ ఉద్యమంలో చేరారు. దీనికి ప్రతిగా అగ్రవర్ణ భూస్వాములు రణవీర్ సేన వంటి ప్రయివేటు సైన్యాలను తయారుచేసి దళితులపైకి ఉసిగొల్పారు. ఈ పరిస్థితుల్లో సంక్షేమ పథకాలు దళితులకు పెద్దగా మేలుచేయలేకపోయాయన్నది వాస్తవం.

ప్రణాళికా పద్ధతిలోనూ, కేటాయింపులు చేయడంలోనూ, బడ్జెట్ రూపకల్పనలోనూ ఏదో మౌలిక లోపం ఉందని ప్రణాళికా వేత్తలూ, వారి రాజకీయ బాస్‌లూ గమనించారు. అప్పటి వరకు తను అనుసరించిన ప్రాంతాలవారీ అభి వృద్ధి ధోరణి దళితుల విషయంలో సరికాదని ప్రణాళికా సంఘం గుర్తించింది. గిరిజనులు కొన్ని నిర్దిష్ట ప్రాంతాల్లో కేంద్రీకరించబడి ఉంటారు కనుక వారికి ప్రాంతీయ అభివృద్ధి వర్తిస్తుంది. కాని దళితులు గ్రామాల్లో మిగిలిన జనాభాతో పాటు నివసిస్తారు. అందువల్ల దళితులకు నేరుగా నిధులు చేరేవిధంగా స్పెషల్ కాంపొనెంట్ ప్రణాళిక (ఎస్‌సిపి)ని ప్రణాళికా సంఘం రూపొందించింది. తరువాత దాని పేరు మార్చారు.

దళితులకు సంబంధించిన సమస్యలను మరింత సమర్థంగా పరిష్కరించడం కోసం ప్రభుత్వం నియమించిన ఎస్‌సి, ఎస్‌టి ప్రత్యేక కమిషన్‌ను 1978 ఆగస్టులో మరింత పటిష్ట పరిచి ఎస్‌సి, ఎస్‌టి కమిషన్ నియమించారు. ఎస్‌సి ఉప ప్రణాళికను రూపొందించే పనిని కూడా ఈ కమిషనే చూసింది. నిబంధనల ప్రకారం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఎస్‌సి ఉప ప్రణాళికను తప్పకుండా రూపొందించాలి.

> “ప్రణాళికా పద్ధతిలోనూ, కేటాయిం పులు చేయడంలోనూ, బడ్జెట్ రూపకల్పనలోనూ ఏదో మౌలిక లోపం ఉందని ప్రణాళికా వేత్తలూ, వారి రాజకీయ బాస్‌లూ గమనించారు. అప్పటి వరకు తను అనుసరించిన ప్రాంతాలవారీ అభి వృద్ధి ధోరణి దళితుల విషయంలో సరికాదని ప్రణాళికా సంఘం గుర్తించింది.”



ప్రభుత్వ పాఠశాలలో దళిత విద్యార్థులు: నిధుల లేమితో వీరి చదువు ఇంతటితో సరి

దళితులకు ఉపయోగపడే పథకాలకు తగిన నిధులు కేటాయించేట్లు చూడ్డం, దళితులకూ, సమాజంలోని ఇతర వర్గాల ప్రజలకూ మధ్య ఉన్న అంతరాలు తగ్గించడం, వారిని ప్రధాన జీవన స్రవంతిలో త్వరంగా కలిసిపోయేట్లు చేయడం ఉప ప్రణాళిక ఏర్పాటు వెనుకనున్న అసలు లక్ష్యం. విద్యా సాధికారికత, సామర్థ్యం పెంచడం, ఉపాధి, ఆదాయాలు కల్పించే సాధనాలు సమకూర్చడం, ఆస్తులు సమకూర్చడం మొదలైన చర్చలు తీసుకోవడం దీని ఉద్దేశం. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు మొత్తం ప్రణాళికా కేటాయింపులనుండి కనీసం జనాభాలో ఎస్‌సిల శాతం మేరకన్నా ఎస్‌సి ఉప ప్రణాళిక ప్రాజెక్టులకు నిధులు కేటాయించాలనేది ఇందులో ప్రధానమైన విషయం. ఈ నిధుల కేటాయింపు, వినియోగాన్ని పర్యవేక్షించేందుకు ఒక నోడల్ విభాగాన్ని ఏర్పాటు చేయాలి. సాంఘిక సంక్షేమ శాఖగాని, లేదా దళితుల సంక్షేమం, అభివృద్ధిని చూసే ఇతర ఏ శాఖైనా గాని ఈ నోడల్ విభాగంగా ఉండవచ్చు. ఎస్‌సి ఉప ప్రణాళికకు కేటాయించే నిధులన్నీ నోడల్ విభాగం అజమాయిషీ కింద ఖర్చుచేయాలి. ఈ విభాగం ఆయా విభాగాలకు తిరిగి కేటాయింపులు జరుపుతుంది. ఉప ప్రణాళిక నిధులను ప్రత్యేక బడ్జెట్ ఖాతాల కింద లేక ఉప ఖాతాల కింద ఉప ప్రణాళికను అమలు చేసే ఆయా విభాగాలకు కేటాయించాలి. ఈ కేటాయింపులు అమలు జరపడానికి బ్లాకు, జిల్లా, రాష్ట్ర స్థాయిల్లో ఎన్నికైన ప్రజాప్రతినిధులు, ఇతరులతో కూడిన పర్యవేక్షణా కమిటీలు వేయాలి.

“షెడ్యూల్డ్ కులాల వారికి వారి వాటా సాధారణ అభివృద్ధి నిధులనుండి లభించాలని పంచవర్ష ప్రణాళికలన్నీ ఘోషించి

> **"ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వ నిర్వాకం కూడా సరిగ్గా లేదు. ఉదాహరణకు, 2007-2008 ప్రణాళికా కేటాయింపుల కింద మొత్తం బడ్జెట్టు 2,02,100 కోట్ల రూపాయలు. దీని ప్రకారం ఎస్‌సి ఉప ప్రణాళికకు రు. 32,816 కోట్లు (బడ్జెట్‌లో 16 శాతం) కేటాయించాలి. కాని నిజంగా కేటాయించింది రు. 12,535 కోట్లు మాత్రమే."**

నప్పటికీ నాల్గవ పంచవర్ష ప్రణాళిక చివరి వరకూ దళితుల కార్యక్రమాల అమలుకు నిధులను వెనుకబడిన తరగతులు రంగాలనుండి కేటాయిస్తూ వచ్చారు" అని ప్రణాళికా సంఘ నివేదిక తెలిపింది. ఈ కేటాయింపు చాలా తక్కువనీ, జనాభాలో దళితుల శాతానికి తగ్గట్టుగా లేదని ప్రణాళికా సంఘం పేర్కొంది.

అందువల్ల అయిదో పంచవర్ష ప్రణాళికా కాలం నుండి దళితుల అభివృద్ధికి నిధుల కేటాయింపును నిర్ణయించేందుకు కొత్త వ్యూహాన్ని రూపొందించారు. దీని ప్రకారం నిధులను సాధారణ అభివృద్ధి రంగాలనుండి కేటాయిస్తారు, వెనుకబడిన రంగాలనుండి కేటాయించబడే నిధులు అదనంగా చేరుతాయి. అయితే ఇంత చేసినా దళిత సంక్షేమానికి సంబంధించిన పథకాలకు సాధారణ రంగాల నుండి నిధుల కేటాయింపు జరగలేదని ప్రణాళికా నివేదిక తెలిపింది.

1979-80 వార్షిక ప్రణాళిక కోసమే రాష్ట్రాలు ప్రత్యేక కాంపొనెంట్ ప్రణాళిక తయారుచేసినప్పటికీ నిధులు మాత్రం ఈ ఉప ప్రణాళికకు కేటాయించాల్సిన రీతిలో కేటాయించ లేదు. ఆరో పంచవర్ష ప్రణాళికలో ప్రత్యేక కాంపొనెంట్ ప్రణాళికను చేర్చారు. ఈ ప్రణాళికను అమలుచేయాలని చెబుతూ ఇందిరా గాంధీ రాష్ట్రాలకు ప్రత్యేక కేంద్ర సహాయాన్ని కూడా ప్రకటించారు.

కాని దీనికి కొన్ని రాష్ట్రాలనుండి మినహా పెద్దగా సహాయం అభించలేదు. తాము జరిపిన కేటాయింపుల్లో అత్యధిక భాగం విభజించడానికి వీలులేని విద్యుత్, సమాచార, నీటిపారుదల రంగాలకు పోతుందనీ, విభజించ డానికి వీలయ్యే రంగాలకు కొద్ది మొత్త మాత్రమే మిగులుతుందనీ, అందువల్ల ప్రత్యేక ప్రణాళికకు తాము నిధులు కేటాయించలేక పోతున్నామని అనేక రాష్ట్రాలు చెప్పాయి. విభజిత రంగాలనుండి ప్రత్యేక కాంపొనెంట్ ప్రణాళికకు నిధులు కేటాయించాల్సి ఉంది.

ఎస్‌సిపి దళితుల్లో పెద్ద ఆశలు రేకెత్తించింది. నిధుల కేటాయింపులో ప్రాథమికంగా తలెత్తిన సాంకేతిక సమస్యలు పరిష్కరించబడతాయనీ, ఆ విధంగా వచ్చే నిధులు తమ జీవితాలను పెద్ద ఎత్తున మారుస్తాయనీ దళితులు ఆశపడ్డారు. అయితే ఈ పథకం అమలులో మీనమేషాలు లెక్కించడం, అమలు అయ్యేచోట కూడా నత్తనడకన సాగించడంతో వారి ఆశలు అడియాశలైనాయి. ఈ పథకం ప్రవేశపెట్టి మూడు దశాబ్దాలు గావస్తున్నా నేటికీ సాధారణ అభివృద్ధి రంగాలనుండి ఉప ప్రణాళికకు నిధులు కేటాయింపుపై ఒక ఆచరణాత్మక పరిష్కారాన్ని కనుగొనలేకపోవడం నిజంగా విచిత్రంగానే అనిపిస్తుంది.

దేశంలోని మొత్తం 29 రాష్ట్రాలకు గాను 17 రాష్ట్రాలు ఇప్పటికీ జనాభాలో దళితుల శాతానికి అనుగుణంగా ఎస్‌సిపి కి నిధులు కేటాయించడం లేదు. దళిత సంక్షేమానికి ప్రత్యేక బడ్జెట్ ఖాతా కూడా లేదు. ఈ రాష్ట్రాల్లోని కొన్నిట్లో దళితులు గణనీయంగా ఉన్నారు. ప్రతి విభాగానికీ, మంత్రిత్వ శాఖకూ నిధులు కేటాయించాలన్న మార్గదర్శక సూత్రాన్ని అనేక రాష్ట్రాలు పాటించడం లేదు. కేటాయించిన కొద్దిపాటి నిధులను కూడా వారు పూర్తిగా వినియోగించడం లేదు.

ఇతర రంగాలకు నిధులు మళ్లిస్తున్నారన్న ఫిర్యాదులు కూడా ఉన్నాయి. రాజకీయ నాయకత్వ నిర్లక్ష్యం, అధికారుల నిర్లిప్తత, అధికార యంత్రాంగంలో స్వార్థపరశక్తుల కుట్రలు.... కారణం ఏమైతేనేం దళితుల అభ్యున్నతికోసం ఖర్చుచేయాల్సిన అత్యధిక శాతం నిధులు దారిమళ్లుతున్నాయి, లేదంటే ఇతర సెక్షన్ల ప్రయోజనాలు నెరవేర్చే రంగాలకు మళ్లించబడుతున్నాయి. దీనివల్ల దళితులు వేలాది కోట్ల రూపాయలు నష్టపోతున్నారని దళిత మేధావులు లెక్కగడుతున్నారు.

ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వ నిర్వాకం కడా సరిగ్గా లేదు. ఉదాహరణకు, 2007-2008 ప్రణాళికా కేటాయింపుల కింద మొత్తం బడ్జెట్టు 2,02,100 కోట్ల రూపాయలు. దీని ప్రకారం ఎస్‌సి ఉప ప్రణాళికకు రు. 32,816 కోట్లు (బడ్జెట్‌లో 16 శాతం) కేటాయించాలి. కాని నిజంగా కేటాయించింది రు. 12,535 కోట్లు మాత్రమే. ఆ విధంగా కేంద్ర ప్రభుత్వం దళితులకు చెందాల్సిన రు 20,280 కోట్ల రూపాయలు వారికి చెందకుండా చేసింది. అంతకు ముందుటేడు వారికి చెంద కుండా చేసిన మొత్తం కన్నా ఇది 1,000 కోట్ల రూపాయలు ఎక్కువ.

"ఎస్ ఉప ప్రణాళిక దళితుల్లో పేదరికాన్ని నిర్మూలించడానికి ఉద్దేశించబడింది గనుక ఇది వారికి ఒక గొప్ప వరం వంటిది. కాని స్వార్థపరులైన అధికారులు దీన్ని ఖచ్చితంగా అమలు పరచడం లేదు" అని ఆర్థికవేత్త ఎం. తంగరాజు చెప్పారు. "ఎస్‌సి ఉప ప్రణాళికా, ఎస్‌సి, ఎస్‌టి (అత్యాచారాల నిరోధక) చట్టం గనుక నిజాయితీతో అమలు చేసి ఉంటే ఈ పాటికి పేదరికం, అస్పృశ్యత నిర్మూలించబడి ఉండేవి" అని ఆయన అన్నారు.

దనిపై తమిళనాడు శాసన సభ్యుడు డి. రవికుమార్ ఇలా చెప్పారు: "ఎస్‌సి ఉప ప్రణాళికను సక్రమంగా అమలు జరిపితే అది దళితుల ఆర్థికాభివృద్ధికి తప్పక తోడ్పడుతుంది. కాని దళిత ఉద్యమాలు బలంగా ఉన్న మహారాష్ట్ర, మధ్య ప్రదేశ్ మినహా మిగిలిన రాష్ట్రాలేవీ దీన్ని తీవ్రంగా తీసుకోలేదు. తమిళనాడులో కూడా దీని అమలు జరగాల్సిన విధంగా జరగలేదు. ఈ ఏడాది మాత్రమే ప్రభుత్వం జనాభాలో దళితుల శాతం (19 శాతం)కు అనుగుణంగా కేటాయింపులు జరిపింది. గత సంవత్సరం 11 శాతం మాత్రమే కేటాయించింది. ఈ కాలమంతా కేటాయింపులు తక్కువ, వినియోగించింది తక్కువ, మళ్లింపు ఎక్కువగా ఉంది."

ఎస్‌సి ఉప ప్రణాళిక కింద విద్య, ప్రజారోగ్యం, ఆస్తులు సమకూర్చడం వంటి చర్యలు చేపట్టాలని ఆయన సూచించారు. దీని కింద గుడిసెల స్థానంలో శుభ్రమైన పక్కాఇళ్ల నిర్మాణానికి కాలపరిమితితో కూడిన కార్యక్రమం చేపట్టవచ్చు. అలా చేస్తే మూడేళ్లలో గృహ సమస్య తీరిపోతుందని ఆయన చెప్పారు.

"చేతితో పాకీ పనిచేయడాన్ని నిర్మూలించడానికి ఎస్‌సి ఉప ప్రణాళిక నిదులు ఉపయోగించు కోవచ్చు. ప్రభుత్వం దీన్ని అమలు చేసే ఒక పర్యవేక్షక యంత్రాంగాన్ని కూడా తయారు చేయాలి" అని ఆయన చెప్పారు.

గత పాతికేళ్లుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎస్‌సి ఉప ప్రణాళికను అమలు చేయడంలో చూపిన నిర్లక్ష్యం వల్ల దళితులు 3,75,000 కోట్ల రూపాయలు నష్టపోయారని దళిత మేధావులు లెక్కగట్టారు. 1980లో ఈ పథకాన్ని ప్రవేశపెట్టినప్పటినుండీ ప్రభుత్వాలు దీనికి సంబంధించిన అన్ని నిబంధనలనూ గాలికి వదిలేశాయి.

దీని కింద ప్రతి విభాగానికీ/మంత్రిత్వ శాఖకూ జనాభాలో దళితుల శాతానికి అనుగుణమైన శాతంలో నిధులు కేటాయించాల్సి ఉండగా ప్రభుత్వాలు ఈ శాతాలను ఏనాడూ పట్టించుకోలేదు. దీనివల్ల ప్రతి ఏటా దళితులు రు. 15,000 కోట్లు నష్టపోతున్నారని అంచనా. 2007-2008 వార్షిక ప్రణాళికలో దళితులు రు. 20,280 కోట్లు నష్టపోయారని అంచనా వేశారు.

అధికారులు దళితులకు మాత్రమే ఉద్దేశించిన పథకాలు, అంటే దళితుల దీర్ఘకాలిక అభ్యున్నతికి తోడ్పడే విద్యా సాధికారికత వంటి పథకాలు రూపొందించడంలో అధికారు వైఫల్యమే ఈ నిధులు కేటాయించకపోవడానికి కారణమని ఆర్థికవేత్తలూ, సామాజిక కార్యకర్తలూ చెబుతున్నారు. రాష్ట్రాలు ఈ విధంగా బడ్జెట్ వివక్ష పాటించడం వల్ల దళితులకు జరుగుతున్న నష్టం గురించి తమిళనాడులోని ఇంజినీరింగ్ విద్యపై జరిపిన ఒక పరిశోధనలో అనేక విషయాలు బయటపడ్డాయి. గత 10 ఏళ్లలో రాష్ట్రంలోని ఇంజినీరింగ్ కళాశాలలనుండి అయిదు లక్షలమంది గ్రాడ్యుయేట్లు బయటికెళ్లారు. ఈ కళాశాలల్లో అనేకం గత రెండు దశాబ్దాల్లోనే నిర్మించబడ్డాయి. ఇక్కడ తయారైన అయిదు లక్షల ఇంజినీర్లలో దళితులు 50,000 మించి లేరు. రాష్ట్ర జనాభాలో దళిత జనాభా (19 శాతం)కు అనుగుణంగా గనుక ఎస్‌సి ఉప ప్రణాళిక కింద నిధులు కేటాయించి దళితులను విద్యావంతులను చేసే నిర్దిష్ట కార్యక్రమాన్ని గనుక అమలు జరిపి ఉంటే ఇంజినీర్లయిన దళిత విద్యార్థుల సంఖ్య ఇంకా ఎక్కువగా ఉండేను. ఇంజినీరింగ్‌కు సెలక్టయిన చాలామంది దళిత విద్యార్థులు ఫీజులు చెల్లించలేక కళాశాలల్లో చేరలేదు.

# రాష్ట్రంలో ఎస్‌సి ఉప ప్రణాళిక అమలు అధ్వానం



**జాన్ వెస్లీ**

అన్ని మంత్రిత్వశాఖలు షెడ్యూల్డ్ కులాల అభివృద్ధికి సరిపోయేవిధంగా పథకాలను రూపొందించాలని దానికి ఎస్‌సి కాంపొనెంట్ ప్రణాళిక (ఎస్‌సిపి) నిధులను వినియోగించాలని జాతీయ ఎస్సీ,ఎస్టీ కమీషన్ సూచించింది. కేంద్ర ప్రభుత్వ మంత్రిత్వ శాఖలు కూడా ప్రత్యేకంగా బడ్జెట్‌లో కేటాయింపులు చేపట్టాలని జాతీయ ఎస్సీ, ఎస్టీ కమీషన్ కూడా కోరింది. తమ తమ మంత్రిత్వ శాఖల వార్షిక నివేదికలో ఎస్‌సి కాంపొనెంట్ ప్రణాళిక కేటాయింపులను, నిధుల విడుదలను, ఖర్చులను పొందుపర్చాలని కోరింది.

**జాతీయ ప్రణాళిక సంఘం మార్గదర్శకాలు**

2004 సంవత్సరంలో కాంగ్రెస్ పార్టీ నాయకత్వా ఏర్పడిన యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్ (యుపిఎ) ప్రభుత్వం నియమించిన ప్రణాళిక సంఘం ఎస్‌సి ఉప ప్రణాళిక (ఎస్‌సిఎస్‌పి)ను, సక్రమంగానూ, సమగ్రంగానూ అమలు జరగటానికి ఒక ప్రత్యేక కమిటీని నియమించింది. అక్టోబర్ 27, 2005న సమావేశమైన ప్రణాళికసంఘం కమిటీ నియామకంతోపాటు ఉప ప్రణాళిక అమలును క్షుణ్ణంగా సమీక్షించింది. దానికి తగ్గట్టుగా **కొన్ని** నిర్దిష్టమైన సూచనలు కూడా చేసింది.

**అవి:**

1. ఎస్‌సి ఉప ప్రణాళిక; టిఎస్‌పి కోసం రాష్ట్ర ప్రణాళిక నిధుల నుంచి కనీసం జనాభా దామాషా ప్రకారం కేటాయించాలి.
2. ఈ నిధులను ఇతర శాఖలకు దారిమళ్ళించడంగాని, ఖర్చుకాలేదనే పేరుతో రాష్ట్ర ఖజానాకు తిరిగి ఇచ్చివేయడంకాని జరగకూడదు.
3. సాంఘిక సంక్షేమ శాఖ, గిరిజన సంక్షేమశాఖలను నోడల్ ఏజన్సీలుగా నియమించి కార్యక్రమాల రూపకల్పన అమలు బాధ్యత వాటికి అప్పగించాలి.
4. ఎస్సీ, ఎస్టీల అభివృద్ధి కోసమే ఈ నిధులను ప్రత్యేకంగా ఖర్చుచేయాలి.
5. బడ్జెట్‌లో వీటి ఖర్చులు నిర్వహణ కోసం ప్రత్యేకమైన సబ్ హెడ్‌లను ఏర్పాటు చేయాలి.

ఎస్‌సి ఉప ప్రణాళిక,టిఎస్‌పి నిధులతో రూపొందించిన కార్యక్రమాల కోసం నిధులలో కొరత ఏర్పడితే కేంద్ర ప్రభుత్వం నుంచి స్పెషల్ సెంట్రల్ అసిస్టెన్స్(ఎస్‌పిఎ) పొందడానికి ప్రణాళికలు తయారుచేసి పంపిచాలి.

**సూచనలు:**

1. ఎస్సీ,ఎస్టీ కుంటుంబాల ఆర్థికాభివృద్ధి కోసమే ఈ నిధులను ఖర్చు చేయాలి.
2. ఈ నిధులను ప్రత్యేకించి గ్రామీణ ఉపాది పథకాలు క్రింద ఖర్చు చేయకూడదు. వ్యవసాయము దాని అనుబంధ కార్యకలాపాలైన పశుపోషణలాంటి ఆర్థిక అభివృద్ది

కార్యక్రమాలకు మాత్రమే ఖర్చు చేయాలి.

3. వినూత్నంగా వుంటూ త్వరితగతిన దళితులు అభివృద్ధి చెందడానికి వీలయ్యే పథకాలకు ప్రాధాన్యతనివ్వాలి.

మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాలు ఈ పథకాలను కొంతవరకు అమలుచేస్తుండగా మన రాష్ట్ర ప్రభుత్వం వాటిని పట్టించుకోడంలో విఫలమైంది.

ఈ విషయాలపై మూడు సంవత్సరాల క్రితం అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వాధినేత ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర్ రెడ్డికి మొదట్లోనే సిడిఎస్ నుంచి ఒక విజ్ఞాపనను అందచేయడం జరిగింది. మహారాష్ట్రలో లాగా సాంఘిక సంక్షేమ, గిరిజన సంక్షేమ శాఖలను నోడల్ ఏజెన్సీలుగా ఏర్పాటుచేసి అవి ప్రభుత్వ విభాగాల నిధులను ఒక దగ్గర చేర్చి, ఆ రెండు శాఖలకు వాటిని వినియోగించే బాధ్యతను ఇవ్వాలని అందులో కోరడం జరిగింది. ముఖ్యమంత్రి వై.ఎస్ రాజశేఖర్ రెడ్డి దీనికి సుముఖత వ్యక్తం చేశారు. ఆ దిశగా కొన్ని చర్యలు తీసుకుంటున్నట్టు, సెంటర్‌ఫర్ దళిత్ స్టడీస్(సి.డి.ఎస్.)కు లిఖిత పూర్వకంగా తెలిపారు. బడ్జెట్ రూపకల్పన జరిగింది కాని అందులో దీని ప్రస్తావన లేదు. ఆలస్యం ఎందుకు జరుగుతుందో కారణాలు తెలియవు. ఇప్పటికే దళితులు, ఆదివాసులు తమకు రావాల్సిన వేలకోట్ల రూపాయల నిధులను పోగొట్టుకున్నారు. ఇప్పటికైనా ప్రజాప్రతినిధులు, రాజకీయ పార్టీలు, సంఘాలు ఈవైపుగా దృష్టి సారించి ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకువచ్చి ఎస్సీ సబ్ ప్లాన్ (ఎస్.సి.పి), ట్రైబల్ సబ్‌ప్లాన్ (టి.ఎస్.పి) లను సమర్ధవంతంగా అమలు జరపడానికి మహారాష్ట్ర నమూనాను మన రాష్ట్ర ప్రభుత్వం అనుసరించేటట్టు చేస్తే బాగుంటుంది.

దళితుల సమగ్రాభివృద్ధి జరగాలంటే బడ్జెట్‌లో షెడ్యూల్డు క్యాస్ట్ సబ్ ప్లాన్ సక్రమంగా అమలు కావాలి.

విద్య, ఉపాధి, ఆర్థికాభివృద్ధిలాంటి అంశాలలో ఈ బడ్జెట్‌ను ఖర్చు చేయాలనేది నిబంధనగా వున్నది. ప్రస్తుత సంవత్సరం (2007-08) ప్రణాళిక బడ్జెట్ 31 వేల కోట్లు. అందులో ఎస్సీల జనాభా ప్రాతిపదికన 16.2 % కేటాయిస్తే 5022 కోట్లను ఎస్సీలకు కేటాయించాలి. కాని ఈ రోజున ఎస్సీల ప్లాన్ బడ్జెట్ 1145 కోట్లుగా చూపెట్టారు. మిగతావి ఆయా ప్రభుత్వ విభాగాల్లో ఖర్చు చేస్తున్నట్టు లెక్కలు చూపెడుతున్నారు.. దానివల్ల ఎటువంటి ప్రయోజనం కలగటంలేదు. అందువల్ల అన్ని రాజకీయ పార్టీలు, సంస్థలు, దళిత సంఘాలు స్పెషల్ కాంపొనెంట్ ప్లాన్ అమలుకు ప్రణాళిక సంఘం ఆదేశాల ప్రకారం నోడల్ ఏజెన్సీ కోసం ప్రభుత్వం పై ఒత్తిడి తీసుకురావలసివుంది. అప్పుడు మాత్రమే దళితుల అభివృద్ధికి ఒక స్పష్టమైన కార్యరూపం ప్రారంభమవుతుంది.

### కెవిపిఎస్ నిరంతర ప్రయత్నాలు

కులవివక్ష వ్యతిరేక పోరాట సంఘం (కెవిపిఎస్) ఎస్‌సిపి అమలు కోసం రాష్ట్రంలో నోడల్ ఏజెన్సీని ఏర్పటు చేయాలని కెవిపిఎస్ ఉపాధ్యక్షుడు బి.వి. రాఘవులు ఆధ్వర్యంలో నిరవధిక నిరాహార దీక్షలను చేపట్టింది. 5 రోజుల తర్వాత ప్రభుత్వం దిగివచ్చి నోడల్ ఏజెన్సీ ఏర్పాటు కోసం అంగీకరిస్తూ ముఖ్యమంత్రి ప్రతినిధి బృందంగా ఆనాటి సాంఘిక శాఖ మంత్రి రెడ్యానాయక్, మున్సిపల్ అర్బన్ డెవలప్‌మెంట్ మంత్రి కోనేరు రంగారావు, చిన్న నీటి పారుదల మంత్రి మూలిగింటి మరెప్ప, తదితరులను దీక్ష శిబిరానికి పంపి ప్రభుత్వం చర్చలు జరిపింది. ఫిబ్రవరి 27, 2007 న ఆనాటి సాంఘిక శాఖ మంత్రి రెడ్యానాయక్ శిబిరంలో నిమ్మ రసం ఇచ్చారు. దాంతో పాటు శాసనసభలో ముఖ్యమంత్రి స్వయంగా ప్రకటన చేశారు. మరోసారి 2007 జూలై 24న శాసనసభలో ముఖ్యమంత్రి స్వయంగా ప్రకటించారు. నోడల్ ఏజెన్సీ ఏర్పాటు చేయబోయే ముందు ఒక ప్రతినిధి వర్గాన్ని మహారాష్ట్రకు పరిశీలనకోసం పంపిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఒక కమిటీని కూడా నియమించింది. అందులో శాసన సభ్యులు దారా సాంబయ్య(ఎస్సీ), డా॥కె. రవిబాబు (ఎస్టీ)లతో పాటు సాంఘిక సంక్షేమ శాఖ, గిరిజన సంక్షేమ శాఖ, గిరిజన సంక్షేమ శాఖ, ఆర్థిక, ప్రణాళిక శాఖల ముఖ్య కార్యదర్శులను సభ్యులుగా నియమించారు. ఇప్పటికే ఆ కమిటీ ప్రభుత్వానికి నివేదికను అందించింది. ఈ నివేదికను తుంగలోతొక్కి నోడల్ ఏజెన్సీ ఏర్పాటు చేయకుండానే అపెక్స్ బాడీ ఏర్పటు చేస్తూ జి.ఓ.నెం:77,తేది:18.09.2007 ను విడుదల చేసింది.

దళిత సంక్షేమానికి బడ్జెట్ కేటాయింపులు సరిగా లేవని, కేటాయించిన నిధులు దారి మళ్ళిస్తున్నారని కాగ్ తప్పు పట్టింది. రాష్ట్రంలో స్పెషల్ కాంపొనెంట్ ప్లాన్ అమలుపై జాతీయ ప్లానింగ్ కమీషన్ సైతం ఆందోళన వ్యక్తం చేసింది. కేటాయింపుల వివరాలు తెలియజేయాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని ప్లానింగ్ కమీషన్ ఆదేశించింది. వాస్తవాలు ఈ రకంగా ఉంటే దళితుల సంక్షేమం కోసమే పని చేస్తున్నామని ముఖ్యమంత్రి బాకా ఉదుకుంటున్నారు. నోడల్ ఏజెన్సీ ఏర్పటు చేస్తే సబ్ ప్లాన్ నిధులు కాజేయడం కుదరదనే మాట మార్చారు.

జి.ఓ.నెం: 77 ను రద్దు చేసి, నోడల్ ఏజెన్సీని ఏర్పాటు చేస్తామని శాసనసభలో వాగ్దానం చేసిన ముఖ్యమంత్రి అఖిలపక్ష సమావేశంలో నోడల్ ఏజెన్సీని ఏర్పాటు చేస్తామని అనలేదని మాట మార్చారు. వై.ఎస్. ప్రభుత్వం ఇందిరమ్మ పేరుతో దళితులను మోసం చేస్తున్నది. ఎస్సీ, ఎస్టీల బడ్జెట్‌కు కోత విధించి పెద్దలకు ఖర్చు చేసేందుకే దళితులకు ద్రోహం చేసేందుకు ముఖ్యమంత్రి శాసనసభలో ఇచ్చిన హామీని తుంగలో తొక్కారు.

### ఛలో అసెంబ్లీ

నోడల్ ఏజెన్సీ ఏర్పాటు చేయాలని దళిత, గిరిజన, ప్రజా సంఘాలను కలుపుకోని 2007 నవంబర్ 14న ఛలో అసెంబ్లీ నిర్వహించాలని పిలుపు నిచ్చాయి. ఎస్సీ, ఎస్టీలకు రావల్సిన బడ్జెట్‌ను ప్రత్యేకంగా కేటాయించి ఖర్చు చేసేందుకు నోడల్ ఏజెన్సీని వెంటనే ఏర్పటు చేయాలి. ఈ ఉద్యమానికి అన్ని రాజకీయ పార్టీలు, విద్యార్థి, యువజన, కార్మిక సంఘాల మద్దతు ఇవ్వాలని కోరుతున్నాం.



# లాటిన్ అమెరికాలో విప్లవానికి సంఘీభావం పలకండి!

జాన్ బెల్లమీ ఫోస్టర్

**మానవత్వ పరిమళాల్ని విరజిమ్ముతున్న బొలివేరియన్ విప్లవాగ్నిని నిలుపుకోవడానికి వెనిజులా చేస్తున్న కృషికి మనవంతు సాయమూ చేద్దాం రండి! లాటిన్ అమెరికా దేశాల్లో మానవ నాగరిక వికాసానికై గురవుతున్న పోరాటాలకు అండగా నిలబడదాం రండి!! ఖబడ్దార్ అమెరికా, వెనిజులామీద చేతులేస్తే మేం ఊరుకునేది లేదని నినదిద్దాం, రండి...!!!**

అమెరికా ఆధిపత్యానికి వ్యతిరేకంగా లాటిన్ అమెరికా దేశాలు తిరుగుబాటు చెయ్యడం 21 శతాబ్దపు నూతన చారిత్రక ఘటనలుగా గుర్తుండిపోతాయి. నోమ్ ఛోమ్‌స్కీ మాటల్లో చెప్పాలంటే "శతాబ్దాలుగా సాగుతున్న సామ్రాజ్యవాద ఆధిపత్య శృంఖలాలను బద్దలుకొట్టుకొని లాటిన్ అమెరికా దేశాలు తాము కోల్పోయిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను గెలుచుకుంటున్నాయి". అమెరికా అధికారాన్ని సవాలు చేస్తున్న పరిణామాలు నానాటికీ అమెరికా ప్రభుత్వాన్ని కలవరపరుస్తున్నాయి. విదేశీ వ్యవహారాల శాఖలో పనిచేస్తున్న జూలియా స్వీజ్ దృష్టిలో 'ఈ 21వ శతాబ్దం అమెరికన్ వ్యతిరేక శతాబ్దం! అమెరికా సామ్రాజ్యంపట్ల అసహ్యత తీవ్రమవుతోంది. ఇరాక్ యుద్ధంవల్ల అమెరికా మూట కట్టుకుంటున్న ప్రతిఘటన కన్నా నేడు లాటిన్ అమెరికా దేశల్లోని రాజకీయ సమీకరణాల్లో వస్తున్న మార్పులు అమెరికా అడుగుజారిపోయేంత తీవ్రస్థాయిలో ఉన్నాయి.

1823 నాటి మాన్రియో చట్టం, 1904 నాటి రూజ్‌వెల్ట్ శాసనాల వల్ల అమెరికా ఖండంలో ఎక్కడైనా సరే ముందస్తు దాడులు చేసేందుకు అమెరికాకు అధికారాలు దాఖలు పడ్డాయని జూలియా స్వీజ్ సమర్ధించుకుంటున్నారు. కానీ లాటిన్ అమెరికా దేశాల అనుభవం, ఆలోచనలు మరోవిధంగా ఉన్నాయి. అమెరికా ఆధిపత్యాన్ని రుద్దడానికి ముందస్తు దాడులే జరగనక్కరలేదు. జాతీయ ప్రయోజనాల పేరిట, విలువల పేరిట, మార్కెట్ పేరిట, ప్రజాస్వామ్యం పేరిట, జాతి నిర్మాణం పేరిట మెక్సికో, క్యూబా, హైతీ, హొండురాస్, కోస్టారికా, డొమనికన్ రిపబ్లిక్ ప్రజల సార్వభౌమత్వంపై అమెరికా తన ఆధిపత్యాన్ని రుద్దింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికన్ పాలకులు చీటికీ మాటికీ లాటిన్ అమెరికా దేశాల్లో జోక్యం చేసుకుంటూనే వచ్చారు. ఇదో పెద్ద చరిత్ర. 1954-గ్వాటిమలా, 1961-క్యూబా, 1965-డొమనికన్ రిపబ్లిక్, 1970 నుండి 1989 వరకు-చిలీ, 1970-80 దశకంలో దక్షిణ అమెరికా దేశాల్లో నియంతలకు బాసటగా నిలవడం, మధ్య అమెరికా ఖండంలో తిరుగుబాట్లు, ప్రతిఘాత విప్లవాలు, మృత్యుదళాలను ఇష్టారాజ్యంగా ప్రేరేపించడం, గ్రెనడా, పనామా దేశాలను ఆక్రమించుకోవడం....ఒకటేమిటి, అమెరికా మూటకట్టుకోని పాపం లేదు. చిలీలో సాల్వడర్ అలెండీ ప్రజాస్వామ్య యుతంగా అధ్యక్షుడిగా ఎన్నికయితే తిరుగుబాట్లలో ఆ ప్రభుత్వాన్ని కూలదోశారు. పైపెచ్చు అప్పటి అమెరికా రక్షణ కార్యదర్శి హెన్రీ కిసింజర్ ఈ చర్యను నిసిగ్గుగా సమర్ధించుకుంటూ "లాటిన్ అమెరికా దేశాల్లో భిన్నత్వానికి కూడా ఒక హద్దులు ఉంటాయి. ఆ హద్దులేమిటో నిర్ణయించే హక్కు అమెరికాకు ఉంది" అని ప్రకటించాడు.

భిన్నత్వానికి, వైవిధ్యానికి హద్దులు గీసే క్రమంలోనే ఈ మధ్యనే మరోసారి అమెరికా ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికయిన వెనిజులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్‌కు వ్యతిరేకంగా సైనిక తిరుగుబాటు చేయించింది. ఈ ఎత్తు బెడిసికొట్టింది. అది వేరే సంగతి. ఇంతకన్నా ముందు కొలంబియాలో కోవర్టు ఆపరేషన్ చేపట్టింది. సైనిక బలగాలు ఛావెజ్‌ను బందీగా పట్టుకున్నాయని తెలిసిన మరుక్షణం లోనే అమెరికా తిరుగుబాటును బలపరిచింది. అసలీ తిరుగుబాటుకు అవసరమైన ప్రణాళిక, సరుకు సరంజామా, డబ్బూ దస్కం ఒకటేమిటి అన్నిరకాల సహాయ సహకారాలూ అమెరికాయే అందించింది. తిరుగుబాటుదార్లకు తక్షణమే రాయబార గుర్తింపు హోదా ఇవ్వడానికి సంసిద్ధత ప్రకటించింది. కానీ తిరుగుబాటును ప్రజలు విఫలం చేసి బందీగా ఉన్న ఛావెజ్‌ను విడిపించి తెచ్చి మళ్లీ అధ్యక్షపీఠం మీద కూడబెట్టారు. దాంతో అమెరికాకు దిమ్మతిరిగిపోయింది. "ఏం చేస్తాం ఈ శతాబ్దంలో అమెరికాకు ఎదురయిన ధిక్కార స్వరం ఛావెజ్" అని జూలియా స్వీజ్ ఓ ప్రకటన ఇచ్చి చేతులు దులిపేసుకున్నాడు.

ఛావెజ్ మొదలుపెట్టిన బొలివేరియన్ విప్లవం నేడు లాటిన్ అమెరికా దేశాల్లో అమెరికా ఆధిపత్యానికి వ్యతిరేకంగా తలెత్తిన తిరుగుబాట్లకు ప్రాథమిక నమూనాగా మారింది. అమెరికా దక్షిణార్ధగోళంలో నేడు తిరుగుబాట్ల వెల్లువ తలెత్తింది. సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో పెద్ద కుదుపు మొదలయ్యింది. 2005లో బొలీవియాలో జరిగిన ఎన్నికలలో సోషలిజమే శిరోధార్యం అంటున్న ఇవోమొరెల్స్ అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. వెనిజులా, క్యూబా, బొలీవియాలు ఒక కూటమి కట్టాయి. లాటిన్ అమెరికా-కరేబియన్ ప్రాంతాల 'బొలివేరియన్ ప్రత్యామ్నాయాన్ని' (ఎఎల్‌బిఎ) ముందుకు తీసుకువచ్చాయి. వీరికి ఈక్వెడార్

రచయిత అమెరికన్ సోషలిస్టు పత్రిక 'మంత్లీ రివ్యూ' పత్రిక సంపాదకుడు

> **"2005లో బొలీవియా ఎన్నికలలో సోషలిజమే శిరోధార్యం అంటున్న ఇవోమొరెల్స్ అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. వెనిజులా, క్యూబా, బొలీవియా కూటమి కట్టాయి. లాటిన్ అమెరికాలో 'బొలివేరియన్ ప్రత్యామ్నాయాన్ని' ముందుకు తీసుకువచ్చాయి. వీరికి ఈక్వెడార్ అధ్యక్షుడిగా ఎన్నికయిన రాఫెల్ కొర్రియా తోడయ్యాడు. 2006లో డేనియల్ ఒర్టెగా నికరాగువాకు అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. ఇక మెక్సికోలో జరుగుతున్న సామాజిక ఉద్యమాలకు తిరుగేలేదు."**

అధ్యక్షుడిగా ఎన్నికయిన రాఫెల్ కొర్రియా తోడయ్యాడు. 2006లో డేనియల్ ఒర్టెగా నికరాగువాకు అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. ఇక మెక్సికోలో జరుగుతున్న సామాజిక ఉద్యమాలకూ, నాటకీయ ఎన్నికల పరిణామాలకూ తిరుగేలేదు. 2006 మెక్సికో ఎన్నికలలో జరిగిన తొత్తడానికి వ్యతిరేకంగా ప్రజలు తీవ్ర ఆందోళనకు పూనుకున్నారు. ఒక్సాకా, చియాపస్‌లలో ప్రజా బాహుళ్య తిరుగుబాట్లు క్రమంగా పురోగమిస్తున్నాయి. బ్రెజిల్‌లో భూమిలేని పేదల ఉద్యమం పోటెత్తి సాగుతోంది. ప్రపంచ బ్యాంకు ఆదేశాలను అర్జెంటీనా లెక్కచెయ్యడం లేదు. తీసుకున్న అప్పు తిరిగి చెల్లించేందుకు సిద్ధంగా లేమని ప్రకటించింది. విదేశీ గుత్త సంస్థలు దేశీయ పరిశ్రమలను స్వాధీనం చేసుకునేందుకు చేస్తున్న ప్రయత్నాలను సాగన్విడం లేదు. అమెరికా ప్రాయోజిత (స్పాన్సర్డ్) 'అమెరికా ఖండాల స్వేచ్ఛా వాణిజ్య కూటమి'లో చేరడానికి అర్జెంటీనా నిరాకరించింది. వెనిజులా, క్యూబా, బొలీఫియా తదితర బొలివేరియన్ విప్లవ దేశాలు ఏర్పాటు చేసుకున్న 'మెర్కసుర్‌లో' (ప్రాంతీ పరస్పర వాణిజ్య సహకార మండలి) భాగస్వామి అయ్యింది. 'ప్లాన్ కొలంబియా' పేరిట అమెరికా కొలంబియాలో చేస్తున్న దాష్టీకాన్ని విప్లవ సాయుధ దళాలు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నాయి. క్యూబా కూడా కాస్ట్రో అనంతర ప్రభుత్వాన్ని ఎలా నడపాలనే బాలారిష్ట దశను సరైన దశలోనే అధిగమించింది. ఈ పరిణామాలన్నీ లాటిన్ అమెరికా దేశాల్లో బహుముఖ సామాజిక మార్పులకు గట్టి ఊతంగా నిలిచాయి.

గత చరిత్రను తరచి చూచి, మనం మాట్లాడుకుంటే అమెరికన్ పాలకవర్గాలూ, విదేశాంగ విధానాన్ని రూపొందించే పెద్ద మనుషులూ కలిసి నూతన ప్రపంచ క్రమాన్ని (న్యూ గ్లోబల్ ఆర్డర్) ఈ భూమ్మీద నెలకొల్పడానికి వీలుగా లాటిన్ అమెరికా దేశాలను ముందస్తుగా ఒక ప్రయోగశాలగా మార్చుకున్నాయి. ప్రపంచ ఆర్థికవ్యవస్థ మాంద్యంలో నడుస్తున్నందువల్ల పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి పేరిట నయా ఉదారవాద విధానాల్ని రంగంమీదకు తీసుకువచ్చింది. ప్రజలకు అప్పటిదాకా కల్పిస్తున్న సంక్షేమ చర్యలకు రాజ్యం స్వస్తి చెప్పి, పెట్టుబడి ప్రవాహాలమీద ఉన్న రాజ్య నియంత్రణలను ఎత్తివెయ్యాలనేదే నయా - ఉదారవాద విధానాల కీలక మంత్రాంగం. లాటిన్ అమెరికా దేశాల్లో ఈ మంత్రాంగాన్ని పారించటానికి అమెరికన్ పెట్టుబడిదారీ విధానం నిసిగ్గుగా ఆ దేశాల్లో ప్రజాస్వామ్యానికి పాతరవేసి నియంతలకు దేశాలు ఏలే అవకాశం కల్పించింది. వర్ధమాన దేశాలు అప్పుల సంక్షోభం నుండి గట్టెక్కడానికి ఉదారవాద విధానాలు అవలంభించాలని పైకి ఎన్ని సుద్దులు చెప్పినా నిజానికి ఆ దేశాలు అప్పుల సంక్షోభంలో మునగడానికన్నా (1980) ముందే నయా-ఉదారవాద విధానాలకు తెరతీయడం మనం గమనించాలి. నియంతలకూ, నయా-ఉదారవాద విధానకర్తలకూ మధ్య బంధం ఎంతగా బలపడిందో చెప్పుకోవడానికి, చిలీ నియంత పినోచెట్, చికాగో స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ ప్రతినిధి మిల్టన్ ఫ్రెడ్‌మన్‌ల మధ్య దోస్తీని గుర్తుకు తెచ్చుకుంటే చాలు. అర్జెంటీనాలో పెరోనిస్టు మెనెమ్, ఉరుగ్వేలోని బ్లాంకో, కొలంరాడే వంటి సంప్రదాయ పార్టీలు, బొలీవియాలో మిర్-బాంజర్ సంకీర్ణం, వెనిజులాలోని 'ఎడెకో'కోపై', బ్రెజిల్‌లో ఫెర్నాండో హెన్రిక్ కార్డోసా నాయకత్వంలో ఉన్న 'పార్టిడో సోషల్ డెమొక్రటిక్ బ్రెజిల్', మెక్సికో దేశంలో 'పిఆర్ఐ పార్టీ'లోనే ఉన్న అమెరికా అనుకూల వాదులు.... వీరంతా మనకు ఏం నూచిస్తుంటారూ? ఆయా దేశాల్లో నయా-ఉదారవాద విధానాలను పక్కాగా, సంఘటితంగా అమలు చెయ్యడానికి కంకణం కట్టుకున్న వాళ్లనే కదూ. ఇది నేను అన్నమాట కాదు. బ్రిటన్‌లోని మిడిల్‌సెక్స్ యూనివర్శిటీలో లాటిన్ అమెరికా దేశాల అధ్యయన విభాగపు అధిపతి ఫ్రాన్సిస్కో డిమినిగెజ్ చెప్పిన విషయాలు.

అమెరికా పనుపున అనుసరించిన ఈ నయా-ఉదారవాద విధానాల వల్ల లాటిన్ అమెరికా దేశాల ఆర్థికవ్యవస్థలు కుదేలయిపోయాయి. 1980వ దశకం వరకూ ఆయా దేశాలు సాధించామని చెప్పుకున్న ఆర్థిక ప్రగతీ హరించకుపోయింది. అందుకే దీన్ని 'చేజారిన దశాబ్దం' (లాస్ట్ డికేడ్) అనేవారు. 80వ దశకం నాటికి లాటిన్ అమెరికా దేశాల్లో 41 శాతంగా ఉన్న పేదరికం 90వ దశకానికల్లా 48 శాతానికి పెరిగింది. 2002 నాటికి కూడా 44 శాతం దగ్గరే ఉంది. లాటిన్ అమెరికా దేశాల్లో నివసిస్తున్న 97 లక్షల మంది ప్రజానీకం అంటే అక్కడి మొత్తం జనాబాలో సగంమంది-రోజుకు ఒక డాలరు (మన రూపాయల్లో సుమారు 41) సంపాదనతో కటిక పేదరికం అనుభవిస్తున్నారు. కాని 1980ల తరువాత ఈ దేశాల్లో కోటీశ్వరుల సంఖ్య నాలుగురెట్లు పెరిగింది.

ఇందువల్లనే నేడు లాటిన్ అమెరికా దేశాల్లో తిరుగుబాట్లు మొదలయ్యాయి. అమెరికన్, ఐరోపా పెట్టుబడిదారీ దేశాలు-ఈ దేశాల ప్రయోజనాలు కాపాడేందుకు రూపొందించుకున్న ఐఎంఎఫ్, ప్రపంచబ్యాంకులు లాటిన్ అమెరికా దేశాలమీద రుద్దిన నయా ఉదారవాద విధానాలను కూలదోసే కార్యక్రమం ప్రారంభమయింది. "బొలీవియా ప్రజల తిరుగుబాటుకూ, ఇప్పటిదాకా అణగారిన ప్రజానీకం మీద సాగించిన రక్తపాత దాడులకూ ఒక పేరుంది, అదే నయా-ఉదారవాదం" అంటాడు ఇవోమొరెల్స్. నేడు లాటిన్ అమెరికా దేశాల్లో జరుగుతున్న పోరాటాలు అనివార్యంగా అమెరికా సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ విధానాలకు వ్యతిరేకంగానూ, ఆయా దేశాల్లో ఉన్న 'దోపిడీ' సంబంధాలకు వ్యతిరేకంగానూ అతివాద (రాడికల్) ప్రభావాలు చూపుతున్నాయి. అందుకే ఈ పోరాటాలకు నాయకత్వం వహించేశక్తులు, సామ్రాజ్యవాద వ్యతిరేక, పెట్టుబడిదారీ వ్యతిరేక సోషలిస్టు భావజాలానికి కట్టుబడి ఉంటున్నాయి. ఈ దేశాలన్నింటా సామాజిక ఉద్యమాలతోపాటు, వర్గ పోరాటాలూ జరుగుతున్నాయి. ఈ దేశాల మధ్య కొన్ని ఉద్రిక్తతలు నెలకొని ఉన్నప్పటికీ మొత్తంగా

చూస్తే నేడు ప్రపంచవ్యాప్తంగా లాటిన్ అమెరికా దేశాల పోరాటాలకు పెద్దఎత్తున సంఘీభావం లభిస్తోంది.

'బొలివేరియన్ ప్రత్యామ్నాయ' వేదిక ఇందుకు మంచి ఉదాహరణ. తొలిగా వెనిజులా -క్యూబా దేశాల మధ్య పొత్తుకే పరిమితం అయిన ఈ వేదికలో ఇప్పుడు ఈక్వెడార్ వచ్చి చేరింది. లాటిన్ అమెరికా దేశాలు ఉన్న దక్షిణ అమెరికా ఖండంపై అమెరికా ఉత్తరఖండం ఫైనాన్స్ పెట్టుబడి ద్వారా బిగించిన ఉక్కు పిడికిలి నుండి దక్షిణాది దేశాలను విముక్తం చెయ్యడానికి 'పరస్పర సహకారం' ఆధారంగా 'అభివృద్ధి ప్రాజెక్టులు' చేపట్టింది. వెనిజులా అందించే చమురుకు బదులుగా క్యూబా 20,000 మంది డాక్టర్లను వెనిజులా పేద ప్రజలకు సేవలు అందించడానికి పంపించింది. అక్షరాస్యత, మీడియా రంగాలతోపాటు పెట్రో కెమికల్స్ వంటి భారీ ప్రాజెక్టుల నిర్మాణంలో కూడా ఈ సహకారం నెలకొన్నది. తాజాగా దక్షిణ అమెరికా దేశాలకు ఒకే బ్యాంకు, ఒకే కరెన్సీ ఏర్పాటు చేసుకునే ప్రయత్నాల్లో ఉన్నాయి.

> **"లాటిన్ అమెరికా దేశాల్లో పొడచూపిన ఈ 'వామపక్ష మొగ్గ' అమెరికన్ పాలకులు గ్రహించకపోలేదు. దీన్ని మొగ్గలోనే తుంచి వెయ్యాలని 2002లోనే సైనిక తిరుగుబాటుద్వారా ప్రయత్నించి భంగపడింది. ఐనా తన కుటిల ప్రయత్నాలను మానుకోలేదు."**

లాటిన్ అమెరికా దేశాల్లో పొడ చూపిన ఈ 'వామపక్ష మొగ్గ' అమెరికన్ పాలకులు గ్రహించకపోలేదు. దీన్ని మొగ్గలోనే తుంచి వెయ్యాలని 2002లోనే సైనిక తిరుగుబాటుద్వారా ప్రయత్నించి భంగపడింది. ఐనా తన కుటిల ప్రయత్నాలను మానుకోలేదు. మరీ ముఖ్యంగా వెనిజులాలో అయితే ఆయిల్ కంపెనీ యజమానుల పనుపున సమ్మెలు చేయించింది. లాకౌట్లు ప్రకటించేలా చేసింది. ప్రజాస్వామ్యం అంటూ గగ్గోలు చేసి రిఫరెండం నిర్వహించాలని ప్రతిపక్ష నేతలతో డిమాండు చేయించి వారికి సకల సాయాలూ అందించింది. అయినా ఈ ఎత్తులు చిత్తయ్యాయి. ఛావెజ్ రిఫరెండంలో కూడా అఖండ మెజారిటీతో విజేతగా నిలిచాడు. కడుపాత్రం ఆపుకోలేక అమెరికా రక్షణ మంత్రిగా పనిచేసిన డొనాల్డ్ రమ్స్‌ఫెల్డ్ రిఫరెండంలో ఛావెజ్ గెలుపును, జర్మనీ ఛాన్సలర్‌గా హిట్లర్ ఎంపికతో పోలుస్తూ 2006 ఫిబ్రవరిలో ఒక ప్రకటన చేశాడు. 2002 సైనిక తిరుగుబాటు ప్రేరేపించడంలో తనవంతు పాత్ర పోషించిన 'రేడియో కారకాస్ టీవీ' లైసెన్స్‌ను ఛావెజ్ పునరుద్ధరించక పోవ దాన్ని, అమెరికా రక్షణశాఖ కార్యదర్శి కొండె లీజా రైస్ తూర్పార పట్టింది. ప్రజాస్వామ్యం గొంతు నులుముతున్నారని గగ్గోలు పెట్టింది. 'ప్రజాస్వామ్య' టీవీలు సైనిక తిరుగుబాటును ప్రేరేపించడాన్ని మాత్రం కావాలనే ఉపేక్షిస్తున్నారు ఈ పెద్దలు.

ఇప్పుడు వాషింగ్టన్ తలకు చుట్టుకున్న అతిపెద్ద సమస్య వెనిజులా. ఛావెజ్‌ను ఎలా గద్దె దించాలన్నదే దాని బాధ. మార్క్సిజం, మావోయిజం లాగా 'ఛావెజిజాన్ని' ఎలా దెబ్బకొట్టాలి? బొలివేరియన్ విప్లవానికి ఎలా గండి కొట్టాలి? ఇవీ 'శ్వేత సౌధాన్ని' తొలిచేస్తున్న సమస్యలు. లాటిన్ అమెరికా ఖండాన్ని తమ అదుపాజ్ఞలలో ఉంచుకోవడానికి ఇదొక్కటే మార్గంగా సామ్రాజ్యవాద పాలకులు భావిస్తున్నారు. ఇందుకు విదేశీ రాయబార మార్గాలను కూడా వదులుకోదల్చలేదు. బుష్ అధికార యంత్రాంగంలో విధానమండలి డైరెక్టరుగా




**లాటిన్ అమెరికాలో ప్రభుత్వాల తీరుతెన్నులు**

> **❝ అయినా లాటిన్ అమెరికా దేశాల భవితవ్యం పట్ల మనం ఆశావహంగా ఉండొచ్చు. ఎందుకంటే నేడు ఆ దేశాల ప్రజలు చేస్తున్న పోరాటాలకు ప్రపంచ వ్యాప్తంగా లభిస్తున్న 'సంఘీభావం' మనకు ఆ నిశ్చింతను కలిగిస్తోంది. 'అమెరికన్ జోక్యాన్ని కట్టడి చేసే బలం ఈ సంఘీభావ శక్తులకే ఉంది. ❞**

పనిచేసి ప్రస్తుతం విదేశాంగ వ్యవహారాల మండలి అధ్యక్షుడుగా ఉన్న రిచర్డ్ హాస్ ఏమంటున్నాడంటే..."మేం ఇప్పుడొక దీర్ఘకాలిక వ్యూహాన్ని రూపొందించాం. ఛావెజ్ అంటే ఉన్న క్రేజ్‌ను అతని అధికారాన్ని మేం నీరుగార్చాలి".

ఇందులో భాగంగానే వెనిజులాలోనే కాకుండా, ఆ దేశానికి బయట ఉన్న దేశాల్లో కూడా ఛావెజ్‌కు వ్యతిరేకంగా పనిచేసే శక్తులను అమెరికా కూడగడుతోంది. స్వయానా బుష్ లాటిన్ అమెరికా దేశాలు పర్యటించి వివిధ దేశాలతో వాణిజ్య ఒప్పందాలమీద సంతకాలు చేశాడు. దేశ, విదేశీ వ్యవహారాలలో ఇప్పుడు కొన్ని ఎర్రగీతలు' ఏర్పాటు చేశారట అమెరికన్ పాలకులు. ఛావెజ్ కనుక ఈ హద్దులు దాటితే వెనిజులానూ, బొలివేరియన్ ప్రత్యామ్నాయాన్నీ ఒంటరిపాటు చేసేందుకు తక్షణమే రంగంలోకి దిగుతారట?!

'ట'కారం ఉపయోగించాను కదా అని ఇవి నా ఊహలు అని అనుకోకండి. 'లండన్ ఫైనాన్షియల్ టైమ్స్'లో లాటిన్ అమెరికా కరస్పాండెంట్‌గా పనిచేస్తున్న రిచర్డ్ లెప్పర్ 'హ్యూగోతో సహజీవనం' (లివింగ్ విత్ హ్యూగో) అని ఒక పుస్తకం రాశాడు. ఇందులో పొందుపరిచిన ముందుమాటలో 'రాజకీయ కార్యాచరణ కేంద్రం' పేరికన సైనన్‌ను ఉదహరించిన రిచర్డ్ అభిప్రాయాలను ఉటంకించారు. ఈ పుస్తకం సారాంశం అతి క్లుప్తంగా మనం చెప్పుకోవాల్సి వస్తే...."బొలివేరియన్ విప్లవంతో ప్రధానంగా ఉన్న ముప్పు ఏంటంటే, దాని పెట్టు బడిదారీ వ్యతిరేక ధర్మయుద్ధ పోకడలు. వెనిజు లాను అణగదొక్కాలంటే అందుకు అనువైన బయటి మార్గాలు మూసుకుపోకూడదు. బ్రెజిల్, చిలీ, అర్జెంటీనా, మెక్సికోలు కూడా ఛావెజ్ ప్రభావంలోకి వస్తే ఇక ఎర్రగీతల చదరం పూర్త యినట్లే. దీన్ని నిలువరించాలి. అందుకోసం ఎర్రగీతల దరిదాపుల్లో ఉన్న పై నాలుగు దేశాలతో స్నేహబంధం బలపరుచుకోవాలి. ఛావెజ్ ఏదన్నా ఉపద్రం తీసుకువచ్చే ప్రమాదం ఉందని ఉప్పందగానే ఈ నాలుగు దేశాల సహకారంతో 'ఉమ్మడి ముందస్తు దాడులకు' వీలయ్యే వెసులుబాటును మనచేతిలో ఉంచు కోవాలి.

మరి ఛావెజ్ ఏదన్నా ఉపద్రవం తీసుకురాబోతున్నాడనేది ఎలా గ్రహించాలి. (1) రాజ్యాంగాన్ని సవరించి దేశాధ్యక్షుడిగా తన పదవీ కాలం పొడిగించుకోవడం (2) ఇతర దేశాలలో విచ్ఛిన్న శక్తులకు (?) ఛావెజ్ మద్దతు ఇవ్వడం (3) అమెరికా శతృదేశాలయిన ఇరాన్ తదితర ఏ దేశంతోనైనా మిలిటరీ సంబంధాలు నెలకొల్పుకోవడానికి ప్రయత్నించడం. (4) ఇక చివరాఖదీ, ఎప్పుడు కావాలనుకున్నా ఉపయోగించుకొనే అస్త్రంలాంటిదీ....వెనిజులా 'ప్రజాస్వామ్యానికి' ఛావెజ్ హాని తలపెట్టాడని అమెరికా భావించే ఎలాంటి చర్యలు చేపట్టినా, ముందస్తు దాడులకు పూనుకోవడం"

ఇదీ బొలివేరియన్ విప్లవాన్ని అణగదొక్కడానికి అమెరికన్ పాలకులు రచించిన ప్రణాళిక. ఇందులో చివరాఖరి అస్త్రాన్ని అప్పుడే ఉపయోగంలోకి తెచ్చారు కూడా. 'రేడి యో కారకాస్ టీవీ'కి లైసెన్స్ పునరుద్ధరించ కపోవడం 'ప్రజాస్వామ్యం' గొంతు నులపడమే అన్న ప్రచారం ఇందులో భాగమే. 'హ్యూమన్ రైట్స్‌వాచ్' సంస్థ దీన్ని 'భావ ప్రకటనా స్వేచ్ఛకు తీవ్ర విఘాతం' అని నిరసించింది. ఇందులో వింత ఏం ఉందీ? ఈ మానవహక్కుల వేదిక ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ కెన్నెత్ రూత్ బొలివేరియన్ విప్లవాన్ని కూల్చడానికి రాజకీయ కార్యాచరణ కేంద్రాన్ని రచించిన అమెరికన్ విదేశాంగ వ్యవహారాల మండలిలో సభ్యుడు కూడానాయె. ఇప్పటిదాకా సిఐఎ అనేక దేశాల్లో చేపట్టిన హీనాతిహీనమైన చర్యలు అన్నింటికీ ధన, కనక, వస్తు, వాహనాలన్నింటినీ సమకూర్చేది ఈ మండలే. కాబట్టి 'హ్యూమన్‌రైట్స్ వాచ్' 'వెనిజులాలో భావ' ప్రకటనా స్వేచ్ఛకు కలిగిన విఘాతం గురించి మాట్లాడడంలో వింత ఏముంది? అమెరికా పాలకవర్గాల చరిత్రను తరచి చూస్తే చరిత్రలోనే హీనాతిహీనంగా చెప్పుకోదగిన ఎంతటి దారుణ మారణ నేరాల కయినా పూనుకోవడానికి వెనుదీసిన సందర్భమే లేదు. అందులోనూ నేడు లాటిన్ అమెరికా దేశాల ప్రజలు సాగిస్తున్న విముక్తి పోరాటాలు, పెట్టుబడిదారీ వ్యతిరేక ధర్మయుద్ధం(క్రూసేడు)' అమెరికా సామ్రాజ్య పునాదినే బీటలు వారుస్తున్న నేపథ్యంలో అమెరికన్ పాలకులు చోద్యం చూస్తూ కూచుంటారా? కూర్చోరు.

అయినా లాటిన్ అమెరికా దేశాల భవితవ్యం పట్ల మనం ఆశావహంగా ఉండొచ్చు. ఎందుకంటే నేడు ఆ దేశాల ప్రజలు చేస్తున్న పోరాటాలకు ప్రపంచవ్యాప్తంగా లభి స్తున్న 'సంఘీంభావం' మనకు ఆ నిశ్చింతను కలిగిస్తోంది. 'అమెరికన్ జోక్యాన్ని కట్టడి చేసే బలం ఈ సంఘీభావ శక్తులకే ఉంది.

చివరిగా, ఐక్యరాజ్యసమితిని ఉద్దేశించి ప్రసంగిస్తూ ఛావెజ్ ఏం చెప్పాడో మీకు ఒక్కమాట గుర్తుచేస్తాను.

"మా పోరాటం వెనిజులా బాగోగుల కోసం. లాటిన్ అమెరికా, ప్రపంచ దేశాలతో మేం సహజీవనం కోరుకుంటున్నాం. మానవజాతి పట్ల మాకు అపారమైన విశ్వాసం ఉంది. శాంతి, సహజీవన న్యాయంకోసం మేం పరితపిస్తూ ఉన్నాం. మా దేశంలో సామాజిక విప్లవానికి పునాదివేసిన మా జాతిపిత సైమన్ బొలీవరే మా ఈ తాజా విప్లవానికి మార్గదర్శీ, సారథీ. మా దేశాన్ని సామ్రాజ్యవాద ఉక్కు కౌగిట నుండి విడిపించే ప్రయత్నంలో చివరాఖరి వరకూ అలుపూసొలుపు ఎరగని పోరాటం చేశాడు. మానవత్వాన్ని నిలుపుకునే ప్రయత్నంలో మేమూ ఆయన బాటలోనే అలుపూ సొలుపూ లేకుండా పయనిస్తాం".

మానవత్వ పరిమళాల్ని విరజిమ్ముతున్న బొలివేరియన్ విప్లవాగ్నిని నిలుపుకోవడానికి వెనిజులా చేస్తున్న కృషికి మనవంతు సాయమూ చేద్దాం రండి! లాటిన్ అమెరికా దేశాల్లో మానవ నాగరిక వికాసానికై గురవుతున్న పోరాటాలకు అండగా నిలబడదాం రండి!! ఖబడ్దార్ అమెరికా, వెనిజులామీద చేతులేస్తే మేం ఊరుకునేది లేదని నినదిద్దాం, రండి...!!!

**(అనువాదం: సత్యరంజన్)**



# లాటిన్ అమెరికాలో నవోదయం


రికార్డో అలార్కాన్

రికార్డో అలార్కాన్ క్యూబా విప్లవ నేతల్లో ఒకరు. విప్లవానంతరం క్యూబా తరపున అనేక దౌత్య పదవులు నిర్వహించారు. ఐరాసలో క్యూబా శాశ్వత ప్రతినిధిగా, ఐరాస సర్వసభ్య సభ ఉపాధ్యక్షునిగా, ఐరాస అభివృద్ధి కార్యక్రమ అధ్యక్షునిగా పనిచేశారు. 1978 నుండి క్యూబా విదేశాంగ శాఖ ఉపమంత్రిగా, 1992లో మంత్రిగా పనిచేశారు. 1993 నుండి క్యూబా నేషనల్ అసెంబ్లీ (పార్లమెంటు) అధ్యక్షుడుగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. లాటిన్ అమెరికాలో సరికొత్త పరిణామాలపై ఆయన రాసిన వ్యాసమిది.

సోవియట్ రష్యా కుప్పకూలిపోయిన తరువాత ప్రపంచవ్యాప్తంగా రేగిన దుమారం అంతా అంతా కాదు. అప్పటిదాకా సోషలిజమే మానవాళికి సరైన ప్రత్యామ్నాయం అని చూపించిన నమూనా విఫలమవడంతో మితవాదులు "పెట్టుబడిదారీ విధానానికి మించిన ప్రత్యామ్నాయమేమీ లేదు' అని ఊదరగొట్టుడు ప్రచారం సాగించారు. వామపక్షశక్తులుగా చెప్పుకునే కొన్ని శక్తులు కూడా ఈ ప్రచారానికి లొంగిపోయాయి. 'బెర్లిన్' గోడలు కూలిపోవడంతోనే సోషలిస్టు రాజ్యాలకు చరమగీతం ప్రారంభమయిందనే ప్రచారపు హోరులో పడి అదే సమయంలో వెనిజులాలో చోటు చేసుకుంటున్న మార్పులను ఎవరూ అంతగా పట్టించుకోలేదు.

ఐ.ఎం.ఎఫ్. విధానాల పాలబడి దుర్భర పేదరికంలోకి నెట్టబడిన వేలాదిమంది వెనిజులా ప్రజానీకం దేశ రాజధాని 'కారకాస్'లో (1989 ఫిబ్రవరి 27న) నిరసన ప్రదర్శనలకు దిగారు. పోలీసులు అమానుషంగా జరిపిన కాల్పుల్లో అనేకమంది సాధారణ ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. బెర్లిన్‌గోడ కూలిపోయిన సంబరాలను విశేషంగా ప్రచారం చేస్తున్న పాశ్చ్యాత్య మీడియా అదే సమయంలో వెనిజులాలో చోటు చేసుకున్న ఈ దారుణ మారణకాండను గురించి అసలు పట్టించుకోనేలేదు. ఒకరికి ఇష్టం లేదు కదాని చరిత్ర తనగతిని మార్చుకోదు కదా! 'వాషింగ్టన్ ఏకాభిప్రాయం' పేరిట అమెరికా ఖండంలోని అనేక దేశాల్లో ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం పేరిట సామ్రాజ్యవాదం రుద్దిన ఉదారవాద ఆర్థిక నమూనాల వైఫల్యానికి వెనిజులా ఘటనలు అద్దం పడుతున్నాయి.

'చరిత్ర పరిసమాప్తం' (ది ఎండ్ ఆఫ్ హిస్టరీ) అని 'వాళ్లు' ప్రపంచాన్ని ఊదరగొడుతున్న సమయంలోనే లాటిన్ అమెరికా దేశాల్లో నూతన తిరుగుబాటు శక్తులు తలెత్తాయి. సామాజిక ఉద్యమాలను అంతవరకూ కనీవినీ ఎరుగనంత ఉధృతమైన స్థాయికి తీసుకెళ్లాయి. అర్జెంటీనా, ఈక్వెడార్, బొలీవియాలలోని ప్రభుత్వాలు పేకమేడల్లా కూలిపోయాయి. ఎన్నికలలో మట్టికరిచాయి. నూతన సంకీర్ణాలు ఏర్పడ్డాయి. బ్రెజిల్, ఉరుగ్వే దేశాలలో సంప్రదాయ వామపక్షశక్తుల తోడ్పాటుతో నూతన ప్రభుత్వాలు ఏర్పాటు అయ్యాయి. నేడు వెనిజులా, బొలీవియాలలో విజయవంతమైన విప్లవశక్తులు సంఘటితపడుతున్నాయి. దేశ ఆర్థికవ్యవస్థలో కీలక రంగాలను తమ పట్టులోకి తెచ్చుకుంటున్నాయి. గతంలో విదేశీ గుత్త పెట్టుదారులకు దారాదత్తం చేసిన రంగాలను 'రాజ్యం' అజమాయిషీలోకి తెచ్చాయి. లక్షలాదిమంది పేద ప్రజానీకానికి తొలిసారిగా ఉచిత విద్యా, వైద్య సౌకర్యాలు కల్పించాయి. రాజకీయ యవనికలో వీరందరికీ స్వేచ్ఛగా పాల్గొనే అవకాశం, హక్కూ కలిగించాయి. క్యూబా ఆర్థిక సంక్షోభాల నుండి తెరపిన పడి సోషలిస్టు సమాజ స్థాపనకు దృఢమైన కృషి చేస్తోంది. వాషింగ్టన్ రుద్దిన 'మకిలియుద్ధం' పాలబడి ధ్వంసమైపోయిన నికరాగువా ఆర్థికవ్యవస్థ 'శాండినిస్టా'ల విజయం దరిమిలా క్రమంగా కోలుకుంటోంది. ఈక్వెడార్ ప్రజలు అధికారమదాంధ పార్టీల పీకలు పట్టుకుని నెట్టేసి సమూలమైన సామాజిక మార్పులు కోరుతూ కొత్త శక్తులకు అధికారం ఒప్పచెప్పారు. కరిబియన్ సముద్ర తీర ప్రాంత దేశాలు క్యూబా, వెనిజులా దేశాలతో సహకారం ఏర్పరచుకుని దేశాల ప్రాతిపదికన బలపరుచుకుంటున్నాయి. దక్షిణాది అమెరికా ఖండంలో ఉన్న లాటిన్ అమెరికా దేశాలన్నీ ఏకీకృతమయ్యే దిశలో భాగంగా ఉమ్మడి భాగస్వామ్య ప్రాజెక్టులను నెలకొల్పుకుంటున్నాయి.

బొలివేరియన్ విప్లవం వేళ్లు నేడు నలుదిశలా వ్యాపించాయి. ఉదాత్తమైన బలీయమైన సామాజిక, మానవాంశాలతో కూడిన బొలివేరియన్ విప్లవమే నేడు సామ్రాజ్యవాద ప్రేరేపిత ఉదారవాద విధానాలకు ప్రత్యామ్నాయం.

లాటిన్ అమెరికా, కరిబియన్ దేశాలలోని లక్షలాదిమంది ప్రజానీకం నిరక్షరాస్యత చెరవిడిపించుకున్నారు. ఆరోగ్యం కూడగట్టుకోగలిగారు. అందుకే 'మనం ఇప్పుడు ఒక మారుతున్న నూతన యుగంలో ఉన్నాం' అని ఈక్వెడార్ అధ్యక్షుడు రాఫెల్ కొర్రియా అన్నాడు.

ఐనప్పటికీ ఇంకా మనల్ని ఆవత్కాలం వెంటాడుతూనే ఉంది. అదీ, వాషింగ్టన్‌లోని అమెరికా సామ్రాజ్యవాద పాలకుల రూపంలో. అమెరికా ఆధిపత్యాన్ని సకల దేశాల్లోనూ, దేనికయినా తెగించి మరీ రుద్దాలని చూస్తున్న సామ్రాజ్యవాద యంత్రాంగాన్ని ఎదుర్కోవాల్సిన చారిత్రక మూలమలపులో ఉన్నాయి ఈ లాటిన్ అమెరికా దేశాలు.

నిన్నగాక మొన్న ఈ దక్షిణార్ధగోళంలోనే అత్యంత కరడుగట్టిన ఉగ్రవాది లూయిస్ పొసాడా కారిలెస్‌ను అమెరికా ప్రభుత్వం ఖైదునుండి విడుదల చేసింది. వాడిప్పుడు స్వేచ్ఛగా మియామీ నగర రోడ్లమీద తిరుగుతున్నాడు. క్యూబా దేశ ప్రజలకు వ్యతిరేకంగా వాషింగ్టన్ ఇదిగో ఇలాంటి ఖూనీకోర్లను ప్రోత్సహిస్తోంది. వీడికి ఉన్న నేరపూరిత చరిత్ర అంతా ఇంతా కాదు. క్యూబా, కరిబియన్, లాటిన్ అమెరికా చివరాఖరికి అమెరికా దేశం కూడా వీడి ఉగ్రవాద చర్యలకు గురయినవే. ఈ చరిత్రంతా అమెరికా అధికారిక డాక్యుమెంట్లలో నమోదు అయిందే.

1976 అక్టోబర్ 6న ఈ పొసాడా ఉగ్రవాద చర్యల మూలంగానే క్యూబా విమానం గాల్లోనే పేల్చివేయబడింది. 73 మంది ప్రజల దుర్మరణానికి వీడే కారణం. ఈ నేరానికి గానూ విచారణను ఎదుర్కొంటూ వెనిజులా జైల్లో ఉన్న ఈ దుర్మార్గుడు జైల్లోంచి తప్పించుకున్నాడు. అమెరికా పాలకవర్గాల పనుపున ఇరాన్-కాంట్రా ఆపరేషన్‌లో కీలకపాత్ర వహించాడు. అప్పట్నించి వీడి ఉగ్రవాద చర్యలకూ అడ్డూ అదుపూ లేకుండాపోయింది. 1994లో ప్రచురితమైన స్వీయ 'ఆత్మకథ'లో పొసాడానే స్వయంగా ఈ నేరాలూ-ఘోరాలూ ఏమిటో వివరించాడు. 1998లో న్యూయార్క్‌టైమ్స్ మొదటి పేజీలో ప్రచురించిన ఇంటర్వ్యూలో కూడా ఆ నేరాల చిట్టా తన నోటితో తనే చెప్పాడు. మియామీ వార్తా పత్రికలు, టీవీ ఛానళ్లలోనూ ఇదే తంతు. ఇవాళ వెనిజులాలో ఉన్న ప్రభుత్వం ఈ ఘోర హంతకుడిని తనకు అప్పగించమనీ అమెరికాను కోరింది.

అంతర్జాతీయ ఉగ్రవాద వ్యతిరేక నియమావళి ఇలాంటి సందర్భాలలో ఏం చెయ్యాలో స్పష్టంగా పేర్కొంది. పొసాడాను అనివార్యంగా అప్పగించాల్సిన బాధ్యత అమెరికా ప్రభుత్వం మీద ఉంది. అలా చెయ్యనిపక్షంలో ఎటువంటి మినహాయింపులూ లేకుండా అతగాడు చేసిన నేరాలకుగాను ఆ దేశంలోని కోర్టు పరిధిలోకి లోబడి నేర విచారణ జరిపించాలి. (మాంట్రియల్ కన్వెన్షన్, ఆర్టికల్-7)

ఈ పొసాడా అమెరికా గడ్డమీద అధికారికంగా ప్రత్యక్షమయి రెండేళ్లు కావస్తోంది. బుష్ ఈ నేరగాణ్ణి వెనిజులాకు అప్పగించనూ లేదు. వాళ్ల న్యాయస్థానాల్లో నేర విచారణకు నిలబెట్టనూ లేదు. బుష్‌కాని, అల్బర్టో గోంజలెజ్‌కానీ పొసాడాను ఇప్పటికీ ఉగ్రవాదిగా గుర్తించలేదు. గుర్తించడానికి మొండిగా నిరాకరిస్తున్నారు. కానీ అదేసమయంలో సరైన వీసాలు, పాస్‌పోర్టులు లేకుండా వలసవచ్చిన వారిని మాత్రం ఏరికోరి వెంటాడి వేధించి మరీ కోర్టులకు అప్పచెపుతున్నారు. ఇలాంటి ఖైదీలను (?) చిత్రహింసల పాల్జేస్తున్నారు. మరి పొసాడా ఈ కోవకు చెందినవాడు కాదా. లేకుంటే అధికారిక పత్రాలతోనే అమెరికా గడ్డమీద ఉంటున్నాడా?

అమెరికాలో ఉంటూ క్యూబాలో ఉగ్రవాద చర్యలకు పూనుకుంటున్నవారి అనుపానులు తెల్సుకోవడానికి మియామీ నగరంలో కాలుబెట్టిన నేరానికి ఐదుగురు క్యూబన్లు (గెరార్డో హెర్నాండెజ్, రావెూన్ లేబనినో, ఫెర్నాండో గోంజలెజ్, ఆంటోనియోగుయర్రో, రీనెగోంజలెజ్) ఖైదు అయి ఈ సెప్టెంబరుకు పదేళ్లు కావస్తోంది. ఈ ఐదుగురి దగ్గరా ఎలాంటి ఆయుధాలూ లేవు. ఎవరికీ హాని తలపెట్టలేదు. తమ దేశ ప్రజల జీవితాల పరిరక్షణకోసం ఉగ్రవాదుల సమాచారం రాబట్టే తెగువ చూపినందుకు వారికి ఈ శిక్ష పడింది. .

మియామీ కోర్టులో ఈ ఐదుగురిమీదా సాగిన విచారణలో అమెరికా ప్రభుత్వం వ్యవహరించిన తీరు టెర్రరిస్టుల కొమ్ముకాచేదిగానూ, ఈ ఐదుగురినీ ఏదోవిధంగా శిక్షించాలనే ధోరణితో ఉంది. కోర్టు వాజ్యంలో దస్తావేజులను పరిశీలిస్తే... ఈ ఐదుగురూ జీవితాంతం ఇంకెదుకూ పనికి రానంతటి తీవ్ర శిక్షకు గురవ్వాలనే తాపత్రయంతో ప్రభుత్వం కడదాకా వ్యవహరించింది. అందుకే ఈ ఐదుగురిమీద ఏకకాలంలో నాలుగు యావజ్జీవిత ఖైదుశిక్షలు, అంటే 75 ఏళ్ల జైలుశిక్ష విధించింది న్యాయస్థానం. ప్రాసిక్యూషన్ అభ్యర్ధన మేరకు ఈ ఐదుగురూ జైల్లో కూడా ఎక్కడ బడితే అక్కడ సంచరించేందుకు, ఎవరితో బడితే వాళ్లతో మాట్లాడేందుకు కూడా వీలులేదని తీర్పులో పొందుపరిచింది న్యాయస్థానం.

తీవ్రమైన మానవహక్కుల ఉల్లంఘనతో కూడిన వివక్షాపూరితమైన ఈ తీర్పుమీద అమెరికాన్ మీడియా పల్లెత్తు మాట అనలేదు. పొసాడాలాంటి ఉగ్రవాదులకు స్వేచ్ఛగా తన గడ్డమీద సంచరించే అవకాశం కల్పించిన అమెరికన్ పాలకులు, ఉగ్రవాదం మీద యుద్ధం చేసేపేరిట వేలాదిమంది సైన్యాన్ని ప్రపంచం నలు చెరగులకీ పంపించి అమాయకుల ప్రాణాలు తీయిస్తున్న ఈ పాలకులు అదే ఉగ్రవాదం మీద నిరాయుధంగా పోరాడడానికి సిద్ధమైన క్యూబన్లను ఇంతటి దారుణశిక్షలకు గురిచెయ్యడం ఎంత వైపరీత్యం. అమెరికన్ మీడియా, రాజకీయపక్షాలకు ఈ విషయమై చీమకుట్టినట్టు కూడా లేదు. నోరు విప్పి 'ఇది తప్పని' అన్న దాఖలా ఒక్కటీ లేదు. ఐతే నా విశ్వాసం ఏమిటంటే నేడు లాటిన్ అమెరికా దేశాల్లో చోటు చేసుకున్న పరిణామాల్లో మరింత నమ్మకంతో, విశ్వాసంతో బలపడే క్రమంలో సగటు అమెరికన్ పౌరుడికి తప్పును తప్పు, ఒప్పును ఒప్పు అని ధైర్యంగా చెప్పగలిగే రోజొకటి వస్తుంది.



# అమెరికా కోసం దేశ ప్రయోజనాలు బలిపెడితే యుపిఏ నష్టపోతుంది




- బి.వి. రాఘవులు

**యుపిఏ ప్రభుత్వం వామపక్షాల మద్దతుపై ఆధారపడి మనుగడ సాగిస్తున్నది. సిఎంపినీ, వామపక్షాలనూ పక్కకు నెట్టి అమెరికాతో అణు ఒప్పందాన్ని అమలు చేయడానికి ప్రయత్నిస్తోంది. ఒప్పందాన్ని ఎట్టిపరిస్థితుల్లోనూ రద్దు చేసే ప్రసక్తి లేదని ప్రభుత్వం చెబుతోంది. ప్రధాని రాజీనామా చేస్తానని మూడునాలుగు సార్లు బెదిరించారు. దేశ ప్రయోజనాలకోసం పాటుపడే వామపక్షాలను కాంగ్రెస్‌పార్టీ పక్కన పెడుతున్నది. వామపక్షాలు మద్దతు ఉపసంహరించినా తమ ప్రభుత్వానికి ఢోకాలేదని అంటున్న కాంగ్రెస్ నాయకులకూ, దేశ ప్రజలకూ వామపక్షాల జవాబేమిటి?**

పి. రాజారావు, విశాఖపట్నం-8

**అణు ఒప్పందం దేశానికి నష్టదాయకమని వామపక్షాలు, బిజెపితో సహా ఇతర పార్టీలు వ్యతిరేకిస్తుండగా కాంగ్రెస్ మద్దతిస్తోంది. అణు ఒప్పందాన్ని అమలుచేసే విషయంలో ప్రధాని రాజీనామాకు కూడా సిద్ధమంటున్నారు. అణు ఒప్పందం దేశానికి నష్టదాయకమని కాంగ్రెస్‌కు తెలియదా? ఒప్పందం అమలు విషయంలో కాంగ్రెస్ ప్రయోజనాలు ఏమిటి?**

ఆర్. రాములు, ఫిరంగిపురం,
గుంటూరు జిల్లా

**అణు ఒప్పందం విషయంలో కేంద్రంలోని యుఎన్‌పిఎ, వామ పక్షాలు కలిసి పోరాటం చేయాలని నిర్ణయించాయి. దీనర్థం వచ్చే ఎన్నికల్లో వామపక్షాలూ, యుఎన్‌పిఎ కలిసి పోటీచేస్తాయని భావించ వచ్చా? దేశంలో జరుగుతున్న పరిణామాలు మధ్యంతర ఎన్నికలను అనివార్యం చేస్తున్నట్లు భావించవచ్చా?**

సిహెచ్. వి. బాబు,
కర్నూలు

అమెరికాతో అణుఒడంబడికను ఖరారు చేసుకోవాలని ప్రధాని మన్మోహన్‌సింగ్ గట్టిగా అనుకుంటున్నారు. అణు ఒడంబడిక మన దేశాన్ని అమెరికాకు వ్యూహాత్మక భాగస్వామిగా చేసి దేశ ప్రయోజనాలకు నష్టం కల్గిస్తుందని అంతే గట్టిగా వామపక్షాలు భావిస్తున్నాయి. అందుకే వామపక్షాలు అణుఒడంబడికకు తమ ఆమోదం వుండదని ఖచ్చితంగా తేల్చి చెప్పాయి. వామపక్షాల మద్ధతు లేకుండానే అణు ఒడంబడికతో ముందుకు పోవడం యుపిఏ ప్రభుత్వానికి ప్రస్తుత రాజకీయ పరిస్థితులలో సాధ్యం కాదు. వామపక్షాలు ఏకాభిప్రాయం సాధించేందుకు చర్చలు జరపాలని పార్లమెంటులో చర్చించి దాని అభిప్రాయానికనుగుణంగా ప్రభుత్వం వ్యవహరించాలని కోరుతున్నాయి. ప్రభుత్వం ప్రజాస్వామికంగా వ్యవహరించకపోతే పర్యవసానాలకు దానిదే భాద్యత అని కూడా వామపక్షాలు ఇప్పటికే హెచ్చరించాయి. బెదిరింపుల ద్వారా వామపక్షాలను భయపెట్టవచ్చుననో, లొంగదీసుకోవచ్చునో యుపిఏ నాయకత్వం అనుకుంటే అది వారి అవివేకమే. అయితే ప్రధాన మంత్రీ, యుపిఏ ఛైర్‌పర్సన్ శ్రీమతి సోనియా గాంధీ వాడిన మాటల కన్నా వామపక్షాలకు వారి చేతలు ముఖ్యం. అందుకే ఒడంబడికపై వారి వైఖరి ఏమిటని వామపక్షాలు నిరంతరం నిలవేస్తున్నాయి. అణుఒడంబడిక విషయంలో రాజీ లేదని చెబుతున్నాయి. వామపక్షాలు లేకపోయినా ఇతరుల సహాయంతో ఒడంబడికను కొనసాగించవచ్చు. ప్రభుత్వాన్ని నడుపుకోవచ్చు. అని యుపిఏ కూటమి అనుకుంటే అది వారి భ్రమ. బిజెపి మద్ధతుతో తమ లక్ష్యాలను నెరవేర్చుకోదల్చుకుంటే అది వారి పతనానికి ప్రారంభం. అమెరికా ప్రయోజనాల కోసం వారికిచ్చిన వాగ్ధానం కోసం మన దేశ ప్రయోజనాలనూ, కనీస ఉమ్మడి కార్యక్రమాన్నీ ఫణంగా పెడతాం, వామపక్షాల మద్ధతును వదులుకుంటాం అని యుపిఏ మొండిగా వ్యవహరిస్తే ఫలితం అనుభవించాల్సి వస్తుంది.

అణు ఒడంబడిక వలన మన దేశం అమెరికాకు ఒక ఉపాంగంగా మారిపోయే ప్రమాదముంది. ఒడంబడిక వలన దేశ ఆర్థిక స్వావలంభనకూ, స్వతంత్ర విదేశాంగ విధానానికీ, దేశ భద్రతకూ, ప్రజల జీవన పరిస్థితులకూ నష్టం కలుగుతుంది. పాలకులు ఈ విషయాలను అర్థం చేసుకోలేనంత అమాయకులు కాదు. అయినా ఒడంబడికకు సిద్ధమవుతున్నారంటే దేశంలోని పాలకవర్గాలకు స్వార్ధ ప్రయోజనాలుండడమే కారణం. అమెరికా కనుసన్నలలో మెలిగితే దేశంలోని బడా పెట్టుబడిదారీ భూస్వామ్య వర్గాలు మరింత లాభపడవచ్చని భావిస్తుండడమే ఈ రోజు యుపిఏ గాని, ఆరోజు ఎన్‌డిఏ గాని అమెరికాతో సాన్నిహిత్యం కోసం అర్రులు చాచడం. అందువలన అణుఒడంబడికపై వ్యతిరేకత, అనుకూలతలు దేశంలోని సంపన్నుల, సామాన్యుల ప్రయోజనాల విషయంలో ఏ పక్షాన వున్నారనే దాన్ని బట్టి వ్యక్తమవుతున్నాయి.

అణు ఒడంబడికపై వచ్చిన బేదాభిప్రాయాల కారణంగా మధ్యంతర ఎన్నికలు రావాల్సిన అవసరం లేదు. ఎన్నికలను ఏ పార్టీ కూడా ఇప్పుడు కోరుకోవడం లేదు. వామపక్షాలు ఎన్నికలకు సుముఖం కాదు. జార్జి బుష్‌కు ఇచ్చిన హామీని నిలబెట్టుకోడానికో, అమెరికా విధించిన గడువును జవదాటకుండా వుండడానికో దేశ ప్రయోజనాలను ఫణంగా పెట్టీ ప్రభుత్వాన్నయినా ఛేదించి మధ్యంతర ఎన్నికలను దేశం మీద రుద్దాల్సినంత అఘాయిత్యానికి యుపిఏ పాల్పడితే అంతకన్నా ఘోరం మరొకటి వుండదు. తగినంత దూరదృష్టిని, ప్రజాస్వామ్య స్ఫూర్తిని యుపిఏ నాయకత్వం ప్రదర్శిస్తుందని ఆశిద్దాం.

**మద్య పానానికి వ్యతిరేకంగానూ, బెల్ట్ షాపులు మూసేయాలని కోరుతూ లోక్‌సత్తా ఆందోళన చేస్తోంది. దీనిపై సిపిఐ(ఎం) వైఖరి ఏమిటి? మద్యపానానికి వ్యతిరేకంగా పార్టీ ప్రచారం ఎందుకు చేయడం లేదు?**

మహాలక్ష్మి, రాజమండ్రి,

మన రాష్ట్ర ప్రభుత్వానికి మద్యం మీద వచ్చే ఆదాయం ఒక ప్రధాన వనరు అయ్యింది. మద్యం వినియోగం ఎంత ఎక్కువైతే అంత లాభం వస్తుంది. తెలుగుదేశ ప్రభుత్వ హయాంలో ఆదాయం కోసం మద్య వినియోగాన్ని ప్రోత్సహించారు. ఇప్పుడు కాంగ్రెస్ హయాంలోను చేసిన వాగ్ధానానికి భిన్నంగా మద్యం వాడకాన్ని అభివృద్ధి చేస్తున్నారు. మారుమూలలకు కూడా మద్యం వినియోగాన్ని వ్యాపింప చేయడానికి బెల్టు షాపులు అనువైన సాధనాలుగా వున్నాయి. మాటవరుసకు బెల్టు షాపులను అరికడతామని చెబుతూనే వాటిని

ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నది. జలయజ్ఞానికి వేల కోట్ల రూపాయలు కావాలంటే ప్రజలు మందు యజ్ఞంలో మునిగి తేలాల్సిందేనని ప్రభుత్వ ఆలోచన కావచ్చు.

సరళీకరణ విధానాలు ప్రారంభమయిన తర్వాత దేశ, విదేశీ మద్యం కంపెనీలు మన దేశంపై కన్ను పడింది. విస్తారంగా పెట్టుబడులు పెట్టి మద్యం ఉత్పత్తి చేసి పంపిణీ చేస్తున్నాయి. మద్యం కంపెనీలు పాలకపార్టీ నాయకులు అంతకంతకూ పెనవేసుకుని పోతున్నారు. అందుకే మద్యం ఏరులై పారుతున్నా సామాన్యుల ఆదాయాలకు గండి పడుతున్నా, శాంతి భద్రతల సమస్యలు తీవ్రమవుతున్నా, ప్రమాదాలు ఎక్కువవుతున్నా ప్రభుత్వం పట్టించు కోవడం లేదు. ముఖ్యంగా మహిళలు మద్యం మహమ్మారి పర్యవసానాలకు ఎక్కువ కష్టాలు పడుతున్నారు. మద్యం పోవాలని, బెల్టు షాపులు మూసివేయాలని వారు కోరుకుంటున్నారు. మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు బెల్టు షాపులకు వ్యతిరేకంగా నిరసనలు వ్యక్తం చేస్తున్నాయి. మార్క్సిస్టు పార్టీ వారి ఆందోళనలకు పూర్తి మద్దతునిస్తున్నది. మద్య వినియోగాన్ని సామాజిక ప్రయోజనాలకనుగుణంగా ప్రభుత్వం నియంత్రించాలని కోరుతున్నది. ఆదాయం కోసం మద్యాన్ని ప్రోత్సహించకూడదని చెబు తున్నది.

**సేతు సముద్రం ప్రాజెక్టు విషయంలో బిజెపి ఒకవైపు, తమిళనాడు ముఖ్యమంత్రి కరుణా నిధి ఒకవైపు వాగ్వాదం చేసుకుంటున్నారు. ఈ విషయంలో హిందువుల మనోభావాలు రెచ్చగొట్టడానికి బిజెపి శతవిధాల ప్రయత్నిస్తోంది. దీనిపై సిపిఎం వైఖరి ఏమిటి? కేవలం సెంటిమెంటుగానే కాకుండా ప్రాజెక్టు నిర్మాణం వల్ల పర్యావరణానికి నష్టం కలుగుతుంది అంటున్నారు కదా?**

ఆర్. రాజేశ్వర రావు,
మధిర, ఖమ్మం జిల్లా.
డి. శేఖర్, నెల్లూరు.

సేతు సముద్రం ప్రాజెక్టు దేశ ఆర్థిక ప్రయోజనాలకు ఎంతో మేలు చేస్తుందని మార్క్సిస్టు పార్టీ అభిప్రాయం. దాని నిర్మాణాన్ని చేపట్టాలని కోరుతున్నది. బిజెపి తన మతతత్వ ఎజండాలో భాగంగా సేతు సముద్ర ప్రాజెక్టుకు కూడా మతం రంగును పులిమే ప్రయత్నం చేస్తున్నది. శ్రీరాముడు కట్టిన సేతువని దాన్ని ముట్టుకోరాదని చెబుతున్నది. శాస్త్రీయంగా పురావస్తు శాస్త్రపరంగా పరిశీలిస్తే మానవ నిర్మితమైన సేతువేమీ లేదని అక్కడ వున్నది సహజసిద్ధమైన భౌగోళిక భూభాగమేనని తేలుతున్నది. అందుకే మతపరమైన రంగును పులమడాన్ని పార్టీ వ్యతిరేకిస్తున్నది.

ప్రాజెక్టు నిర్మాణం మూలంగా పర్యావరణానికి నష్టం కలగకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకుంటున్నామని ప్రభుత్వం చెబుతున్నది. అనేకమార్లు నిపుణుల కమిటీలు పరిశీలించి పర్యావరణానికి ఇబ్బంది లేకుండా వుండే మార్గాన్ని ఖరారు చేసినట్లుగా ప్రభుత్వ నివేదికలు వెల్లడిస్తున్నాయి. అందువలన పర్యావరణానికి తీవ్రమైన విఘాతం కలుగుతుందన్న భయాందోళనలకు ఆస్కారం లేదని పార్టీ భావిస్తున్నది.



# అభిప్రాయాలు

## ఆశావహ భవిష్యత్తును వీక్షించిన వ్యాసం

మార్క్సిస్టు అక్టోబర్ సంచికలో 'రూపుదిద్దుకుంటున్న బహుళధృవ ప్రపంచం' వ్యాసం చదివాను. అమెరికన్ శతాబ్దం ముగింపు ఈ శతాబ్దంలోనే రానున్న కొన్ని దశాబ్దాల్లో జరగవచ్చన్న భావన కలుగుతోంది. భవిష్యత్ ప్రపంచాన్ని సంక్షిప్తంగా వ్యాస రచయిత చక్కగా వివరించారు. వేగుచుక్కలుగా చైనా, రష్యా, వెనిజులాల పాత్ర ఎంతైనా సంతోషించ దగ్గది. అనువాదకులు చాలా సులభశైలిలో అనువదించారు. ఇది ఆశావాదులకు మంచి టానిక్. ఇటువంటి వ్యాసం మార్క్సిస్టు ద్వారా అందజేసినందుకు ధన్యవాదాలు. ముఖ్యంగా ఈ పరిణామం పట్ల గల్ఫ్ దేశాలు ఆసక్తి కనపరచడం చాలా మంచి పరిణామం.

సెప్టెంబర్ నెల సంచికలో సోషలిజం ఎందుకు అనే వ్యాసం రానున్న ప్రపంచ పరిణామాలను గురించి రేఖామాత్రంగా వివరించింది. మారుతున్న ప్రపంచ పరిణామాల్లో మళ్లీ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఏర్పడాల్సిన అవసరం ఉందనిపిస్తోంది. భారత్ అమెరికా అణు ఒప్పందం పూర్వాపరాలు చదువుతుంటే అమెరికా ఎంతో కుయుక్తితో మన దేశాన్ని పద్మవ్యూహంలో బిగించడానికి ప్రయత్నిస్తున్నదని పిస్తోంది.

**జి.ఎస్.ఆర్. ఆంజనేయులు,**
నాల్గవలైను, మారుతీ నగర్,
పాత గుంటూరు, గుంటూరు.

## చైనాలో రాజకీయ విద్యగురించి కూడా చెప్పిఉంటే బాగుండేది

హరికిషన్ సింగ్ సూర్జిత్ గారు అక్టోబర్ నెల సంచికలో 1840 నల్లమందు యుద్ధ కాలంనాటి ఫ్యూడల్ పరిస్థితులనుండి నేటి ఆధునిక కాలం వరకు చైనా చరిత్రను చక్కగా వివరించారు. సాంస్కృతిక విప్లవ కాలంలో ఉత్పాదక శక్తుల సామర్థ్యాన్ని పెంచే లక్ష్యాన్ని నిర్లక్ష్యం చేయడం, పార్టీ ఉనికిని ప్రశ్నించడం, వ్యక్తి ఆరాధనను ప్రోత్సహించడం, కక్ష సాధింపు చర్యలకు పూనుకోవడం, కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని ధ్వంసం చేయడం వంటి అవాంఛనీయ పరిణామాలు జరిగినట్లు వ్యాసం ద్వారా తెలుసుకున్నాం. ప్రజల చైతన్య స్థాయిని గమనిస్తూ మార్క్సిస్టు మౌలిక అంశాలను అమలు చేయాలన్నారు. ప్రజల చైతన్య స్థాయి ముఖ్యంగా సోషలిస్టు చైతన్య స్థాయి ఆటోమేటిక్‌గా రూపుదిద్దుకుంటుందన్న ధోరణి సరికాదు. అట్టి చైతన్యాన్ని ప్రయత్న పూర్వకంగా పెంచాలి. ఉత్పత్తి శక్తులను అభివృద్ధి పరచడంతోబాటు ఉత్పత్తి సంబంధాలను మెరుగుపరచడం, సోషలిస్టు చైతన్యాన్ని పెంచడం వంటి పనులను ప్రయత్న పూర్వకంగా కమ్యూనిస్టు పార్టీ, ప్రభుత్వం చేయాలి. ఇందుకు ముఖ్యమైన ఉపకరణం విద్య. మార్కెట్ అవసరాలు తీర్చేదానిగానే ఉండే విద్య ఆ పని చేయలేదు. కమ్యూనిస్టు వ్యక్తిత్వాన్ని, కమ్యూనిస్టు చైతన్యాన్ని, కమ్యూనిస్టు నీతిని విద్య ద్వారా అందించాలి. ఈ ప్రక్రియలో చైనాలో ఎలా జరుగుతుందో తెలిపే వివరాలేవీ వ్యాసంలో లేవు. దిలిప్ హైరోగాని బహుళ ధృవ ప్రపంచం వ్యాసం నేటి చరిత్ర క్రమాన్ని చక్కగా విశ్లేషించింది. అయితే అమెరికాకు సవాళ్లుగా ఎదుగుతున్న రష్యా, చైనాలు తమ ఫ్యూడల్ గతాన్నుండి స్ఫూర్తి పొందుతున్నాయన్న విషయం ఆరోగ్యకరం కాదు. వాటి విప్లవ చరిత్ర అందుకు ఉపయోగపడటం లేదా? లైంగిక సమస్యలు అన్న వ్యాసంలో అలెగ్జాండర్ కొల్లంతాయ్ పదేపదే ఉపయోగించిన లైంగిక సంక్షోభం అనే పదానికి సరైన అర్థం అవగతం కాలేదు. మార్క్సిస్టు పత్రికకు అభినందనలు

**ఎం. నిర్మల్ కుమార్,**
సత్తుపల్లి, ఖమ్మం జిల్లా



# అక్టోబర్ విప్లవ ౯౦వ వార్షికోత్సవ ప్రత్యేకం

# 2007

# అక్టోబర్ విప్లవం అజేయం!



కీ॥శే॥ మోటూరు హనుమంతరావు

నేడు అక్టోబర్ మహావిప్లవ జన్మ దినోత్సవం. ఆ విప్లవం చేసిన తొలి ప్రయోగం –సోవియట్ యూనియన్ కూలినా ఆ మహా విప్లవ ఘనత అంతరించదు. అది సృష్టించిన చరిత్ర చెరిగిపోదు. మానవాళిముందు అది నిత్యారుణోదయమై విలసిల్లుతూనే ఉంటుంది. ఆశాజ్యోతిగా వెలుగొందుతూనే వుంటుంది. మానవజాతి మహా ప్రస్థానానికి అదే అంతిమ లక్ష్యం. అదే మార్గదర్శకం.

మానవజాతి చరిత్రలో మహత్తర మార్పు తెచ్చిన మహా విప్లవం అది.

మనిషిని మనిషీ ఒక వర్గాన్ని ఇంకో వర్గం, జాతిని వేరొక జాతి, దేశాన్ని మరొక దేశం దోచుకొనడాన్ని సహజధర్మంగా పాటించిన గతం మనది. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, సైద్ధాంతిక రాజకీయ చారిత్రక వరవడికంతా అదే రాగం, తానం, పల్లవిగా చలామణి అయినదా కాలం. ఆ ప్రాతిపదికను కాపాడి, రక్షించి, పోషించడానికి ఉపరితలంగా ఉత్పన్నమైనదే గత ఆధ్యాత్మిక చింతన అంతా.

ఆ వరవడికి మొదట గండికొట్టినది మార్క్సిజం. అదే మరో ప్రపంచానికి మూలం. అక్టోబర్ విప్లవం అందుకు నాంది పలికింది. సోవియట్ యూనియన్ తొలుత దానికి రూపురేఖలు దిద్దింది.

అది ఊహాజనితమై ఉద్భవించింది గాదు. చారిత్రకావసరంగా అది అవతరించింది. దేవుళ్ళూ, దయ్యాలూ సృష్టించినదిగాదు అది. మానవులు కదిలి సాధించిన విప్లవం అది.

తన పురోగమనం కోసం మానవుడు అంతకుముందే అనేక తిరుగుబాట్లు లేవనెత్తాడు. త్యాగాలు చేశాడు. విప్లవాలే తెచ్చాడు. కాని అవన్నీ అంతిమవిజయాన్ని సాధించలేక అపజయాల పాలైనాయి. అయినా ఆ మెట్లమీదే సమాజం అనాదికాలాన్నధిగమించి నేటి ఔన్నత్యానికి పునాదులు వేసింది. అప్పటికప్పుడు కాకపోయినా మొత్తానికి ఆ మార్గాన్నే అది పురోగమించింది. ఒకదాని తర్వాత ఒకటిగా బానిసయుగం, భూస్వామికయుగం, పెట్టుబడిదారీ యుగాలవైపు మానవాళి చరిత్రను దొర్లించింది.

పెట్టుబడిదారీ దోపిడీ విధానానికి ప్రత్యామ్నాయం, అనంతర పరిణామం సోషలిజం. అందుకు తొలుత శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంతాన్ని రూపొందించిన ఘనత మార్క్సు, ఏంగెల్సులది. అదివరకు అచైతన్యంగానే దొర్లుతూ వచ్చిన చరిత్రను ఇప్పుడిక మానవాళి చైతన్యంతో నిర్మించుకోవచ్చని జగత్తుకు నేర్పిన తొలి మానవులే మార్క్సు, ఏంగెల్సులు.

వారి జీవితకాలం 19వ శతాబ్దం. ఆ కాలంలోనే ఐరోపాఖండంలో అనేక విప్లవాలు చెలరేగాయి. వీగిపోయాయి. వాటన్నింటిలోకీ ప్రశస్తి పొందింది పారిస్ కమ్యూన్. కార్మిక రాజ్యస్థాపనకు సంకల్పించి జరిగిన మొదటి సమరం అది. ఆ ప్రయోగం అనతికాలంలోనే కూలిపోయింది. కార్మికవర్గ విప్లవంగా తొలుత విజయం పొందిన మహా విప్లవం అక్టోబర్ విప్లవం. అది వూహలకే పరిమితంగా లేదు. మానవుడి సంకల్పానికి ఉద్యమరూపం తెచ్చింది. నూతన సమాజ నిర్మాణాన్నే చేపట్టింది. అందువల్ల మార్క్స్, ఏంగెల్సు తొలుత కమ్యూనిస్టు మేనిఫెస్టోలో ఇచ్చిన ప్రపంచ కార్మికులారా! ఏకంకండు, పోయేదేమీలేదు సంకెళ్లు తప్ప" అన్న నినాదానికి కండపుష్టి కలిగింది.

సోవియట్ యూనియన్ ఉనికి దశదిశలా పీడిత ప్రజాకోటిని ప్రభావితం చేసింది. ఆ సూర్యోదయం ప్రపంచమంతటా కమ్యూనిస్టుపార్టీలు నెలకొనడానికి ఆస్కారమిచ్చింది. విప్లవాల కాణాని లెనిన్ మహనీయుడు మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి అప్పుడిచ్చిన పిలుపు అక్కరకు వచ్చింది.

చరిత్ర మలుపుకు తర్వాత దోహదం చేసిన పెద్ద పెద్ద పార్టీలన్నీ 1920లో జన్మించడానికి కారణం అదే. ఇండోనేషియా, ఫ్రాన్స్, భారతదేశం వంటి పార్టీలన్నీ అప్పుడే ఆనలు వేసుకున్నాయి.

ఈ పీడిత ప్రజాకోటి విజృంభణను అరికట్టేందుకే ప్రపంచ పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద శక్తులు ఫాసిజాన్ని సృష్టించి పెనుభూతంగా పెంచిపోషించాయి. ఫలితంగా జరిగిందే సోషలిస్టు కంచుకోటపై దాడి. అనంతరం అది ప్రపంచవ్యాపితమైన రెండవ ప్రపంచయుద్ధంగా మారి ఫాసిస్టు మారణకాండకు దారితీసింది. సోవియట్ యూనియన్, చైనా, ఎర్రసేనలేకాక కమ్యూనిస్టుపార్టీలెక్కడున్నా ఫాసిజాన్ని నిర్మూలించి ప్రపంచ ప్రజాశక్తులు విజృంభించి నూతన ప్రపంచంవైపు పురోగమించడానికి ఆస్కారం కలిగించిన పరిణామం ఇది.

గతమంతా జరిగిన యుద్ధాలతీరు వేరు. దీని తీరువేరు. గెలిచిన దేశాలముందు ఓడిన దేశాలు పాదాక్రాంతం అయినదా కాలం. అవి బానిసదేశాలుగా, వలసదేశాలుగా విజేత

రచయిత భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) రాష్ట్ర కార్యదర్శిగా, పొలిట్ బ్యూరోసభ్యులుగా, ప్రజాశక్తి పత్రిక సంపాదకులుగా ప్రధాన బాధ్యతలు నిర్వహించారు.

దేశాలమధ్య పంపకాలకు గురయ్యేవి. ఆ భాగాలు కుదరకపోతే మళ్లీ వాళ్లలో వాళ్ళు యుద్ధాలు చేసుకోవడం సామాన్య ప్రజలను మందుగుండు సామాగ్రిగా ఆ మారణకాండల్లో ఆహుతి చేయడం జరిగేది. ఇందుకు ఎదురు తిరిగి నిలబడమని పిలుపు ఇచ్చిన మహావ్యక్తి లెనిన్. ఆ విధంగా తొలిదెబ్బతిన్నది సామ్రాజ్య వాదం. మలిదెబ్బతిన్నవి ఫాసిస్టు శక్తులు.

అంతకుముందు ఏ సామ్రాజ్య వాదాన్నీ ఓడించి స్వాతంత్ర్యం పొందిన దేశం ఏదీ లేదు. కాని ఇప్పుడు ఫాసిజాన్ని భూస్థాపితం చేసిన అనంతరం సోవియట్ యూనియన్ విజృంభించి స్వాతంత్ర్యోద్యమాలన్నింటికీ విముక్తి కలిగింది. అందుకనే రెండవ యుద్ధానంతరమే దేశదేశాలు స్వాతంత్ర్యాలు పొందాయి. సోషలిజాన్ని సాధించాయి. ప్రపంచ రూపురేఖలే మారిపోయాయి. విజేత అయిన సోవియట్ యూనియన్ దురాక్రమణకు గాక స్వాతంత్ర్య దేశాలకు చేయూతనిచ్చి నిలబెట్టడానికీ, అలీన విధానాన్ని కాపాడటానికీ కంకణధారిగా నిలిచింది. సోషలిజం, స్వాతంత్ర్యం, విశ్వ శాంతి, సహజీవనం, అలీనత్వం.... ఇవన్నీ అంతకుముందు అనూహ్యం, అసంభవం. జాతుల స్వయంనిర్ణయం, ఆయా భాషల అభివృద్ధి అంతకుముందు అరణ్యరోదనలు. శ్వేతజాతి దురహంకారాన్ని ప్రశ్నించడమే కష్టం. ఆ దశదాటి ప్రపంచ సంస్కృతే మారింది. అభ్యుదయ దృక్పథమే ప్రభవించింది. ఐక్యరాజ్య సమితి ఆ మార్పును రక్షించుకునేందుకు దోహదం చేసింది.

అక్టోబర్ విప్లవం ఆరవ వంతు ప్రపంచాన్ని సోషలిజం వైపు తెస్తే ఫాసిజంపై విజయం, మూడవవంతు మానవ సమాజాలని సోషలిస్టు శిబిరంలోకి తెచ్చింది. ఈ పురోగమనాన్ని అరికట్టేందుకే ఫాసిజం కాళ్లలో చెప్పులు దూర్చిన అమెరికన్ సామ్రాజ్యవాదం మళ్లీ శీతల యుద్ధాలు (కోల్డ్ వార్) ప్రకటించింది. ఆ బెదిరింపుల్లో భాగంగా మారణాయుధంగా అణు బాంబును చేపట్టింది.

మొదట చైనా, తర్వాత కొరియా, తదుపరి క్యూబా, ఆఖరును వియత్నాంలపై ప్రకటించిన యుద్ధాలన్నీ అమెరికాకు పరాభవ పరంపరలు తెచ్చిపెట్టాయి. దాని బెదిరింపులన్నీ సోవియట్ నిర్మించిన ఆయుధ బలం, అణుశక్తి ముందు పటాపంచలైనాయి. ప్రపంచ ప్రజాభిప్రాయం ముందు అమెరికన్ అణుబాంబు తోక ముడిచింది.



సోషలిజం కలగాదనీ, భూలోక స్వర్గం కాగలదనీ నిరూపించుకున్నది. మనిషిని మనిషి దోచే విధానానికి స్వస్తి చెప్పింది. అందరికీ తిండీ, బట్టా, విద్యా, వైద్య, ఇంటి సదుపాయం కలిగించ కలిగిన సమాజాలు రూపురేఖలు దిద్దుకున్నాయి. "ప్రపంచ కార్మికులారా! ఏకము కండు పోయేదేమీ లేదు సంకెళ్లు తప్ప" అన్న నినాదం మళ్లీ లోకమంతా ప్రతిధ్వనించేందుకు ఆస్కారం కలిగింది.

ఏ మతాలూ, మహాత్యాలూ, ప్రవక్తలూ, ప్రబోధకులూ చేకూర్చలేని విముక్తిని మార్క్సిజం-లెనినిజం సామాన్య ప్రజలకు చేకూర్చింది. నిజమైన మానవతా వాదానికిది సంకేతం. కమ్యూనిస్టుపార్టీలు ఆ పీడిత ప్రజా శక్తులకు నాయకత్వం వహించాయి. అందుకు వాటికి వజ్రాయుధంగా తోడ్పడినది వర్గ పోరాటం.

మార్క్సు, ఏంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావో, హోచిమిన్, కాస్ట్రోల వంటి మహోపాధ్యాయులు ఈ పార్టీలకు సారధ్యం వహించారు.

కాగా ఇటీవల మరోసారి పెట్టుబడి దారీ పిశాచి యొక్క దాడికి సోషలిజం గురైంది. సోషలిజం ఎంతగొప్పదైనా మానవ చైతన్యం దానికి మూలం. మూడవవంతు ప్రజానీకం సోషలిజంవైపు మొగ్గినా, రెండు వంతుల ప్రపంచం పెట్టుబడిదారీ దోపిడీ విధానంలోనే మగ్గుతున్నది. సామ్రాజ్యవాదులు దాన్ని వెనక వేసుకొని సోషలిస్టు దేశాల చుట్టూ వలయంగా వున్నారు. అందుకు తోడు సోషలిస్టు దేశాలకే విద్రోహం చేయగల రివిజనిజం ఆ దేశాల్లో ట్రోజన్ హార్స్‌గా తయారైనది. కృశ్చేవ్ మొదలు గోర్బచేవ్‌ల వరకూ ద్రోహ పాత్ర నిర్వహించి సామ్రాజ్యవాదుల దాడులకు ఆస్కారం కలిగించారు. ఎల్సిన్ వంటి భ్రష్టులు సూటిగా సామ్రాజ్యవాద బంట్లుగా, ఏజెంట్లుగా పనిచేశారు. కర్ణుడి చావుకు వేయి కారణాలున్నట్లు ఇవన్నీ కలిసి చివరకు సోవియట్ యూనియన్

కూలింది. తనతో పాటు తోటి తూర్పు దేశాల వ్యవస్థలనూ కూల్చింది.

ఇందుకు ఇతరత్రా ఎన్ని కారణా లున్నా ఆ దేశాల్లో సోషలిస్టు చైతన్యం చెదిరి పోవడం ప్రధాన కారణం. వర్గ పోరాటం ప్రత్యక్షంగా లేని ఆ దేశాల్లో మార్క్సిస్టు సిద్ధాంత అవగాహన నిలబెట్టడం, అంతర్జాతీయ అవ గాహన నిలబెట్టడం, అంతర్జాతీయ సంఘీభా వాన్ని కాపాడుకోవడం ముఖ్యం. పరస్పర సహకారాన్ని విస్మరించి, విప్లవవిచ్ఛిన్నాన్నులను గూడా ఆయా దేశాల అంతర్గత వ్యవహారాలని తోకముడిచే గోర్బచేవ్‌లు హాని చేయడానికి తప్ప మేలు చేయడానికి ఎలా తోడ్పడగలరు?

ఇందుకేదో పెట్టుబడిదారీ విధాన సాంకేతిక పరిజ్ఞానం ముందు తట్టుకోలేక కొన్ని సోషలిస్టు రాజ్యాలు కూలినట్లు చెప్పడం అర్థంలేని వాదం. అణుబాంబు అమెరికా చేతుల్లో వున్నదని తెలిసిన 4 సంవత్సరాల్లోనే అణుబాంబును తయారు చేయడమేగాక ఆ అణు శక్తి వినియోగం ద్వారానే మొదటి ఉపగ్రహాన్ని, మొదటి మానవుణ్ణి అంతరిక్షంలోకి సోవియట్ పంపగలిగింది. మొదట చంద్రమండలాన్నీ తాకి అక్కడ అరుణ పతాకాన్ని ప్రతిష్టించింది. 110 దేశాలకు తన సాంకేతిక నైపుణ్యాన్ని అందించి ఆ దేశాల్లో భారి పరిశ్రమలను నిర్మించి పెట్టింది. మరే డైరెక్షన్‌లో అభివృద్ధి చెందాలన్నా అందుకు అవసరమైన ప్రవీణులు, ప్రాతిపదిక, పరిశోధనాశక్తి సోవియట్ చేతుల్లో వున్నది. ఈ విషయాన్ని గుర్తించకుండా పై వాదాన్ని అంగీకరించడం అంటే సాంకేతిక పరిజ్ఞానాభివృద్ధి ముందు సోషలిజం ఓడిపో యినట్లు చిత్రించడమే అవుతుంది.

చైనా, ఉత్తరకొరియా, వియత్నాం, క్యూబా వంటి సోషలిస్టు దేశాలు సోషలిస్టు ఆర్థిక విధాన పరిధిలోనే ఆ సాంకేతిక ప్రావీణ్యా న్ని ఉపయోగించుకుంటున్నాయి.

అదివరకు ఎన్ని భ్రమలున్నా సోవి యట్ యూనియన్ కూలిన రెండు సంవత్స రాలలోనే పురోగమిస్తున్న ప్రపంచానికి ఎంత తిరోగమనం దాపురించిందో కనిపిస్తూనే వున్నది. ఉన్న జీవిత గ్యారంటీలన్నింటినీ పోగొట్టుకున్న సోషలిస్టు రాజ్యాలు మళ్లీ పెట్టుబడిదారీ మురికికూపంలో కూరుకు పోయాయి. నిరుద్యోగం, నిష్ఠ దారిద్ర్యానికి తోడు పెట్టుబడిదారీ మార్కెట్టు కుళ్ళూ, అరాచకం, అవినీతి అన్నీ అక్కడ ప్రత్యక్షమయ్యాయి.

పురోగమిస్తున్న నికరాగువా, ఆఫ్ఘని స్తాన్, అల్జీరియా, ఇథియోపియా మొదలైన దేశాలన్నీ వెనుకపట్టు పట్టాయి. మత ఛాంద సపు అనాగరిక మధ్యయుగాలకు దిగజారు తున్నాయి. జాతి సామరస్యానికి ప్రఖ్యాతిగన్న సోవియట్ జాతులు, మత వైషమ్యాలకు, అంత ర్యుద్ధాలకు, అనేక అధోగతులకు అలవాలమై కుక్కలు చింపిన విస్తరిలా ఆ ప్రాంతం తయా రైంది. సూపర్ పవర్‌గా ప్రసిద్ధికెక్కి ప్రపంచానికి రక్షణ, వెలుగు, సహాయం, శాంతి ప్రసాదించిన ప్రాంతం పాతాళానికి పతనమవడం ఘోరమైన పరిణామమే. యుగోస్లావియాదీ అదే స్థితి. మూడవ ప్రపంచ దేశాలు అందదండలు కోల్పోయి సామ్రాజ్యవాద మహారాక్షసి బెదురు లకు ఎరవవుతున్నాయి. శ్వేతజాతి, దురహంకా రాన్ని సొంతం వెనక్కు నెట్టి ప్రజాస్వామ్యాన్ని ఏర్పరచుకునేందుకు సిద్ధమైన పాలస్తీనా విముక్తి సంస్థ ఇజ్రాయిల్ కనికరించే కన్సెషన్స్‌తో సరిపెట్టుకోవలసి వస్తున్నది.

విజయగర్వంతో విర్రవీగుతున్న అమెరికన్ సామ్రాజ్యవాదులు చీటికి మాటికి ఇరాక్‌పై దాడిచేసి దాన్ని ధ్వంసం చేయడానికి పూనుకొన్నారు. ఆకలికి ఆహుతవుతున్న సోమాలియన్లను రక్షించడానికి పోయి వాళ్లపై బాంబుల వర్షం కురిపిస్తున్నారు. అలాగే హైతీపై దాడి. అమెరికన్ సామ్రాజ్యవాదం ప్రపంచ పోలీసు తానేనన్న పొగరుబోతు తనంతో ప్రపంచబందీపోటుగా తయారైంది. సోవియట్ యూనియన్ సోషలిజాన్ని వదులుకున్నట్లే భారత దేశ ప్రభుత్వం స్వాతంత్ర్యాన్ని సార్వభౌమత్వాన్ని వదులుకొని తప్ప బ్రతకలేమని ప్రబోధిస్తోంది.

కాని మానవజీవితం, చరిత్ర యీ పతనావస్థలను ఆమోదించి వూరుకోలేదు. సోషలిజాన్ని కోల్పోయిన వాళ్లు తిరుగుబాట్లు చేసి విజయాలు సాధిస్తున్నారు. మూడవ ప్రపంచదేశాలు మళ్లీ చైనాతోనూ ఇతర సోషలిస్టు దేశాలతోనూ కలిసికట్టుగా నిలబడితే తప్ప యీ తిరోగమనాన్ని నిలువరించలేమన్న స్థితికి వస్తున్నాయి.

కనుక నేటి పరిణామాలు ఆర్చేవీ తీర్చేవీ గావు. ఇందుకు ప్రతిఘటనలే శిరోధార్యాలు. గతం కంటే మరింత మహోన్నత స్థాయిని మానవజాతి మేల్కొని పురోగమించడం అనివార్యం. అందుకే అక్టోబర్ మహావిప్లవం అంతరించలేదు. మానవజాతికి ఆనాడూ, యీనాడూ ఇక ముందూ కూడా అదే లక్ష్యం. అదే మార్గం. అదే ఆశాజ్యోతి.

**(1993లో అక్టోబరు విప్లవ 76వ వార్షికోత్సవం సందర్భంగా రాసిన వ్యాసం)**

# నేటికీ మార్గదర్శి ఆ మహా విప్లవం



సోషలిజం, కమ్యూనిజం అంతరించిం దని శత్రువులు కేరింతలు కొడుతున్నప్పటికీ ఈ సిద్ధాంతం ప్రాధాన్యత కోల్పోయిందని నిరూపించ లేకపోయారు. దాని ప్రాధాన్యతను, విలువను చరిత్ర నిరూపించింది.

హరికిషన్‌సింగ్ సూర్జిత్

మహత్తర అక్టోబర్ విప్లవానికి వ్యతిరేకంగా ఎంతటి ప్రచార దుమారం రేకెత్తిం చబడినప్పటికీ 1917 నవంబర్ 7వ తేదీన సంభవించిన ఆచారిత్రాత్మక పరిణామం ఒక మనిషిని మరొక మనిషి, ఒక జాతిని మరొక జాతి దోపిడీ చేయడాన్ని అంతంచేసి న్యాయం, సమానత్వాలతో కూడిన సామాజిక వ్యవస్థకోసం పోరాటం సాగించే విప్లవకారులకు వెలుగు చూపుతూనే ఉంటుంది.

ప్రపంచవ్యాపితంగా సామ్రాజ్య వాదులు, పెట్టుబడిదారులు జరిపిన దాడులను తట్టుకొని తిప్పికొట్టిన గాథలకు కమ్యూనిస్టు ఉద్యమంలో కొదువలేదు. ప్రతిదాడీ విప్లవ వీరుల దీక్షను మరింత దృఢతరం చేసింది. అసమానతలకు కారణమయిన దోపిడీవ్యవస్థను అంతం చేయడానికి తాము ఎంచుకున్న మార్గం సరియైనదేనన్న నమ్మకం మరింత బలపడేలా చేసింది. కారల్‌మార్క్స్ కాలంనుండి ఇది జరిగింది. సోషలిజం అంతరించిందని సామ్రా జ్యవాదులు నేడు జరుపుతున్న ప్రచారంలో కొత్తలేదు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి పెద్ద ఎదురుదెబ్బ తగిలిందనడం లో సందేహం లేదు. తూర్పు యూరప్‌లో సోషలిస్టు వ్యవస్థ కుప్పకూలింది. తొలి సోషలిస్టు దేశమైన సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమైంది.

సోషలిజం అంతరించిపోతుందన్న, లేక కమ్యూనిస్టు సిద్ధాంతం పరిపూర్ణమైంది కాదన్న జోస్యాలకు భిన్నంగా ప్రపంచవ్యాప్తంగా కమ్యూనిస్టులు తొలి దిగ్భ్రాంతినుండి తేరుకొని ఈ పరిణామాలకు దారితీసిన అంశాలను గుర్తించి, అధ్యయనం చేసేందుకు ప్రయత్నిస్తు న్నారు. పొరపాట్లనూ, లోపాలనూ అంగీకరి స్తూనే విశ్లేషణ జరిపి నిర్ధారణకు వచ్చారు. మార్క్సిజం–లెనినిజం శాస్త్రంపట్ల, కొనసాగు తున్న దాని ప్రాధాన్యత పట్ల విశ్వాసాన్ని పునరు ద్ఘాటించేందుకు ఈ నిర్ధారణలు దోహద పడ్డాయి.

అక్టోబర్ విప్లవ విజయం మార్క్సి జం–లెనినిజం సరియైనదని, శాస్త్రబద్ధంగా నిలిచేదని నిరూపించింది. ఈ బ్రహ్మాండమైన సంఘటన చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని ఆవిష్కరించింది. బలాబలాల పొందికలో తీవ్ర మైన మార్పు తీసుకువచ్చి ఆ తర్వాత ప్రపంచ వ్యాపితంగా కార్మికవర్గ ఉద్యమాలకూ, జాతీయ విముక్తి పోరాటాలకూ, సామాజిక విప్లవాలకూ ఎంతగానో ప్రోత్సాహమిచ్చింది. సామ్రాజ్య వాదుల దురాక్రమణ పథకాలకు అడ్డుకట్టవేస్తూ, వారి ప్రపంచాధిపత్య ప్రయత్నాలను విఫలం చేస్తూ సోవియట్ యూనియన్ ప్రపంచశాంతికి దృఢమైన గ్యారంటీగా నిలిచింది.

ఏడు దశాబ్దాలకు పైగా కొనసాగిన సోవియట్ యూనియన్ తన పౌరులకు అంతకు ముందెన్నడూ వినని, కనని హక్కులనూ, సదుపాయాలనూ కల్పించింది. తొలి సోషలిస్టు రాజ్యపౌరులు అనుభవించిన పనిహక్కు, విద్యాహక్కు, ఆరోగ్యహక్కు, నివాసహక్కు, ఇంకా ఇతర హక్కులు, సదుపాయాలు ఇతర దేశాల ప్రజానీకాన్ని ఎంతగానో ప్రభావితం చేశాయి. సోవియట్ యూనియన్ ఇచ్చిన ఉత్తేజంతో పెట్టుబడిదారీ దేశాలలో పోరాటాలు ఉధృత మయ్యాయి. ఫలితంగా ఈ దేశాలు సంస్కర ణలను ఆరంభించవలసి వచ్చింది. ట్రేడ్ యూనియన్ హక్కులకు గ్యారంటీ కల్పించవలసి వచ్చింది.

సోషలిస్టు రాజ్యం భూమి, శాంతిపై తొలి డిక్రీని ప్రకటించింది. లెనిన్ నాయకత్వం వహించిన పార్టీ ఆ విధంగా విప్లవాన్ని పరిరక్షించడంలో కార్మికవర్గానికి మద్దతుగా రైతాంగాన్ని కూడా సమీకరించవలసిన బాధ్యతను గుర్తించింది. ఆ విధంగా సంపాదిం

రచయిత భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. ప్రస్తుతం పార్టీ పొలిట్ బ్యూరోసభ్యులు.



**1917 జూన్ 18న పెట్రోగ్రాడ్ నగరంలో జరిగిన వీధి ప్రదర్శన: ప్రదర్శన ముందు బ్యానర్‌పై "10 మంది పెట్టుబడిదారీ మంత్రులు నశించాలి; కార్మిక, సైనిక, రైతాంగ డిప్యూటీలకూ, సోషలిస్టు మంత్రులకే అన్ని ధికారాలు; నికొలాస్ 2 (జారు చక్రవర్తి)ని పీటర్ పాల్ కోటకు తరలించాలి" అన్న నినాదం రాశారు.**

చిన బలంతోనే బాల్యదశలో ఉన్న సోషలిస్టు దేశం సామ్రాజ్యవాదుల జోక్యాన్ని త్రిప్పికొట్ట గలిగింది. అంతర్యుద్ధాన్ని అణచివేయకలిగింది.

సామాజిక పరిణామాన్ని, అభివృద్ధిని విశ్లేషించిన మార్క్స్, ఏంగెల్స్‌లు పెట్టుబడిదారీ సమాజం తగిన పునాదిని కల్పించిన తర్వాత సోషలిస్టు సమాజం ఏర్పడుతుందని చెప్పారు. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందని దేశాల్లో సోషలిజం నిర్మాణాన్ని వారు చూడలేక పోయారు. 'పెట్టుబడిదారీ వర్గపు అత్యున్నత దశ సామ్రాజ్యవాదం' గురించి అధ్యయనం చేసిన లెనిన్ సామ్రాజ్యవాద గొలుసు బలహీనంగా ఉన్న దేశంలో సోషలిస్టు విప్లవం సాధ్యమవుతుందని నిర్ధారించారు. అక్టోబర్ విప్లవం విజయవంతమవడం ఈ సూత్రీకరణకు అనుగుణంగానే వుంది. తొలి సోషలిస్టు దేశానికి పునాదులు వేయడమే కాకుండా లెనిన్ తన జీవితకాలంలో అనేక సైద్ధాంతిక సమస్యలను పరిష్కరించి సమాధానాలు చెప్పారు. పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద దశలోకి ప్రవేశించడంతో, ఆ దేశాలలోని కార్మికవర్గంలోని ఉన్నత సెక్షన్లు వలసల దోపిడీవల్ల లభించిన సంపదలో కొంతభాగాన్ని అందుకోసాగాయి. సోషల్ డెమొక్రాట్లు ప్రాతినిధ్యం వహించిన సంస్కరణవాద, రివిజనిస్టు దృక్పథంతో ఈ సెక్షన్లు ప్రభావితమయ్యాయి. యుద్ధానికి ముందు లెనిన్ జరిపిన పోరాటంపై దీని ప్రభావం ఎంతైనా ఉంది.

లెనిన్ సమాధానం చెప్పిన మరొక సమస్య-విప్లవం విజయవంతం కావాలంటే పలు దేశాల్లో ఏక సమయంలో విప్లవం రావాలన్నది. బాల్యదశలో ఉన్న తొలి సోషలిస్టు దేశం సామ్రాజ్యవాద ముట్టడిని ఎదుర్కొంటున్న సమయంలో ఆయన ఈ ప్రశ్నకు సమాధానం చెప్పారు. పారిస్ కమ్యూన్ పతనం తర్వాత మార్క్స్ ఆ అనుభవం గురించి జరిపిన విశ్లేషణ ప్రపంచ కార్మికవర్గానికి ఒక పాఠం. ఈ అనుభవం ఆధారంగా ప్రపంచవ్యాపితంగా విప్లవం ఒకేసారి విజయవంతం కాదని, దశలవారీగా జరుగుతుందని, ఆ దేశంలోని నిర్దిష్ట పరిస్థితులకు అనుగుణంగా విప్లవం విజయవంతమవుతుందని లెనిన్ చెప్పారు. విప్లవాన్ని ముందుకు తీసుకువెళ్తూనే లెనిన్ పొరపాట్లను సరిదిద్దడానికి ప్రయత్నించారు. 1921లో ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక విధానం వ్యవసాయ ఉత్పత్తిని పెంచడంలో రైతాంగాన్ని భాగస్వాములను చేయడం చూస్తాము.

సోషలిస్టు రాజ్యం అవతరించడం, సోవియట్ యూనియన్ ఏర్పాటుతో జార్ బందీఖానాలో ఉన్న అణగారిన, అణచివేతకు గురవుతున్న జాతులను విముక్తి లభించిందన్నది యథార్థం. "అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంతలోనూ వాటి విముక్తి పోరాటం లోనూ ఐక్యత" అని సోషలిస్టు రాజ్యం ఇచ్చిన నినాదం అంతర్జాతీయ కార్మికవర్గానికి, జాతీయ విమోచనోద్యమానికి కొత్తఊపునిచ్చింది. కొన్ని విప్లవాలు విజయవంతం కాకపోయినప్పటికీ

వివిధ దేశాలలోని సోషల్ డెమోక్రాటిక్ ఉద్యమాలనుండి కమ్యూనిస్టుపార్టీలు ఆవిర్భవించాయి. ప్రపంచవ్యాపితంగా జాతీయ విమోచనోద్యమాలు బలంకోసం, మద్దతుకోసం తాము ఆధారపడతగిన ఒక బలమైన స్థంభం సోవియట్ యూనియన్ ఆవిర్భవించింది. సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాలకు సోవియట్ యూనియన్ బలమైన మిత్రునిగా నిలిచింది.

సామ్రాజ్యవాదుల కుట్రలన్నింటినీ ప్రతిఘటిస్తూ అంతకుముందు తెలియని నూతన మార్గంలో సోవియట్ యూనియన్ పారిశ్రామికాభివృద్ధిలోనూ, వ్యవసాయ ఉత్పత్తిని పెంచడంలోనూ అనేక విజయాలను సాధించింది. పెట్టుబడిదారీ దేశాల్లోని ప్రణాళికా రహిత అభివృద్ధికి భిన్నంగా సోవియట్ యూనియన్ పంచవర్ష ప్రణాళికల ద్వారా ప్రణాళికాబద్ధమైన అభివృద్ధిపథాన్ని చేపట్టింది. పెట్టుబడిదారీ దేశాల్లోని ప్రజలు అనుభవించిని మెరుగైన జీవన పరిస్థితులను, హక్కులను తన ప్రజలకు కల్పించేవిధంగా ప్రణాళికా లక్ష్యాలను నిర్దేశించుకుని ముందుకుసాగింది. అయితే 70వ దశకం చివరిలో పెరుగుదల స్తంభించడం వేరే సంగతి.

ఈ అపూర్వమైన అభివృద్ధి, సోషలిస్టు వ్యవస్థ మానవునికి కల్పించిన నూతన స్థాయి, నిర్వచనం ప్రపంచం దృష్టిని ఆకట్టుకుంది. ఈ విజయాలను ఒక్క కమ్యూనిస్టులు మాత్రమే మెచ్చుకోలేదు. బూర్జువా రచయితలు, తత్వవేత్తలు, మనదేశంలో జవహర్‌లాల్ నెహ్రూ వంటివారు సోవియట్ యూనియన్ సాధించిన ఈ సర్వతోముఖాభివృద్ధిని వేనోళ్ల కొనియాడారు.

ఇంతకుముందు చెప్పినట్లు తొలి సోషలిస్టు రాజ్యం పదే పదే సామ్రాజ్యవాద దాడులకు గురికావలసి వచ్చింది. మొదట సామ్రాజ్యవాదుల జోక్యం, అంతర్యుద్ధం, దిగ్బంధనం, విటన్నింటినీ ఆ సోషలిస్టు దేశం బాల్య దశలో వుండగానే ఎదుర్కొనవలసి వచ్చింది. ఆ తర్వాత ద్వితీయ ప్రపంచ సంగ్రామం వచ్చిపడింది. ఫాసిస్టు మూకలను సామ్రాజ్యవాద దేశాలు ఎదుర్కొనలేని తరుణంలో సోవియట్ యూనియన్ ఆ దుష్టశక్తిపై నిర్ణయాత్మకమైన విజయాన్ని సాధించి ప్రపంచాన్ని ఫాసిస్టు ప్రమాదంనుండి కాపాడింది. కోట్లాది సోవియట్ సైనికులు ప్రాణాలు అర్పించారు. ఆర్ధికంగా ఆ దేశం ఎంతో నష్టపోయింది.

ఫాసిజంపై విజయం ప్రపంచంలో బలాల పొందికలో మరింత తీవ్రమైన మార్పులను తెచ్చింది. సోవియట్ ఎర్రసేన తూర్పు ఐరోపా దేశాలను కూడా విముక్తం చేయడంతో ఆ దేశాలలో కూడా సోషలిస్టు వ్యవస్థలు ఏర్పడ్డాయి. జపాన్ ఓటమి చైనా విప్లవ విజయానికి దారితీసింది. యుద్ధం ముగిసిన తొలి సంవత్సరాలలోనే ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని అనేక దేశాలు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్నాయి. ఇటువంటి దేశాలలో భారత్ కూడా ఒకటి. ప్రత్యక్షపాలన అంతరించినప్పటికీ సామ్రాజ్యవాదులు ఈ దేశాలపై పరోక్షంగా పెత్తనం చలాయించడానికి ప్రయత్నించారు. ఈ స్థితిలో ఈ నవస్వతంత్ర విప్లవం మళ్లీ ఆదుకున్నది. సోవియట్ యూనియన్ అక్టోబర్ విప్లవం సంభవించకుండా వుండివుంటే నేటి ప్రపంచపటం మరొకవిధంగా వుండేది.

గత కొద్ది సంవత్సరాలుగా జరిగిన దురదృష్టకర సంఘటనలు మాజీ సోషలిస్టు దేశాలలో పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరణ ప్రయత్నాలకు దారి తీయడమే కాకుండా సోవియట్ యూనియనే విచ్ఛిన్నమయిపోయింది. మన పార్టీ 14వ మహాసభ విశ్లేషించిన విధంగా ఇవి మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాన్ని నిర్దుష్ట పరిస్థితులకు అనుగుణంగా అన్వయించడంలో వక్రీకరణల ఫలితంగానూ, సోషలిస్టు నిర్మాణంలో సంభవించిన తీవ్రమైన పొరపాట్లు, తప్పిదాలు ఫలితంగానూ ఏర్పడినాయి. పొరపాటు అవగాహనలకు చోటు కల్పించబడింది. వాస్తవాలను విస్మరించడం జరిగింది. ఆయుధరంగంలో సామ్రాజ్యవాదంతో సమానత్వాన్ని సాధించడానికి ప్రాధాన్యత ఇవ్వడం సరియైనదే అయినప్పటికీ పారిశ్రామిక అభివృద్ధికి, శాస్త్ర, సాంకేతిక రంగాలలో అభివృద్ధికి ఇవ్వవలసిన ప్రాధాన్యతను గుర్తించలేదు. ఆర్ధికరంగ సమస్యలను విస్మరించడమే కాకుండా నిర్ణయాల రూపకల్పనలో ప్రజలకు ప్రాతినిధ్యం కల్పించడం వదిలి వేయబడింది. పార్టీకీ, రాజ్యవ్యవస్థకూ మధ్య తేడా విస్మరించబడింది. కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాన్ని వక్రీకరించి కేంద్రీకరణకు అధిక ప్రాధాన్యత ఇవ్వబడింది. మన పార్టీ మహాసభ చెప్పినవిధంగా పార్టీ స్థానాన్ని నాయకత్వం, నాయకత్వస్థానాన్ని మురా ఆక్రమించాయి. తీవ్రలోపాలు, పొరపాట్లు, తప్పిదాలు, ఎదురుదెబ్బలకు కారణమయ్యాయి.

ప్రస్తుతం సోషలిజం అమలులో వున్న చైనా, క్యూబా, వియత్నాం, ఉత్తర కొరియాలు గత పొరపాట్ల నుండి గుణపాఠాలు తీసుకొని తగు మార్పులు చేసుకుంటున్నాయి. ఆ దేశంలోని పాలకపార్టీలు అక్కడి నిర్దుష్ట పరిస్థితులకు అనుగుణమైనవని భావించిన చర్యలు గైకొంటున్నాయి.

అంతర్గత విచ్ఛిన్నాన్ని సామ్రాజ్యవాదం ప్రోత్సహించి, సహాయమందించిందనడంలో సందేహం లేదు. తాత్కాలికంగా అది విజయవంతమయింది కూడా. కాని దోపిడీ వ్యవస్థకు ఆకలి, దారిద్ర్యం, నిరుద్యోగం సహజ లక్షణాలు. తూర్పు ఐరోపా దేశాలు, మాజీ సోవియట్ రిపబ్లిక్కులు పెట్టుబడిదారీ విధానాన్ని ఇప్పుడిప్పుడే చవిచూస్తున్నాయి. అక్కడి ప్రజలు వాటిని ప్రతిఘటిస్తూనే ఉన్నారు. గత అక్టోబర్ ప్రథమార్ధంలో మాస్కో వీధుల్లో ఎల్సిన్ సైన్యాన్ని వేలాది ప్రజానీకం ఎదిరించడమే దీనికి తార్కాణం. పార్లమెంటును రద్దుచేస్తూ ఎల్సిన్ జారీచేసిన ఉత్తర్వు తొలుత ప్రజలు రంగంలోకి దిగడానికి కారణమయ్యింది. కాని అసంతృప్తి బీజాలు ప్రజల్లో ఎప్పుడో నాటుకున్నాయి. సామ్రాజ్యవాదుల మద్దతుతో కొనసాగుతున్న ఎల్సిన్ ప్రభుత్వం అంతకంతకూ అధిక ప్రతిఘటనను ఎదుర్కొనవలసి వస్తున్నది. పోలెంలో అభ్యుదయ వాదులకు విజయం, మాజీ సోషలిస్టు దేశాలలో సాధించబడిన ప్రయోజనాలు గమనంలోకి తీసుకుంటే అంతా అయిపోయిందని భావించనవసరం లేదు. సామ్రాజ్యవాదుల దాడికి తలొగ్గిన పార్టీలు పునర్వ్యవస్థీకృత మవుతున్నాయి. సామ్రాజ్యవాదుల కుట్రలు తాత్కాలికంగా విజవంతమయినప్పటికీ, ఎంతోకాలం గడవకుండానే త్రిప్పికొట్టబడతాయి. కలకత్తా అంతర్జాతీయ సెమినార్ నిర్ధారణకు వచ్చిన విధంగా, మార్క్సిజం-లెనినిజం ప్రాధాన్యత చెక్కుచెదరనిది. సోషలిజం, కమ్యూనిజం అంతరించిందని శత్రువులు కేరింతలు కొడుతున్నప్పటికీ ఈ సిద్ధాంతం ప్రాధాన్యత కోల్పోయిందని నిరూపించలేకపోయారు. దాని ప్రాధాన్యతను, విలువను చరిత్ర నిరూపించింది. కమ్యూనిస్టు వ్యతిరేకులు, అభివృద్ధిజం నిరోధకులు ఎంత తీవ్రంగా దాడిచేసినప్పటికీ అక్టోబర్ మహా విప్లవం, తొలి సోషలిస్టు రాజ్య అవతరణ ప్రాధాన్యతనూ, మార్గదర్శకపాత్రనూ మరుగుపరచజాలదు.

**(1993లో నవంబరు విప్లవ 76వ వార్శికోత్సవం సందర్భంగా రాసినది)**



# సోవియట్ శిబిరానికి ఎదురుదెబ్బ: సైద్ధాంతిక, చారిత్రక కారణాలు

## సిపిఐ(ఎం) విశ్లేషణ

**సోవియట్ విచ్ఛిన్నానంతరం మార్క్సిస్టు పార్టీ ఆధ్వర్యంలో 1993లో కలకత్తాలో జరిగిన కమ్యూనిస్టుపార్టీల అంతర్జాతీయ సమావేశంలో భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) తరఫున పార్టీ ప్రధాన కార్యదర్శి హరికిషన్ సింగ్ సూర్జిత్ ప్రవేశపెట్టిన పత్రం సంక్షిప్త పాఠం:**

మా ఆహ్వానాన్ని మన్నించి, ఈ సెమినార్‌లో పాల్గొనేందుకై వచ్చినందుకుగాను ముందుకు సిపిఐ (ఎం) తరఫున కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఇప్పుడు ఈ సమస్యలను చర్చించా నికి కారణం మానవాళి విముక్తికి శత్రువులైన సామ్రాజ్యవాదులు, వారి ఏజెంట్లు రాజకీయ సైద్ధాంతిక దాడిని తీవ్రం చేయడమే కాదు, అంతకుమించి ఈ సృజనాత్మక శాస్త్రంయొక్క తిరుగులేని చెల్లుబాటును మళ్లీ ఎలుగెత్తి చాటాల్సి వున్నందువల్లనే మనం ఈ చర్చ చేబట్టాల్సి వచ్చింది. గతంలోని తప్పులను సవరించుకొని, వివిధ దశల్లో బలాబలాల పొందికను గురించి పునరంచనా వేసుకోవాలి. అలాగే మనలో బలహీనతలు, వెనుకబాట్లు తొలగించుకోవాలి. మానవజాతి విముక్తికై పోరాటాన్ని ముందుకు తీసుకుపోవడానికి ఈ కృషి ఉత్తేజమివ్వాలి.

సమకాలీన ప్రపంచ పరిస్థితిలోని సంక్లిష్ట క్రమంలో ఈ దాడి చేయదానికి రెండు అంశాలు ప్రధానంగా ఉపయోగించుకోబడుతు న్నాయి. ఒకటి-సోవియట్, తూర్పు యూరప్ లలో సోషలిజం విచ్ఛిన్నం. రెండు-మానవ సమాజ పరిణామంలో అంతిమదశగా పెట్టుబడిదారీ విధానం 'అజేయం' అనే వాదన.

తక్కిన అన్ని అంశాలతోపాటు పై రెండు వాదనలు కూడా సృజనాత్మక శాస్త్రంగా మార్క్సిజాన్ని త్రోసిపుచ్చజాలవు. అంతేగాక ఆ పరిణామాలను అర్థం చేసుకోవడానికి ఏకైక ప్రాతిపదికగా మార్క్సిజమే ముందుకొస్తుంది.

ఈ వక్కాణింపును విశదీకరించే ముందు మార్క్సిజం ముఖ్య లక్షణాలను క్లుప్తంగా గుర్తు చేసుకోవడం అవసరం. లెనిన్ దీనిపై చెప్పిన దానికన్నా మెరుగ్గా ఏమీ చెప్పలేము. "తత్వశాస్త్ర చరిత్రను", సామాజిక శాస్త్రాల చరిత్రలను పరిశీలిస్తే మార్క్సిజంలో ఒంటెత్తువాదనలాంటిదేమీ లేదని చాలా స్పష్టంగా వెల్లడవుతుంది. ఎందుకంటే అది దీర్ఘకాలికమై, నిగ్గుతేలిన సిద్ధాంతం. ప్రపంచ నాగరికతాభివృద్ధి అనే ఉన్నతపథంలో ఉద్భవించిన సిద్ధాంతం గనుక ఒంటెత్తువాదం కాజాలదు. అందుకు మారుగా మానవజాతి మహోన్నత మేధావులు లేవనెత్తిన ప్రశ్నలకు సమాధానాలు సమకూర్చడంలోనే మార్క్స్ గొప్పతనం ఇమిడివుంది. తత్వశాస్త్రం, రాజకీయ అర్థశాస్త్రం, సోషలిజం సిద్ధాంతాల ప్రతినిధులైన మహోన్నతుల బోధనల ప్రత్యక్ష, తక్షణ కొనసాగింపుగానే ఆయన సిద్ధాంతం రూపొందింది. "(మార్క్సిజంలో మూడు అంశాలు-లెనిన్)

లెనిన్ ఇంకా ఇలా చెప్పారు. "మార్క్స్ గొప్పతనం ఏమంటే మొదటిసారిగా ప్రపంచ చరిత్ర నేర్పే పాఠాలను కనుగొని, వాటిని నికరంగా అన్వయించడమే. ఆయన చెప్పిన పాఠమే వర్గపోరాట సిద్ధాంతం".

కొన్ని సైద్ధాంతిక సమస్యలపై సిపిఐ (ఎం) 14వ మహాసభ చేసిన తీర్మానం ఇలా పేర్కొంది. "మార్క్సిజం లెనినిజం స్వతహాగా భౌతికవాద సృజనాత్మక స్వభావం కలిగింది. అది సహజంగానే గతితార్కికమైంది. అందుకే అది పిడివాదానికి పూర్తి విరుద్ధమైనది. అందువల్లనే అది విముక్తి దృష్టికలదిగా, విమోచన భావాలు వ్యక్తం చేస్తుంది. చారిత్రక పరిస్థితుల మార్పుకు కారణమైన వివిధాంశాలను అధ్యయనం చేసేందుకు అది ఒక పరికరం. విముక్తికై ప్రజలు జరిపే పోరాటాల కార్యాచరణ లక్ష్యాలను మారుతున్న చరిత్ర పరిస్థితులకు అనుగుణంగా నిర్దేశించే మార్గదర్శి".

"ఒక సృజనాత్మక శాస్త్రంగా మార్క్సిజం-లెనినిజం అభివృద్ధిలో ధోరణులను, దశలను గుర్తిస్తుంది. అలా చేసే సందర్భంలో అది దోపిడీ రహిత సమాజ స్థాపనకై ఈ పరిణామాలలో జనబాహుళ్యం జోక్యానికి అవకాశం కలిగిస్తుంది. ఉదాహరణకు దోపిడీపై ఆధారపడిన పెట్టుబడిదారీ విధానం స్థానంలో సోషలిజం రావడమనేది దానికదే జరిగే ప్రక్రియకాదు. కార్మికవర్గం, రైతాంగం, శ్రామిక ప్రజల




**1917 జూన్‌లో జరిగిన కార్మిక, సైనిక డిప్యూటీల అఖిల రష్యా సమావేశంలో ప్రతినిధులు. సమావేశంలో పాల్గొన్న నాటి ప్రముఖ బోల్షివిక్కులు జినోవీవ:, కామనీవ్, అలెగ్జాండర్ కొల్లంతాయ్‌లను గుర్తులతో చూపడం జరిగింది.**

పోరాటోధృతికి సరైన సైద్ధాంతిక, రాజకీయ, నిర్మాణ నాయకత్వం సాధించడమే ఈ సామాజిక పరివర్తనకు కీలకాంశం. ఈ వర్గ చైతన్యం చల్లారినప్పుడు లేదా మొద్దుబారినప్పుడు విప్లవ ప్రతీఘాతక శక్తులు తమ వర్గపాలనను కొనసాగించేందుకు దాన్ని ఉపయోగించుకుంటాయి".

తర్వాతి ప్రపంచ పరిణామాలూ, ప్రస్తుత పరిస్థితి కూడా మార్క్సిస్టు ప్రాధమిక దృక్పధ సమంజసత్వాన్ని నిరూపిస్తున్నాయి.

సోవియట్, తూర్పు యూరప్ దేశాలలో సోషలిజం విచ్ఛిన్నానికి దారితీసిన కారణాలను పరిశీలించే సందర్భంలో సిపిఐ (ఎం) మూడు ముఖ్యమైన లోపాలను గుర్తించింది. ఈ రంగాలలో పొరబాటు అంచనాలవల్ల అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం బలపడేందుకు బదులు తన బలమైన పునాదులు కోల్పోయింది.

పెట్టుబడిదారీ విధానాల నుంచి సోషలిజానికి పరివర్తన గురించిన అవగాహన, పెట్టుబడిదారీ విధానం శక్తిని సరిగ్గా అంచనా వేయడం, మార్క్సిజం-లెనినిజం విప్లవకర సారాంశం నుంచి వైదొలగడం అనేవే ఆ మూడు అంశాలు.

పెట్టుబడిదారీ విధానం నుంచి సోషలిజానికి జరిగే పరివర్తనాన్ని ఏ ఆటుపోట్లూ, ఆటంకాలూ లేని పూలబాట అని చాలా తేలిగ్గా, యాంత్రికంగా భావించడం జరిగింది. పైగా ఈ క్రమం తిరుగులేనిదని భావించడం జరిగింది. వాస్తవానికి మానవజాతి వర్గ సమాజాలలో అన్నిటికన్నా ఉన్నతమైన పెట్టుబడిదారీ విధానంనుంచి వర్గరహితమైన కమ్యూనిజానికి పరివర్తన చెందేదశ సోషలిజం. దోపిడీ సమాజాన్ని నిలబెట్టాలని కోరే విప్లవ ప్రతీఘాత శక్తులకూ, మానవజాతి విముక్తికోరే విప్లవశక్తులకూ మధ్య ఘర్షణ ఈ దశలో సహజంగా వుంటుంది.

ఈ పోరాటంలో విజయం లేదా అపజయం అనేవి ఎప్పుడైనా సరే సోషలిస్టు దేశాలలో సోషలిజం నిర్మాణంలో సాధించిన ప్రగతి, అంతర్జాతీయంగా, అంతర్గతంగా గల బలాబలాల పొందిక, దాన్ని గురించిన సరైన అంచనాలపై ఆధారపడి వుంటాయి. సైద్ధాంతిక పెడపోకడలపై ఆధారపడి పొరబాటు అంచనాలు, విశ్లేషణలు చేస్తే వక్రీకరణలు సంభవిస్తాయని అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర చెబుతున్నది.

1957-1960 అంతర్జాతీయ మహాసభలలో పెట్టుబడిదారీ విధానానికిగల శక్తి సామర్థ్యాల గురించి వేసిన అంచనా అలాంటి వాటికి ఒక ఉదాహరణ. 1960 మహాసభ డాక్యుమెంట్ ప్రపంచశక్తుల బలాల పొందిక సోషలిజానికి అనుకూలంగా మారిందని చెప్పింది. అంతటితో ఆగక పెట్టుబడిదారీ విధానానికి భవిష్యత్తులేదని, ప్రపంచ పరిణామాల రూపకల్పనలో సోషలిజానిదే నిర్ణయాత్మక శక్తి అని చెప్పేవరకు వెళ్ళింది. అలాంటి నిర్ధారణ పరివర్తనా దశకు గల స్పష్టమైన స్వభావం పట్ల సరైన అవగాహన లోపించిన ఫలితమే. అంతేగాక పెట్టుబడిదారీ విధానానికి గల శక్తినికూడా చాలా తక్కువ అంచనా వేసింది. ఉత్పత్తి శక్తుల్ని మరింత పెంచుకోవడానికి,

మారిన పరిస్థితులకు అనుగుణంగా మార్పు చెందడానికి దానికిగల శక్తిసామర్థ్యాలను బాగా తక్కువచేసి చూడడం జరిగింది.

సోవియట్‌పార్టీ 20వ మహాసభలో వర్గశక్తుల పొందిక గురించి వేసిన పొరబాటు అంచనా ఇందుకు తోడ్పడింది. శాంతియుత సహజీవనం, శాంతియుత పరివర్తనలకు సంబంధించిన లెనినిస్టు దృక్పథాన్ని కృశ్చేవ్ నాయకత్వంలోని సోవియ్ పార్టీ దారుణంగా వక్రీకరించింది. రివిజనిజానికి, పచ్చి వర్గ సాంకర్యానికి ద్వారాలు తెరిచింది. ఫలితంగా అనేక కమ్యూనిస్టుపార్టీలు చెల్లాచెదురైనాయి. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ బలం సన్నగిల్లింది.

పెట్టుబడిదారీ విధానం మారిన పరిస్థితులకు అనుగుణంగా మారుతూ కొత్త కొత్త దోపిడీ రూపాలను కనిపెట్టింది. సోషలిజంపై సైద్ధాంతిక దాడిని తీవ్రంచేసింది. కాని పెట్టుబడిదారీ విధానాన్ని తక్కువ అంచనా వేసినందువల్ల మితవాద, మితవాద పెడధోరణులవల్ల అందుకు ప్రతిగా జరగాల్సిన సోషలిస్టు సైద్ధాంతిక ఎదురుదాడి నీరుగారిపోయింది. పెడధోరణు లనూ, వక్రీకరణలనూ సరిచూసుకోవడానికి మారుగా 70, 80 దశకాలలో సోషలిస్టు నిర్మాణంలో తప్పులు మరింతగా పేరుకుపోయాయి. దీనివల్ల సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారీ విధానం రాజకీయంగా లాభపడ్డాయి.

ఇలాంటి తప్పులకు సోషలిజాన్ని అతిగా అంచనా వేసే ధోరణికూడా తోడ్పడిందని ఆత్మ విమర్శనాపూర్వకంగా చెప్పుకోవలసి వుంది.

ఇలాంటి పొరబాటు అంచనాలు, పెడధోరణులకు తోడు సోషలిస్టు నిర్మాణానికి సంబంధించి నాలుగు ముఖ్యరంగాలలో నిర్దిష్టమైన పొరబాట్లు, లోపాలు సంభవించాయి. అవి 1. కార్మికవర్గ నియంతృత్వ దశలో రాజ్యాంగ యంత్ర స్వరూపం 2. ఆచరణలో సోషలిస్టు ప్రజాస్వామ్యం. 3. సోషలిస్టు ఆర్థిక నిర్మాణం. 4. సోషలిస్టు దేశాల్లో పార్టీ, ప్రజల సైద్ధాంతిక చైతన్యం అనే నాలుగు రంగాలకు సంబంధించిన అంశాలను సిపిఐ (ఎం) 14వ మహాసభ కొంత వివరంగానే చర్చించింది.

అయితే గత తప్పిదాలను, పెడధోరణులను సోషలిజం, మార్క్సిజం-లెనినిజం పరిధిలో సరిదిద్దుకోడానికి బదులు గోర్బచేవ్ నాయకత్వంలోని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ లిక్విడేషనిస్టు మార్గాన్ని అనుసరించింది. అది అంతిమంగా సోషలిజం విచ్ఛిత్తికి దారితీసింది.

ఈ అనుభవం లోతుపాతుల గురించి మరింత వివరమైన విశ్లేషణ జరగాలి. అయితే సోషలిస్టు నిర్మాణంలో జరిగిన ఈ తప్పులు, పెడపోకడలు, వక్రీకరణల వల్లనే సోషలిజం ఈ దేశాల్లో దెబ్బతిన్నదని సిపిఐ (ఎం) గట్టిగా భావిస్తోంది. అందువల్ల ఈ పరిణామాలు సోషలిజం లేదా మార్క్సిజం-లెనినిజం అనే శాస్త్రాన్ని వమ్ముచేసేవిగా లేవు.

ఒక శాస్త్రంగా, ఒక పద్ధతిగా, ఆచరణకు మార్గదర్శిగా మార్క్సిజం-లెనినిజం ప్రాధాన్యత చెక్కుచెదర లేదని ప్రస్తుత ప్రపంచ పరిణామాలు నిరూపిస్తున్నాయి. ఈ ఉన్నతస్థాయి విప్లవకారుల సమావేశంలో సుపరిచితమైన సంఖ్యా వివరాలు వివరించనవసరం లేదని నా అభిప్రాయం. అయితే ప్రస్తుత ప్రపంచ పరిస్థితిని నాలుగు ప్రాథమిక వైరుధ్యాల రూపంలో చూడవచ్చు. పెట్టుబడిదారీ దేశాల్లో కొనసాగుతున్న మాంద్యం పెట్టుబడికి-కార్మికులకు మధ్య వైరుధ్యాన్ని తీవ్రం చేస్తున్నది. సంక్షోభ భారాన్ని తృతీయ ప్రపంచ దేశాలపైకి నెట్టివేయాలనే సామ్రాజ్య వాద దేశాల ప్రయత్నాలు వాటికి తృతీయ ప్రపంచ దేశాల ప్రజలకు మధ్య వైరుధ్యాన్ని తీవ్రం చేయడం తథ్యం. తన 'నూతన ప్రపంచ వ్యవస్థ' స్థాపించుకునేందుకై అమెరికా సాగిస్తున్న రాజకీయ ఎదురుదాడే ఈ వైరుధ్యాన్ని ఇంకా తీవ్రం చేస్తుంది. సామ్రాజ్యవాదుల మధ్య అంతర్గత వైరుధ్యాలు పెరుగుతూనే ఉన్నాయన్నది అనేక రూపాలలో వ్యక్తం అవుతున్నది. ముఖ్యంగా ఆర్థికరంగంలో వీటిని చూడవచ్చు. క్యూబాపై అమెరికా నాయకత్వాన అమలు జరుగుతున్న ఆర్థిక దిగ్బంధనం, అణు తనిఖీ గురించి ఉత్తర కొరియాపై సాగుతున్న కొత్తగా మొదలైన దాడి, వియత్నాంకు వ్యతిరేకంగా ఆంక్షల కొనసాగింపు ఇవన్నీ సోషలిజానికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదుల ఎదురుదాడిని సూచిస్తున్నాయి.

ఈ వైరుధ్యాలు ప్రపంచ పరిణామాలను ప్రభావితం చేస్తూనే వున్నప్పటికీ, వాటిని పరిష్కరించే రూపాలు మాత్రం నిర్దిష్ట పరిస్థితినిబట్టి మారవచ్చు. ఉదాహరణకు సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యాలు మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలకు దారితీసిన స్థితి ఈనాడు దాదాపు మళ్లీ రాకపోవచ్చు. ఈ పరిణామాలు మార్క్సిజం మౌలిక పునాదిని బలపరిచేవిగా వున్నాయి. అయితే మానవీయ కృషి లోపిస్తున్నది. అందుకే పెట్టుబడిదారీ విధానం ఎత్తుగడలు సాగించడానికి తగినంత అవకాశం లభిస్తోంది.

సామ్రాజ్యవాదం తన దగ్గర తట్టుకోగల శక్తి గతంలో వూహించినదానికన్నా ఎక్కువగా వుందని నిరూపించుకుంది.

దీని అర్థం సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారీ విధానం తిరుగులేనివని కాదు.

అయితే పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి పరివర్తన మరింత దీర్ఘకాలం ఆటుపోట్లతో నిండి ఉంటుంది.

ప్రస్తుత పరిస్థితిలో మార్క్సిజాన్ని సుసంపన్నం చేయడం, విప్లవ పోరాటాన్ని ముందుకు తీసుకుపోవడం కోసం సమకాలీన పరిణామక్రమం గురించి మరింత లోతైన రాజకీయ అధ్యయనం అవసరం. నిజం చెప్పాలంటే లెనిన్ చేపట్టిన ఈ బృహత్తర కార్యక్రమాన్ని ముందుకు గొనిపోవాలి.

పెట్టుబడిదారీ విధానపు అక్రమ, అమానుష స్వభావాన్ని సమకాలీన ప్రపంచం కళ్లకు కట్టి చూపిస్తున్నది.

మాజీ సోషలిస్టు దేశాల అనుభవం దీన్ని మరింతగా నిరూపిస్తోంది. పెట్టుబడిదారీ విధానం ఈ దేశాల సమస్యలు పరిష్కరించే సత్తా తనకు లేదని నిరూపించుకున్నది.

కమ్యూనిస్టుల కర్తవ్యాలు నిజంగానే చాలా బృహత్తరమైనవి. మన యుగ ప్రధాన వైరుధ్యాలు తీవ్రమైనాయి. తృతీయ ప్రపంచాన్ని 'పునఃవలస' దేశాలుగా మార్చే దుర్మార్గ ప్రయత్నం కొత్తగా మొదలైంది. సామ్రాజ్యవాదం నూతన ప్రపంచవ్యవస్థను రుద్దాలని చూస్తున్నది. ఈ పరిస్థితులలో కమ్యూనిస్టులు, సామ్రాజ్యవాద వ్యతిరేక శ్రేణులు మరింతగా భుజంకలిపి నిలవాల్సి వుంది. కమ్యూనిస్టులు, ప్రగతిశీలులు, సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులన్నిటి ఐక్యత అంతర్జాతీయతకు ప్రాతిపదిక అవుతుంది. ఆ ప్రాతిపదికపైనే సామ్రాజ్యవాదపు ఎదురుదాడిని తిప్పికొట్టగలం.



## విప్లవ నిర్మాణ పద్ధతుల ప్రాధాన్యత తెలిపే

# సోవియట్ కమ్యూనిస్టు పార్టీ అనుభవం



బి.వి. రాఘవులు

**90** సంవత్సరాల క్రితం రష్యాలో విప్లవం జయప్రదం కావడంతో ప్రపంచంలోనే మొట్టమొదటి సోషలిస్టు రాజ్యం ఏర్పడింది. అంతకుముందు జయప్రదం అయిన అన్ని విప్లవాలకన్నా రష్యన్ విప్లవం మౌలికంగా భిన్నమైనది. దోపిడీవర్గాలను ఓడించి, పీడిత వర్గాలను పాలకులుగా చేసిన శ్రామికవర్గ విప్లవం అది. మనిషిని మనిషీ, జాతిని జాతీ దోపిడీజేయడాన్ని అంతమొందించిన విప్లవం అది.

ఈ విప్లవానికి బోల్షివిక్ పార్టీ సారధ్యం వహించింది. విప్లవాన్ని రక్షించడం లోనూ, సోషలిజాన్ని నిర్మించడంలోనూ శ్రామిక వర్గాలకు జయప్రదంగా నాయకత్వం వహించింది.

నేడు ఆ సోషలిస్టు రాజ్యం పతనం అయ్యింది. ఆ బోల్షివిక్ పార్టీ వారసురాలైన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీయే ఈ విప్లవ పతనానికి, తన స్వీయ నాశనానికి కూడా బాధ్యురాలయ్యింది.

ఒకప్పటి విప్లవ బోల్షివిక్ పార్టీకి ఎందుకిటువంటి వినాశకరస్థితి, దాపురించింది? విప్లవపార్టీ నిర్మాణాన్నీ, విప్లవ సిద్ధాంతాన్నీ వదులుకోవడమే దీనికి ముఖ్య కారణం. విప్లవాన్ని సాధించడానికి లెనిన్ నిర్మించిన విప్లవపార్టీ ఎలాంటిదో, తర్వాత అది ఎలా దిగజార్చబడిందో పరిశీలిస్తే ఈ విషయం మనకు స్పష్టం అవుతుంది.

పెట్టుబడిదారీవర్గానికీ, కార్మికవర్గానికీ మధ్య జరిగే వర్గపోరాటంలో పెట్టుబడిదారులకు అనేక బలాలు వున్నాయి. సంపద, రాజ్యాంగయంత్రం, ప్రచార సాధనాలు, పాలకవర్గ భావాలు ఇవన్నీ పెట్టుబడిదారీ వర్గానికి తోడ్పడతాయి.

కార్మికవర్గ విప్లవం జయప్రదం అయి పెట్టుబడిదారీ వర్గాన్ని రద్దుపర్చినచోట కూడా పెట్టుబడిదారీ వర్గం నిరంతరం బలపడుతూనే వుంటుంది. దీనిగురించి లెనిన్ ఇలా అన్నాడు. "బూర్జువావర్గం అధికారం నుంచి కూలద్రోయబడ్డంతో, దాని ప్రతిఘటన పదిరెట్లు ఎక్కువ అవుతుంది. దాని బలం ప్రపంచ పెట్టుబడిదారుల బలంలోనేకాక, పెట్టుబడిదార్ల మధ్య వుండే అంతర్జాతీయ సంబంధాలలోనే కాక, అలవాట్ల బలంలోనూ, చిన్న తరహా ఉత్పత్తి యొక్క బలంలోనూ కూడా ఉంటుంది. ఎందు చేతనంటే దురదృష్టవశాత్తూ ప్రపంచంలో చిన్న తరహా ఉత్పత్తి ఇప్పటికీ చాలా విస్తృతంగా వ్యాప్తిలో వుంది. ఇది అనవసరంగా రోజురోజుకు, గంట గంటకు దానంతట అది పెట్టుబడిదారీ వర్గాన్ని, పెట్టుబడిదారీ విధానాన్ని భారీ ఎత్తున అభివృద్ధి చేస్తూ వుంటుంది".

కాని కార్మికవర్గానికి పై బలాలేమీ లేవు. దానికున్నది తన సంఖ్యాబలం, ఇతర శ్రామికప్రజల సంఖ్యాబలం. ఈ సంఖ్యాబలానికి నిజమైన శక్తి కలగాలంటే సంఘటితం కావడం అవసరం. దానికి నిర్మాణం అవసరం.

అందుకే లెనిన్ "అధికారం కైవసం చేసుకోడానికి జరిపే పోరాటంలో శ్రామికవర్గానికి నిర్మాణం తప్ప మరో ఆయుధం లేదు" అని అన్నాడు.

ఈ నిర్మాణానికి పదును, పటిమ రావాలంటే ఉక్కు క్రమశిక్షణ, కేంద్రీకృతం వుండాలని లెనిన్ భావించాడు. పెట్టుబడిదారీ వర్గంపై కార్మికవర్గం విజయం సాధించాలంటే ఈ రెండే ప్రధానమైన షరతులుగా లెనిన్ పేర్కొన్నాడు. ఈ విషయాన్నే ఇంకా కటువుగా చెబుతూ కార్మికవర్గ పార్టీయొక్క ఉక్కు క్రమశిక్షణను ఎవరైనా కించిత్తు బలహీనపర్చినా వాస్తవంలో కార్మికవర్గానికి వ్యతిరేకంగా బూర్జువా వర్గాన్ని బలపరిచినట్లేనని లెనిన్ హెచ్చరించాడు.

బోల్షివిక్కులు రష్యన్ విప్లవాన్ని సాధించడానికీ, అనంతరం విప్లవ రాజ్యాన్ని నిలబెట్టుకోవడానికీ ప్రధానంగా ఉక్కు క్రమశిక్షణ, ప్రజలతో సంబంధాలూ దోహదపడ్డాయని పేర్కొన్నారు.

"మన పార్టీలో అతి కఠినమైన శిక్షణ, నిజమైన ఉక్కు శిక్షణ అమలు జరిగి వుండకపోతే, మొత్తం కార్మికవర్గపు సహకారాన్ని అది పూర్తిగా, నిర్ద్వంద్వంగా పొంది వుండకపోతే... అంటే వెనుకబడిన తరగతులను నడపగలిగిన, లేదా తమ వెంట తీసుకువెళ్ల గలిగిన బుద్ధి కుశలురందరి, నిజాయితీపరులందరి, త్యాగశీలురందరి, పలుకుబడిగలవారందరి సహకారాన్నీ పొంది ఉండకపోతే బోల్షివిక్కులు రెండున్నర సంవత్సరాలు కాదు కదా, రెండున్నర మాసాలైనా అధికారంలో వుండగలిగేవారు కాదు."

రచయిత భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) రాష్ట్ర కార్యదర్శి, పొలిట్‌బ్యూరో సభ్యులు

విప్లవపార్టీ యొక్క ఈ మౌలిక లక్షణాల గురించి అవగాహన యాదృచ్ఛికంగా వచ్చింది కాదు. రష్యన్ సోషల్ డెమొక్రటిక్ లేబర్ పార్టీని నిర్మించే క్రమంలో వచ్చిన అనుభవాల నుంచీ, పార్టీ ఆంతరంగిక పోరాటంలో వచ్చిన నిర్ధారణల నుంచీ విప్లవపార్టీ నిర్మాణ సూత్రాలను లెనిన్ రూపొందించాడు. 1903లో జరిగిన రష్యా సోషల్ డెమొక్రటిక్ లేబర్ పార్టీ 2వ మహాసభలో పార్టీ నిర్మాణ సూత్రాలపై తీవ్ర చర్చ జరిగింది. ఈ చర్చ క్రమశిక్షణ, కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాలపై జరిగింది.

పార్టీ సభ్యుడు పార్టీ కార్యక్రమాన్ని ఆమోదించి, దానికి ఆర్థికంగా సాయపడుతూ, పార్టీ సంస్థలలో ఏదో ఒక దానికి చెంది వుండాలని లెనిన్ ప్రతిపాదించాడు. పార్టీ సభ్యుడు కార్యక్రమాన్ని అంగీకరించి, సాయం చేస్తుంటే సరిపోతుంది. ఏదో ఒక పార్టీ సంస్థలో వుండనవసరం లేదు అని మార్టోవ్ ప్రతిపాదించాడు.

లెనిన్ ప్రతిపాదన ప్రకారం ప్రతిపార్టీ సభ్యుడూ ఏదో ఒక సంస్థలో వుండి దాని క్రమశిక్షణకు కట్టుబడి వుండాల్సి ఉంది. మార్టోవ్ ప్రతిపాదన ప్రకారం పార్టీ సభ్యుడు పార్టీ సంస్థల నిర్ణయాలకు కట్టుబడనవసరం లేదు. ఏ పార్టీ సంస్థకూ చెందకుండానే పార్టీ సభ్యుడనని చెప్పుకోవచ్చు.

మార్టోవ్ ప్రతిపాదనలనే అంగీకరిస్తే పార్టీ ఎప్పుడూ ఐక్యతను సాధించజాలదు. పార్టీ సభ్యుల మధ్య ఉమ్మడి కార్యాచరణ సాధ్యం కాదు. సిద్ధాంతంలోనూ, కార్యాచరణలోనూ పార్టీ సభ్యులు ఎవరికి వారే యమునాతీరే నన్నట్లయి వర్గపోరాటం చేయగల శక్తి పార్టీకి నశిస్తుంది.

అందుచేతనే లెనిన్ ఈ నిర్మాణ రాహిత్య వాదనలను తిరస్కరించి బోల్షివిక్ పార్టీని ఉక్కు క్రమశిక్షణ ప్రాతిపదికన నిర్మించాడు.

కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్ర విషయంలోనూ తీవ్ర వాదోపవాదాలు జరిగాయి. కేంద్రీకృత ప్రజాస్వామ్యం విప్లవ పార్టీ నిర్మాణానికి గుండెకాయలాంటిదని లెనిన్ వాదించగా, అది నిరంకుశత్వమని ప్రత్యర్థులు వాదించారు. కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని వ్యతిరేకించే నేటి విమర్శకులు కూడా ఆనాటి లెనిన్ ప్రత్యర్థుల చద్ది వాదనలనే విన్పించడం చూస్తున్నాం.

పార్టీ కార్యకలాపాలు సరిగా నిర్వహించబడాలంటే, ప్రజా పోరాటాలను క్రమపద్ధతిలో నడపాలంటే పార్టీ కేంద్రీకృత ప్రజాస్వామ్యం అనే సూత్రంపై ఆధారపడి పనిచేయాలి. పార్టీకి నిబంధనావళి ఉండాలి. అందరికీ వర్తించే క్రమశిక్షణ వుండాలి. మెజారిటీకి మైనారిటీ, సంస్థలకు క్రింది సంస్థలూ, కేంద్రానికి అన్ని సంస్థలూ బద్ధులై వుండాలి. ఈ పద్ధతులను తప్పినట్లయితే కార్మికవర్గ పార్టీ నిజమైన విప్లవ పార్టీగా మనజాలదు. లెనిన్ యొక్క ఈ అవగాహనను మార్టోవ్ తదితరులు తిరస్కరించారు.

వారు పార్టీ నిర్మాణం అంటే భయంకరమైన ఫ్యాక్టరీగా భావించారు. మెజారిటీకి మైనారిటీ బద్ధులవడం, మొత్తానికి ఒక భాగం లోబడటం అంటే 'అర్ధబానిసత్వం' అని ఈసడించారు. ఒక కేంద్రం పర్యవేక్షణకింద పనిని విభజించుకోవడం అంటే కూడా చక్రాలూ చీలలుగా మనుష్యుల్ని మార్చి వేయడమేనని విమర్శించారు. పార్టీ నిబంధనల పేరెత్తితే చాలు ఆసహ్యించుకున్నారు. పార్టీ నిర్ణయాలకు తలొగ్గాలనడం 'లాంఛన ప్రాయం-నిరంకుశం' అని వాదించారు. మెజారిటీకి మైనారిటీ లోబడడం అంటే 'అణచివేయడం' అని చెప్పారు. పార్టీ క్రమశిక్షణను పాటించడం అంటే 'దాస్యం' అని అన్నారు. వారి వాదనలనన్నింటినీ లెనిన్ తుత్తునియలుచేశాడు. కార్మికవర్గ పార్టీకి కేంద్రీకృత ప్రజాస్వామ్య పద్ధతి అవసరాన్ని రుజువు చేసాడు. మార్టోవ్ అనుయాయుల వాదనలు పైకి జనబాహుళ్య ప్రయోజనాలను రక్షించుతున్నట్లు కనపడినా, వాస్తవంలో శ్రామికవర్గ క్రమశిక్షణ అన్నా, నిర్మాణం అన్నా సంకోచించే బూర్జువా మేధావుల ప్రయోజనాలనే కాపాడతాయి. నిర్మాణం అంటే భయం ఉండేది కొందరు మేధావులకే గాని కార్మికులకు కాదు.

పార్టీ నిర్మాణంలో క్రమశిక్షణనూ, కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్నీ వ్యతిరేకించిన వారు చరిత్రలో మెన్షివిక్కులుగా పేరుబడి, కార్మికవర్గం లో బూర్జువావర్గ ఏజెంట్లుగా మిగిలిపోయారు. లెనిన్ నాయకత్వాన బోల్షివిక్కులు విప్లవ పార్టీని నిర్మించి విప్లవాన్ని జయప్రదం చేశారు.

కాని 1960వ దశకం నుండి, మారిన పరిస్థితుల పేరుతో సోవియట్ కమ్యూనిస్టుపార్టీలో విప్లవ నిర్మాణ పద్ధతులపై అనేక రూపాలలో దాడి జరిగింది. కార్మికవర్గ పార్టీకి బదులు ప్రజల పార్టీ అని అన్నారు. గోర్బచెవ్ హయాంలో అన్ని మౌలిక సూత్రాలకూ తిలోదకాలిచ్చారు. 1989లో జాతుల ప్రాతిపదికగా కమ్యూనిస్టుపార్టీ విడిపోవడానికి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఆమోదం తెలిపింది. 1990లో జరిగిన కేంద్ర కమిటీ ప్లీనం సమావేశం పార్టీలో వేదికలను ఏర్పాటు చేసుకొని బహిరంగంగా పనిచేయడానికి నిర్ణయించింది. 28వ పార్టీ మహాసభ కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్నే వదులుకున్నది.

పర్యవసానంగా కమ్యూనిస్టులే జాతీయ దురభిమానానికి తలొగ్గారు. కమ్యూనిస్టుపార్టీలోకి సోషలిస్టు వ్యతిరేక శక్తులు ఎగబాకాయి. పార్టీకీ, సోషలిజానికీ వ్యతిరేకంగా మాట్లాడినా, పనిచేస్తున్నా అంగీకరించబడింది. బోరిస్ ఎల్సిన్ పార్టీ కేంద్రకమిటీ సభ్యుడిగా వుండి అమెరికా వెళ్లి సోషలిజాన్ని దుయ్యబట్టి, పెట్టుబడిదారీ విధానాన్ని ప్రసంశించినా ఎటువంటి చర్యా లేదు. పార్టీ పత్రికలే పార్టీకీ, సోషలిజానికీ వ్యతిరేకంగా ప్రచారం చేశాయి.

దీని వల్ల పార్టీ సభ్యులు చీలిపోయారు. గందరగోళంలోనూ, స్తబ్దతలోనూ, అయోమయంలోనూ పడిపోయారు. 1991 ఆగస్టులో ఎల్సిన్ నాయకత్వంలో విప్లవ ప్రతీఘాత దాడి జరిగినప్పుడు పార్టీ నిశ్చేష్టమైపోయింది. పార్టీ నాయకుడు గోర్బచెవ్ ఎల్సిన్ ఒత్తిడికిలొంగి పార్టీని రద్దుచేశాడు.

విప్లవ నిర్మాణ సూత్రాలను వదులుకొన్న పర్యవసానం ఇది. కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని వదులుకున్న ఏ పార్టీ విప్లవ పార్టీగా మనజాలదు. విప్లవాన్ని తేలేదు. విప్లవాన్ని రక్షించుకోలేదు. పార్టీ నిర్మాణం విషయంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రనుండి నేర్చుకోగల ముఖ్య గుణపాఠం ఇది.

కేంద్రీకృత ప్రజాస్వామ్యం, ఉక్కు క్రమశిక్షణతో ఏర్పడే భౌతిక ఐక్యతతో పాటు సైద్ధాంతిక ఐక్యత తోడయితే పార్టీ అజేయమైన శక్తి అవుతుంది. అందుకనే విప్లవ సిద్ధాంతం లేనిదే విప్లవ పార్టీ లేదు అని లెనిన్ అన్నాడు.

లక్షలాది శ్రామికులను శ్రామికవర్గ సైన్యంగా మార్చగల నిర్మాణం యొక్క భౌతిక ఐక్యతను సిద్ధాంత ఐక్యతతోనూ, మార్క్సిస్టు మూల సూత్రాలతోనూ సుస్థిరపరచినప్పుడే, ఇలాంటి శ్రామికవర్గం తప్పనిసరిగా అజేయమైన శక్తి అవుతుంది. రష్యాలో 1898లో కమ్యూనిస్టు పార్టీ ఏర్పడకముందే మార్క్సిస్టు సిద్ధాంతం విస్తృతంగా ప్రచారంలో ఉన్నది. ఈ సిద్ధాంతం పునాదిపై 1903లో లెనిన్ నాయకత్వాన బోల్షివిజం ఆవిర్భవించింది. లెనిన్ అనేక రకాల పెడధోరణులకు వ్యతిరేకంగా బోల్షివిక్ విప్లవ సిద్ధాంతాన్ని సమకూర్చారు. అత్యధిక రష్యన్ కమ్యూనిస్టులను ఆ విప్లవ సిద్ధాంతంలో ఐక్యపరిచారు.

ప్రారంభంలో నరోద్నిక్కులు, సోషలిస్టు రివల్యూషనరీలు, లీగల్ మార్క్సిస్టులు, ఆర్థికవాదులతో లెనిన్ సైద్ధాంతిక పోరాటం నిర్వహించాడు. అనంతరం మెన్షివిక్కులు, బద్జానిస్టులు, లిక్విడేషనిస్టులు, గాడ్‌బిల్డర్స్ వంటి తప్పుడు ధోరణులకు వ్యతిరేకంగా పోరాడాడు. జాతీయ దురహంకారానికి గురైన రెండవ ఇంటర్నేషనల్‌కు వ్యతిరేకంగా యుద్ధ సమయంలో పోరాడాడు. విప్లవం జయప్రదం అయిన తర్వాత కూడా ట్రాట్స్కీ, బుఖారిన్ వంటి నాయకుల పొరపాటు సిద్ధాంతాలను ఓడించి సరైన సిద్ధాంత వైఖరులను రూపొందించాడు. ఈ పోరాటంలోనే "ఏం చేయాలి", "ఒకడుగు ముందుకు రెండడుగులు వెనక్కు", "సోషల్ డెమోక్రసీ యొక్క రెండు ఎత్తుగడలు'', "భౌతికవాదం-అనుభవవాద విమర్శ" "రెండవ ఇంటర్నేషనల్-ద్రోహి కాట్స్కీ", "సామ్రాజ్యవాదం- పెట్టుబడిదారి విధానపు ఉన్నతదశ", "రాజ్యం-విప్లవం" వంటి రచనలు చేశాడు. వీటిని సిద్ధాంద పోరాటంకోసం వినియోగించుకున్నాడు. అక్టోబర్ విప్లవాన్ని సాధించడంలో ఈ సిద్ధాంత పటిమ కమ్యూనిస్టుపార్టీకి మార్గదర్శకమయింది. లెనిన్ అనంతరం స్టాలిన్, సోషలిజం నిర్మాణంలోనే కాకుండా సరైన విప్లవ సిద్ధాంతాన్ని కాపాడటంలోనూ ప్రముఖపాత్ర వహించాడు. కాని కృశ్చేవ్ హయాం వచ్చేసరికి విప్లవ సిద్ధాంతాలకు తిలోదకాలివ్వడం ప్రారంభమయింది.

**1917 బోల్షివిక్ విప్లవం నాటి రష్యన్ కమ్యూనిస్టు పార్టీ పొలిట్ బ్యూరో**

వి. ఐ. లెనిన్ | జోసెఫ్ స్టాలిన్ | జాకబ్ స్వెర్ద్‌లోవ్

ఎ.ఎస్. బుబ్‌నోవ్ | ఎఫ్. ఇ. జెర్జిన్‌స్కీ | స్కామియాన్ | ఎం. ఎస్. ఉరిట్‌స్కీ

ఎం.కె. మురనోవ్ | ఎన్.ఎన్.క్రెస్టిన్‌స్కీ | మిలియుటిన్ | అలెగ్జాండర్ కొల్లంతాయ్

ఎఫ్. ఎ. సెర్గీవ్ | సొకోల్నికోవ్ | నికొలాయ్ బుఖారిన్ | అలెగ్జి రికోవ్ | వి. పి. నోగిన్

బెర్జిన్ | కామెనీవ్ | జినోవీవ్ | లియోన్ ట్రాట్స్కీ | ఐ.టి.స్మిల్గా

1987 నవంబర్‌లో అక్టోబర్ విప్లవ 70 వ వార్షికోత్సవంలో గోర్బచేవ్ 'మానవత్వం-ప్రజాతంత్ర సోషలిజం, పరస్పర ఆధారం' వంటి వర్గేతర సిద్ధాంతాలు ప్రతిపాదించడంతో దిగజారుడు పరాకాష్టకు చేరుకున్నది. షెవర్ద్నాడ్జె, మెద్వెదేవ్ వంటి గోర్బచేవ్ అనుచర నాయకులు పార్టీ సిద్ధాంతాలను భ్రష్టు పట్టించారు. 1990 పోలసీ స్టేట్‌మెంట్ నాటికి 'మార్క్సిజం-లెనినిజం' పదాలను త్రోసివేశారు. సామ్రాజ్యవాదం ప్రస్తావన లేకుండా చేశారు. ఆ రకంగా విప్లవ సిద్ధాంతం నాశనం చేయబడ్డది.

కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని వదులుకోవడం ద్వారా భౌతిక ఐక్యతనూ, మార్క్సిజం-లెనినిజం వదులుకోవడం ద్వారా సిద్ధాంత ఐక్యతనూ నాశనం చేసి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నిర్వీర్యం చేయబడింది. దీనితో దేశంలోనూ, పార్టీలోనూ విప్లవ వ్యతిరేక శక్తుల పెరుగుదలను పార్టీ నిరోధించలేకపోయింది. ఈ పరిస్థితిని ఆసరా తీసుకొని సామ్రాజ్యవాదులు పన్నిన కుట్రను ఎదుర్కొనలేకపోయింది. తాను సాధించిన అక్టోబర్ విప్లవ విజయాలు తన కళ్లెదుటే నాశనం అవుతూ వుంటే, దానితోపాటు తానూ నాశనం అయిపోయింది తప్ప, ఎదిరించి పోరాడలేకపోయింది.

సోవియట్ యూనియన్, సోషలిజం పతనం జరిగి కాలం గడిచేకొద్దీ దాని దుష్ఫలితాలు అంతకంతకూ స్పష్టం అవుతున్నాయి. రష్యాలో కమ్యూనిస్టులు మరలా కూడదీసుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. ఈ ప్రయత్నం వెంటనే జయప్రదం కాకపోవచ్చు. మరలా నిజమైన ఏకీకృత సుసంఘటిత విప్లవ పార్టీ ఆవిర్భావానికి సుదీర్ఘ ప్రయత్నం, పోరాటం అవసరం అవుతుంది. విప్లవ పార్టీలన్నింటికీ ఈ పరిణామాలు చక్కని గుణపాఠాలు కావాలి.

భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భావానికి అక్టోబర్ విప్లవ ఉత్తేజం ఎంతో దోహదపడింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఎంతో సహాయపడింది. భారత కమ్యూనిస్టులు ఈనాటికీ ఆ విప్లవం నుండీ, లెనిన్, స్టాలిన్ వంటి విప్లవకారుల రచనలనుండీ, జీవితాలనుండీ ఉత్తేజం పొందుతూనే వున్నారు.

అక్టోబర్ విప్లవాన్ని సాధించిన బోల్షివిక్ పార్టీ నిర్మాణ సూత్రాలపై పార్టీని నిర్మించేందుకు భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) కృషి చేస్తున్నది. మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతానికి కట్టుబడి విప్లవోద్యమాన్ని నిర్మించేందుకు ప్రయత్నిస్తున్నది. అందుకని అన్ని రకాల ఆటుపోట్లనూ తట్టుకొని నిలువగలుగుతున్నది. అయితే ఆత్మ సంతృప్తి, పాత కీర్తిమీద ఆధారపడి పార్టీ మనజాలదని పార్టీకి తెలుసు.

అందుకే నిర్మాణంలో క్రమశిక్షణా రాహిత్యానికీ, ఫెడరలిజానికీ తావులేకుండా కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని పటిష్టపరుచుకునేందుకు పార్టీ కృషిచేస్తున్నది. అలాగే విధానంలో అతివాదానికీ, మితవాదానికీ ఒంటెత్తువాదానికీ అవకాశం లేకుండా, మార్క్సిజం-లెనినిజాన్ని సరైనపద్ధతిలో అన్వయించుకుని ముందుకు పోయేందుకు కృషిచేస్తున్నది. ఈ కృషే అక్టోబర్ విప్లవానికి మనం ఇవ్వగల నిజమైన నివాళి.

అక్టోబర్ విప్లవ 90వ వార్షికోత్సవ ప్రత్యేకం

# వలస దేశాల విముక్తికి ప్రేరణనిచ్చిన మహావిప్లవం



కీ॥శే॥ ఎల్.బి. గంగాధరరావు

ప్రగతిశీలురూ, ప్రపంచ ప్రజలందరూ కార్మికవర్గ ప్రాపంచిక దృక్పథం అలవరచుకోడానికి అక్టోబర్ విప్లవం తోడ్పడింది. తమ దేశాల భవిష్యత్తును తీర్చిదిద్దుకోవడానికీ, సమస్యలు పరిష్కరించుకోవడానికీ ఆ దృక్పథాన్ని వినియోగించుకోవడమెలాగో ఆ విప్లవం నేర్పింది.

మానవజాతి చరిత్రలోని మహత్తరమైన ఘటనల ప్రభావం తాత్కాలిక పరిణామాలతో మాసిపోదు. ఆధునిక చరిత్రను మలుపుతిప్పిన మహత్తర ఘటనగా అక్టోబర్ విప్లవం చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతుంది. సోవియట్‌లగానీ, తూర్పు యూరప్‌లోగానీ సోషలిజానికి ఎదురు దెబ్బలూ, వెనుకంజలూ సంభవించినా అవేవీ అక్టోబర్ విప్లవం పాత్రనూ, ప్రాధాన్యతనూ తగ్గించజాలవు.

మానవజాతి చరిత్రను స్థూలంగా విభజించాల్సివస్తే అక్టోబర్ విప్లవానికి ముందూ-తర్వాత అని ఒక స్పష్టమైన రేఖ గీయవచ్చు. నిజానికి ఈ ఘటనతో పోల్చదగినదేదీ చరిత్రలో లేదు.

మనిషిని మనిషి దోచుకోవడాన్ని రూపుమాపేందుకై మార్క్స్, ఏంగెల్సులు రూపొందించిన శాస్త్రీయ సామ్యవాద సిద్ధాంతాన్ని తొలిసారి జయప్రదంగా అమలు జరిపిన వ్యక్తి లెనిన్. అంతకుముందు 1848లో ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో కార్మికవర్గం తిరుగుబాటు జరిపి అధికారం కైవసం చేసుకున్నది. దాన్నే పారిస్ కమ్యూన్ అంటున్నారు. మానవ చరిత్రలో అది తొలి కార్మికవర్గ ప్రభుత్వం. కాని దానికి సరైన వ్యూహం, నాయకత్వం, బలం లేవు. ముఖ్యంగా రైతాంగం కార్మికులతో కలిసి పాల్గొనలేదు. అందుకే దోపిడీ వర్గాలు అనేక కుట్రలతో దాన్ని కూల్చివేశాయి. పారిస్ కమ్యూన్ వీరులను ఊచకోత కోశాయి. ఈ వైఫల్యం నుంచి మార్క్స్, ఏంగెల్స్ గొప్ప గుణపాఠాలు తీశారు. విప్లవ విజయానికి కార్మిక-కర్షక ఐక్యత అవసరమని సూత్రీకరించారు. వారి అనంతరం లెనిన్ ఆ సిద్ధాంతాన్ని మరింతగా అభివృద్ధిపరిచాడు. పెట్టుబడిదారీ విధానం బాగా ముందంజవేసిన దేశంలో సోషలిస్టు విప్లవం వస్తుందని మార్క్స్ వూహించాడు. లెనిన్ కాలం నాటికి పెట్టుబడిదారీ విధానం అంతర్జాతీయ రూపం తీసుకుంది. సామ్రాజ్యవాదమనే గొలుసులో బలహీనమైన లింకును బద్దలుగొట్టి సోషలిజానికి సాగిపోవచ్చని లెనిన్ నిర్ధారించారు. అలాంటి స్థితిలో ఉన్న జారిస్టు రష్యాలో విప్లవాన్ని సాధించాడు. జాతుల బందీఖానాగా పేరుమోసిన జారిస్టు రష్యాను జాతుల స్వయం ప్రతిపత్తిగల సోవియట్ సోషలిస్టు సమాఖ్యగా తీర్చిదిద్దాడు. ఈ తరుణ సోషలిస్టు దేశాన్ని మొగ్గలోనే తుంచివేయాలని 14 సామ్రాజ్యవాద దేశాలు దండెత్తితే ప్రజలు తిప్పికొట్టారు. చుట్టూ పెట్టుబడిదారీ ప్రపంచం చక్రబంధంలో, ఆర్థిక, వాణిజ్య, రాజకీయ దిగ్బంధనంలో సోవియట్ యూనియన్ నిలదొక్కుకున్నది. తాను నిలబడటమే గాక ప్రపంచపు రూపురేఖలనే మార్చివేసింది.

లెనిన్ అనంతరం సోవియట్‌కు నాయకత్వం వహించి, దాన్ని ఒక మహాశక్తిగా తీర్చిదిద్దిన స్టాలిన్ అక్టోబర్ విప్లవ ప్రాముఖ్యతను ఇలా

రచయిత భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) రాష్ట్ర కార్యదర్శిగా, పొలిట్ బ్యూరోసభ్యులుగా బాధ్యతలు నిర్వహించారు.



1917 జులై 4న పెట్రోగ్రాడ్‌లో ప్రదర్శన చేస్తున్న నిరసనకారులపై తాత్కాలిక ప్రభుత్వం కాల్పులు జరిపినప్పటి దృశ్యం

వివరించారు:

"అక్టోబర్ విప్లవంతో సామ్రాజ్యవాద వ్యవస్థకు గండిగొట్టడానికి ఒక దేశం నాంది పలికింది. సామ్రాజ్యవాదమనే మహాసముద్రం లో సోషలిజానికి మొదటి కేంద్రంగా వెలిసింది. అయితే దాని ప్రాధాన్యత అంతమాత్రంతో తేలిపోలేదు. అది ప్రపంచ విప్లవంలో మొదటి దిశగా, విప్లవపు భవిష్యత్ విస్తరణకు బలోపేత మైన స్థావరంగా నిలిచివుంటుంది" (1924, డిసెంబర్ 17 "లెనినిజం" సమస్యలు నుండి)

ఒక దేశంలో సోషలిజం సాధ్యం కాదనే, నిలబడజాలదనే భావనను సోవియట్ అనుభవం ఏ విధంగా వమ్ము చేసిందో వివరిం చిన స్టాలిన్ మరో సందర్భంలో దాని ప్రభావాన్ని ఇలా పేర్కొన్నాడు:

"ఒక కొత్త అంశం ఇప్పుడు ఉనికి లోకి వచ్చింది. ప్రపంచాన్ని ఆర్థికంగా దోచు కోజూసే పశ్చిదేశాలకూ, వలస పీడనకు గుర య్యే దేశాలకూ మధ్య ఒక సువిశాలమైన సోవి యట్ దేశం ఆవిర్భవించింది. దాని ఉనికే ప్రపంచాన్ని విప్లవీకరిస్తుంది".

స్టాలిన్ మాటలు ఎంత సత్యమో ప్రపంచ చరిత్ర నిరూపించింది. సోవియట్ యూనియన్ ప్రపంచశాంతికీ, స్వాతంత్ర్యానికీ పట్టుగొమ్మగా నిలిచింది. వలసదేశాల విముక్తి ఉద్యమాలకు మొదటినుంచీ తోడ్పాటునందిం చింది. ఇందుకు సంబంధించి లెనిన్ వివరమైన థీసెస్‌ను రూపొందించారు. ఇండియాతో సహా అనేక ప్రాచ్యదేశాలు సోవియట్ సహాయం, స్నేహం పొందగలిగాయి.

ప్రాచ్యదేశాల విశ్వవిద్యాలయం అనేదాన్ని ప్రత్యేకంగా ఇందుకోసమే నెల కొల్పారు.

"ఈ శతాబ్దంలో భారతదేశ రాజ కీయ నైతిక అభివృద్ధిని ప్రభావితం చేసిన అతి గొప్ప సంఘటన రష్యన్ విప్లవమే. మాస్కో లోనేగాక పామిర్ పీఠభూమి సరిహద్దుల వరకూ కార్మికవర్గం అధికారం హస్తగతం చేసుకోవడం భారతదేశంలో యువతను ఎంతగానో ప్రభావి తం చేసింది" అని ప్రసిద్ధ చరిత్రకారుడు కె.ఎం. ఫణిక్కర్ రాశారు.

భారత స్వాతంత్ర్య పోరాటాన్ని లెనిన్ ఎంతో శ్రద్ధగా గమనించారు. తిలక్ అరెస్టు సందర్భంలో కార్మికవర్గం చేసిన సమ్మెను ఆయన ప్రస్తుతించారు. 1919లో జలియన్ వాలాబాగ్ దురంతాన్ని నిశితంగా ఖండిం చారు.

స్వాతంత్ర్యయోధులూ, వ్యక్తిగత హింసా వాదులూ అనేకమంది అక్టోబర్ విప్లవంతోనూ, లెనిన్ బోధనలతోనూ ఉత్తేజం పొందారు. భగత్‌సింగ్ బృందాన్ని ఉరితీయడానికి ముందు (1930 జనవరి 21) వారు "లెనిన్ డే" కూడా జరిపారు.

భారత యోధులు కొందరు లెనిన్‌ను ప్రత్యక్షంగా కలుసుకున్నారు. ప్రొఫెసర్ అబ్దుల్ జబ్బార్ ఖైరీ, అబ్దుల్ సత్తార్ ఖైరీ వారిలో ప్రథములు. 1918 నవంబర్ 23న వారు లెనిన్‌ను కలిశారు. 1918లో కాబూల్‌లో ప్రవాస భారత ప్రభుత్వం ఏర్పరచిన రాజా మహేంద్ర ప్రతాప్ 1919లో లెనిన్‌ను కలుసుకున్నారు. ఇలాగే మరికొందరి పేర్లు చెప్పవచ్చు. ఎం.ఎన్.రాయ్. భూపేంద్రనాథ్ దత్తా, వీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ వంటి వారు వారిలో ఉన్నారు. 1921-22లో షౌకత్


చైనా విప్లవం: లాంగ్ మార్చ్

ఉస్మానీ, రఫీక్ అహ్మద్, అబ్దుల్ మజీద్ వంటి వారు రష్యా వెళ్లి కమ్యూనిస్టు భావాలతో ప్రేరణ పొందారు. అయితే వీరిలో కొందరు చివరి వరకు సరైన బాటలో నిలవలేదనేది వేరే విషయం.

### నెహ్రూ ప్రశంస

భారత జాతీయ నాయకులలో జవహర్‌లాల్ నెహ్రూ అక్టోబర్ విప్లవాన్ని గురించి బాగా తెలియజెప్పారు. 1924లో మోతీలాల్, జవహర్‌లాల్ మాస్కోలో అక్టోబర్ విప్లవ వార్షికోత్సవాల్లో పాల్గొన్నారు. తిరిగి వచ్చిన తర్వాత 1924 డిసెంబర్ 17న 'హిందూ' పత్రికలో నెహ్రూ ఇలా రాశారు:

"సుత్తీకొడవలి ఎత్తిన ఈ చిత్రమైన యూరోపియన్ దేశంలో కార్మికులు, కర్షకులు అధికారం పీఠం అధిష్టించారు. ధన బలం గల శక్తుల దుష్ట పథకాలను వమ్ము చేస్తున్నారు"

తర్వాతికాలంలో నెహ్రూపాత్ర ఏమైనప్పటికీ 30, 40 దశకాలలో సోవియట్ గురించీ, సోషలిజం గురించీ, సానుకూలమైన భావన కలిగించడానికి ఆయన ఎంతగానో దోహద పడ్డారు. రవీంద్రనాధ్ రాగూర్ కూడా సోవియట్‌ను సందర్శించి ఎంతో ఉత్తేజపడ్డారు. ఎందరో రచయితలు దాన్ని గురించి రాశారు. ఇలాంటి ఉదాహరణలు అనేకం వున్నాయి. స్వాతంత్ర్యానంతర కాలంలో భారత్-సోవియట్ మైత్రితో అంతకుముందున్న సద్భావన కొనసాగడానికి వీలేర్పడింది.

భారత కమ్యూనిస్టుపార్టీని మొదటిగా తాష్కెంట్‌లోనే ఏర్పాటుచేసిన సంగతి గుర్తుంచు కోవాలి. ప్రాచ్యదేశాల విశ్వవిద్యాలయంలో భారత కమ్యూనిస్టులకు ప్రత్యేకంగా శిక్షణ నిచ్చి పంపించారు. ఆ విధంగా దాదాపు 85 ఏళ్ల నాడే భారత కమ్యూనిస్టు ఉద్యమానికి అంకురార్పణ జరిగింది. తర్వాతికాలంలో అనేక విధాలుగా సోవియట్ నాయకత్వం భారత విప్లవోద్యమానికి ఇంటర్నేషనల్స్ ద్వారానూ, ద్వైపాక్షికంగానూ కూడా సహాయం చేసింది.

అయితే 60వ దశకం వరకూ భారత కమ్యూనిస్టు ఉద్యమం దేశ పరిస్థితులకు తగిన కార్యక్రమాన్ని రూపొందించుకోలేకపోయింది. కొన్ని వీరోచిత పోరాటాలు జరిపినా, త్యాగాలు చేసినా దాని పురోగమనం పరిమితంగానే వుండిపోయింది. అంతేగాక ఈ దేశంలో పరిపక్వమయిన, పట్టుకలిగిన బూర్జువా వర్గం ఏర్పడి వుండటం, వారి ప్రతినిధి కాంగ్రెస్ జాతీయోద్యమ నాయకత్వంలో వుండటం కూడా కమ్యూనిస్టులకు ప్రతికూల అంశమైంది. అందుకే జాతీయ విముక్తి విప్లవాన్ని పూర్తిచేసే కర్తవ్యం ఈ దేశంలో సాధ్యంకాలేదు.

### వియత్నాం అనుభవం

ఆగ్నేయాసియాలోని చిన్న దేశమైన వియత్నాం ఆ పనిని జయప్రదంగా చేయగలిగింది. హోచిమిన్ నాయకత్వాన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంతో పాటే సోషలిస్టు సమాజం కోసం జరిగిన పోరాటాన్ని కూడా ఆయన సమన్వయ పరచగలిగాడు. ఇందుకుగాను లెనిన్ నిర్వహించిన పాత్రను ఆయన ఈ విధంగా కొనియాడాడు:

"వలస దేశాలలో నిజమైన విప్లవాత్మక నవయుగానికి బాటవేసిన వ్యక్తి లెనిన్.

వలస దేశాల ప్రజలను విప్లవోద్యమంలోకి తీసుకురావలసిన ఆవశ్యకతను పూర్తిగా గుర్తించిన, అంచనా కట్టిన మొదటి వ్యక్తి లెనిన్. వారి భాగస్వామ్యం లేకుండా సోషలిస్టు విప్లవం రాదని ఆయన మొదటగా చెప్పారు.

సోవియట్ రష్యాలోని సంక్లిష్టమైన జాతుల సమస్యను లెనిన్ పరిష్కరించిన తీరు వలస దేశాలకు అద్భుతమైన ప్రచారాయుధమైంది.

కడగండ్లతో, ఏ హక్కులు లేకుండా అణగారిన వలస దేశాల ప్రజల చరిత్రలో నూతన జీవితాన్ని సృష్టించిన వ్యక్తి లెనిన్. అదే పీడిత మానవజాతి విముక్తికి ఆశాజ్యోతిగా వెలిగింది" (1924)

ఉత్తర వియత్నాం విముక్తి తర్వాత 1967లో అక్టోబర్ విప్లవ వార్షికోత్సవ సభలో హోచిమిన్ మరింత స్పష్టంగా ఇలా చెప్పారు:

"జాతీయ విముక్తికై వియత్నాం ప్రజలు సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రతిఘటనోద్యమం సాగించారు. అమెరికా దురాక్రమణ దారులను ఓడించాలనే కృతనిశ్చయంతో, సోషలిజం నిర్మించుకోవాలనే దీక్షతో వారు పోరాడారు. ఆ పోరాటం తారాస్థాయిలో ఉండగా వారి

ఆలోచనలన్నీ అక్టోబర్ విప్లవానికీ, లెనిన్‌కూ మాతృభూమి అయిన సోవియట్ వైపు మళ్లాయి.

ప్రజ్వలించే సూర్యుడిలా అక్టోబర్ విప్లవం అయిదు ఖండాలను ప్రకాశవంతం చేసింది. కోటానుకోట్ల మంది పీడిత ప్రజలను జాగృతం చేసింది. మానవ చరిత్రలో అంతటి మహత్తర ప్రాధాన్యత గల విప్లవం ఏదీ లేదు".

### చైనా విప్లవం

మరో గొప్ప ఆసియా దేశమైన చైనా విప్లవం కూడా అక్టోబర్ విప్లవం నుంచి ప్రేరణ పొందింది. చైనా మహానాయకులలో ఒకరైన మావో జెడాంగ్ దీన్నిగురించి చాలా అద్భుత మైన రీతిలో ఇలా వర్ణించారు:

"రష్యన్లు అక్టోబర్ విప్లవాన్ని సాధించి, ప్రపంచంలో తొలి సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించారు. లెనిన్, స్టాలిన్ నాయకత్వంలో రష్యన్ మహా శ్రామికుల, కార్మికుల విప్లవ శక్తి ప్రజ్వరిల్లింది. అప్పటివరకు విదేశీయులు గుర్తించని ఆ శక్తి ఒక్కసారి అగ్నిపర్వతంలా బద్దలైంది. ఆ తర్వాతనే చైనా ప్రజల ఆలోచనలూ, జీవితాలూ కొత్త శకంలోకి అడుగు పెట్టాయి. విశ్వజనీనమైన మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాన్ని వారు కనుగొన్నారు. అప్పటినుండి చైనా కొత్తరూపం సంతరించుకోసాగింది.

రష్యన్ల ద్వారానే చైనీయులు మార్క్సిజాన్ని కనుగొన్నారు. అక్టోబర్ విప్లవానికి ముందు చైనీయులకు లెనిన్, స్టాలిన్‌ల గురించి తెలియదు. కనీసం మార్క్స్, ఏంగెల్స్ గురించి కూడా తెలియదు. అక్టోబర్ విప్లవ రణ నినాదాలే మాకు మార్క్సిజం-లెనినిజం బోధించాయి.

ప్రగతిశీలులకు, అలాగే ప్రపంచ మంతటా గల వారికి కూడా అక్టోబర్ విప్లవం కార్మికవర్గ ప్రాపంచిక దృక్పథం అలవరచుకోడానికి తోడ్పడింది. తమ దేశాల భవిష్యత్తును తీర్చిదిద్దుకోవడానికీ, సమస్యలు పరిష్కరించుకోవడానికీ ఆ దృక్పథాన్ని వినియోగించుకోవడమెలాగో నేర్పింది. రష్యన్ మార్గాన్ని అనుసరించాలని వారు నిర్ణయించు కున్నారు. 1919 మే 4న చైనాలో ఉద్యమం ప్రారంభమైంది. 1921లో చైనా కమ్యూనిస్టు పార్టీ స్థాపించబడింది. సన్‌యేట్‌సేన్ నిరాశలో మునిగినప్పుడు అక్టోబర్ విప్లవం గురించీ, చైనా కమ్యూనిస్టుపార్టీ గురించి తెలుసుకున్నాడు. ఆయన అక్టోబర్ విప్లవానికి స్వాగతం పలికాడు. చైనా కమ్యూనిస్టు పార్టీతో సహకారాన్ని




వియత్నాం విప్లవ కాలంలో వెలిసిన ఒక పోస్టర్

ఆహ్వానించాడు".

ఆ విధంగా 1949లో చైనా విప్లవం విజయం సాధించడంతో ప్రపంచంలో అత్యధిక జనాభా గల దేశం సోషలిస్టు పంథాలోకి ప్రవేశించింది. అంతకుముందే రెండవ ప్రపంచయుద్ధంలో స్టాలిన్ నాయకత్వాన నాజీలకు గోరీకట్టిన సోవియట్ ఎర్రసేన తూర్పు యూరప్‌లో పలు దేశాలను విముక్తి చేయడానికి తోడ్పడింది. ఆ విధంగా ప్రపంచంలో మూడవంతు సోషలిస్టు పంథాను ఎంచుకోవడానికి అక్టోబర్ విప్లవం మార్గదర్శి మాత్రమేకాక, సహాయకారి కూడా అయింది.

రెండో ప్రపంచ యుద్ధంలో సోవియట్ విజయం, ఒక సోషలిస్టు శిబిరం ఏర్పడ్డం, చైనా విప్లవం జయప్రదం కావడం ఇవన్నీ వలస దేశాల్లో విముక్తి పోరాటాలకు బలం చేకూర్చాయి. భారత్‌తో సహా ఆసియా, ఆఫ్రికా, ఖండాలకు చెందిన అనేక వలస దేశాలు తరతరాల విదేశీ దోపిడీనుండి విముక్తి చెందాయి. తరుణ స్వతంత్ర దేశాలు ఆర్థికంగానూ, సాంకేతికంగానూ నిలదొక్కుకునేందుకు సోవియట్, సోషలిస్టు శిబిరం ఇచ్చిన సహకారం ఎనలేనిది.

1960 దశకంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో విభేదాలు పొడచూపి తీవ్రమైనాయి. అయినా 80వ దశకం వరకు అంతర్జాతీయంగా అమెరికా సామ్రాజ్యవాదానికి దీటైన ప్రత్యర్థిగా, వర్ధమాన దేశాల, శాంతికాముకుల ఆప్త మిత్రంగా సోవియట్ నిలబడి, అండదండలిచ్చింది. ప్రపంచశాంతిని కాపాడింది. ఈ వ్యాసం మొదట్లోనే స్టాలిన్ పేర్కొన్నట్లు వరాయి దేశాలను దోచే సామ్రాజ్యవాదానికి ప్రతిగా ఒక సోషలిస్టు మహాశక్తి అవతరించిన ఫలితమే ఇదంతా. ఆశక్తి కాస్తా విచ్ఛిన్నమైన తర్వాత మనం చూస్తున్న పరిణామాలను గమనించినా అది నిర్వహించిన పాత్ర ఎంత మహత్తరమైనదో అర్థం చేసుకోవచ్చు. అక్టోబర్ విప్లవ పురిటిగడ్డలోనే దానికి తూట్లు పొడిచే విద్రోహ నాయకత్వం పైకి రావడం, దాన్ని విచ్ఛిన్నం చేయడం చాలా బాధాకరమే. ఇందుకు కారణాలు ఏమిటనే దానిపై సిపిఐ (ఎం) 14వ మహాసభ సైద్ధాంతిక తీర్మానం వివరంగా విశ్లేషించింది. ఏమైనా ఈ ప్రపంచాన్నే ఉత్తేజపరిచిన ఆ మహావిప్లవం ప్రభావం అంత తేలిగ్గా అదృశ్యమైపోతుందనుకోవడం సామ్రాజ్యవాదుల భ్రమ మాత్రమే. ప్రపంచం మళ్లీ ప్రతిఘటనా మార్గంలోకి నడుస్తుందన్న విశ్వాసం ఇటీవలి పరిణామాలతో మరింత బలపడుతోంది.



# ఆ అక్టోబర్ విప్లవ వార్షికోత్సవం నాడు...

ఎస్.వి.ఆర్



**అది నవంబర్ 7, 1936....**

ప్రపంచ కార్మిక వర్గం అక్టోబర్ విప్లవ 19వ వార్షికోత్సవం జరుపుకుంటోంది. ఈ ప్రపంచం నుండి దోపిడీ, పీడన పారద్రోలి జగత్తునంతటినీ మానవత్వంతో నింపాలని సకల దేశాల కార్మికవర్గం ప్రతిజ్ఞ పూనుతోంది. అక్టోబర్ సోవియట్ సోషలిస్టు విప్లవం ఇచ్చిన స్ఫూర్తిని గుండెలనిండా నింపుకుని కర్తవ్యోన్ము ఖమవుతోంది.

అదే సమయంలో...

ప్రపంచంలో మానవత్వాన్ని కబళించి దానవరాజ్యాన్ని స్థాపించడానికి బయలుదేరిన ఫాసిస్టు పెనుభూతం స్పెయిన్‌లో విజయగర్వంతో పైశాచిక నృత్యం చేస్తోంది. స్పెయిన్‌లో చాలా ప్రాంతాన్ని తన పాదాక్రాంతం చేసుకొని రాజధాని మాడ్రిడ్‌ను కూడా మింగేయడానికి పొంచి కూర్చుంది. అక్టోబర్ విప్లవ దినోత్సవం రోజున, మాడ్రిడ్‌ను రక్షిస్తున్న ప్రజా ప్రతిఘటనా సైన్యంపై చావుదెబ్బకొట్టి, ప్రజల మనోఫలకం మీద నుండి ఆ చిరస్మరణీయమైన తేదీని చెరిపివేయడానికి సిద్ధమయ్యింది.

× × ×

నిజానికి అంతకుముందే, 1936 ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికలలో ఎలాగైనా అధికారం చేజిక్కించుకోవాలని ఫాసిస్టులు పన్నిన పన్నాగాన్ని స్పెయిన్ ప్రజలు వమ్ముచేశారు. స్పెయిన్ కమ్యూనిస్టు పార్టీ, పెటీ బూర్జువా రిపబ్లికన్ పార్టీలు, సోషలిస్టుపార్టీలు కలిసి ఏర్పడిన ఫాసిస్టు వ్యతిరేక "ప్రజా సంఘటన" ఫిబ్రవరి ఎన్నికలలో ఘనవిజయం సాధించి, ప్రభుత్వం ఏర్పరచింది. దాంతో గంగవెర్రులెత్తిన ఫాసిస్టులు ప్రజా ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి తిరుగుబాటు లేపారు. మొరాకోలో ఉన్న స్పెయిన్ సైనిక దళాల కమాండర్ జనరల్ ఫ్రాంకో పైశాచికత్వానికి మారుపేరు. అతని నాయకత్వంలో ఫాసిస్టు సైన్యం స్పెయిన్ రిపబ్లిక్‌పై తిరుగుబాటు ప్రకటించింది. ఇటలీ, జర్మన్ ఫాసిస్టులు ఫ్రాంకోకు విమానాలూ, ట్యాంకులూ, ఆధునిక ఆయుధాలూ సమకూర్చారు. ఇంగ్లండ్, ఫ్రాన్స్, అమెరికా ప్రభుత్వాలు తెరచాటు నుండి అన్నివిధాలా సహాయం అందించి స్పెయిన్ రిపబ్లిక్ మీద దండయాత్రకు పంపాయి.

జులై 18 ఉదయాన్నే ఫ్రాంకో సైనిక మూకలు స్పెయిన్‌పై తొలిదాడి చేశాయి. కాల్పుల శబ్దానికి స్పెయిన్ ప్రజలు మేలుకొన్నారు. దేశమంతటా ప్రజా ప్రతిఘటన దళాలుగా ఏర్పడి ఆయుధాలు తీసుకొని ఫాసిస్టుల నుండి స్పెయిన్ రక్షణకు పూనుకున్నారు. ప్రజలు వీరోచితంగా పోరాడారు. వేలాదిమంది ప్రాణాలర్పించారు. కాని తెగ బలిసిన శత్రువును సరైన ఆయుధాలుగానీ, శిక్షణగానీ లేని ప్రజాసైన్యం నిలువరించలేక పోయింది. మూడు మాసాలలో ఫాసిస్టులు మాడ్రిడ్ నగరం వరకు పురోగమించారు. రాజ ధానీ నగరాన్ని కూడా ఫ్రాంకో సైన్యం చుట్టుముట్టింది.

× × ×

ఆ ఏడాది (1936) అక్టోబర్ విప్లవ దినోత్సవంనాడు మాడ్రిడ్ ప్రజలు జీవన్మరణ సమస్యనెదుర్కొంటున్నారు. నగరాన్ని స్వాధీనం చేసుకోవడానికి తిరుగుబాటుదారులు చేసిన తొలి ప్రయత్నాన్ని ప్రజా సైన్యం తిప్పికొట్టింది. అయినప్పటికీ వారు మాడ్రిడ్ శివార్లలో తమ స్థావరాలు పటిష్టపరుచుకున్నారు. నగరంలోకి ఏ క్షణాన్నైనా ప్రవేశించడానికి వేలాది ఫాసిస్టు సైన్యం సిద్ధంగా వుంది. నగర శివార్ల నుండి వచ్చిపడుతున్న ఫిరంగిగుళ్లూ, శత్రు విమానాలు వేస్తున్న బాంబులూ నగరంలోని పెద్ద పెద్ద భవనాలను నేటమట్టం చేశాయి. శతాబ్దాల నాటి పురాతన కట్టడాలను ధ్వంసంచేశాయి. అమూల్యమైన కళాఖండాలు మట్టిపాలయ్యాయి. వేలాది నిండు ప్రాణాలు గాలిలో కలిశాయి. శత్రుట్యాంకులు నగరంలోకి ప్రవేశించకుండా ప్రజలు నగరం చుట్టూ కందకాలు త్రవ్వారు. నగరంలోని వృద్ధులనూ, పిల్లలనూ, రోగులనూ ఉన్నంతలో సురక్షిత ప్రాంతాలకు తరలించారు. అక్టోబర్ విప్లవ దినోత్సవాన కార్మికవర్గ అంతర్జాతీయతా గీతాలు వినిపించాల్సిన లౌడ్ స్పీకర్లలో ప్రజలకు హెచ్చరికలు వినిపించాయి. మాడ్రిడ్ నగరంపై శత్రువు మరోసారి విరుచుకు పడవచ్చునని ప్రజా సైనికులు నగరమంతటా హెచ్చరికలు చేశారు. స్త్రీ, పురుషులంతా మాడ్రిడ్ నగర చరిత్రలో సువర్ణాధ్యాయం లిఖించడానికి కృతనిశ్చయులైనారు. తమ ప్రియతమ నగరంలో ప్రతి వీధినీ, ప్రతి ఇంటినీ, ప్రతి రాతినీ రక్షించుకోడానికి నడుంకట్టారు.

రానున్న శత్రుదాడిని ఎదుర్కొనేదుకు ప్రజలు నరాలు బిగబట్టి ఎదురుచూస్తున్నారు. శత్రుమూకలు ఎప్పుడే మార్గంగుండా నగరం లోకి ప్రవేశిస్తాయి అన్న ప్రశ్నకు ఎవరికి తోచినట్లు వారు సమాధానం చెప్పుకుంటు న్నారు. గంటలు గడుస్తున్నాయి. ఉద్వేగం భరించలేని స్థాయికి పెరుగుతోంది. బిగించిన పిడికిళ్లతో, వాళ్లంతా కళ్లు చేసుకొని ప్రజలు నగరం నలుదిశలా పరీక్షించి చూస్తున్నారు....

"ఏయ్... ఏమిటది? అటు విను..." ఎవరిదో గుస గుస.

దూరంగా వందలాది బూట్లు లయబద్ధం గాపడుతున్న చప్పుడు. క్రమంగా శబ్దం దగ్గరవుతోంది. అందరిలోనూ ఆందోళనా, అనిశ్చితత్వం. ఎవరా వస్తోంది? ఎవరది? 1936 నవంబర్ 7వ తేదీన.. ప్రపంచానికి పురోగమన మార్గం చూపిన అక్టోబర్ విప్లవ



స్పెయిన్ అంతర్యుద్ధంలో ప్రజా సైన్యం తరఫున ప్రాణాలొడ్డి పోరాడడానికి వచ్చిన అంతర్జాతీయ బ్రిగేడ్ దళం

దినోత్సవాన... మాడ్రిడ్ నగర వీధుల్లో మౌనం గా శరీరాలు బిగించి, స్థిరంగా అడుగులేస్తూ, బాయినెట్లు బిగించిన బారీ రైఫిళ్లను భుజాలపై ధరించి వస్తున్న వాళ్లు... ఎవరు?

వీధి వీధినా ఇళ్ల కిటికీల గుండా, తలుపు సందులగుండా అనేక జతల కళ్లు కవాతు చేసుకుంటూ నడుస్తున్న ఆ సైనిక దళాలను అనుసరిస్తున్నాయి.

"వచ్చేశారు. వాళ్లు వచ్చేశారు. ఏం చేద్దాం. ఇప్పుడేం చేద్దాం?" ప్రతి వీధిలోనూ, ప్రతివారినోటా ఇదే మాట.

ఇంతలోనే కొరడా ఝుళిపించినట్లు సైనిక పద్ధతిలో ఒక ఆదేశం. వెంటనే కదం తొక్కు తున్న వందలాది కాళ్ల కదలికలకు అణుగుణం గా ఓ పాట మందంగా గాలిలోకి లేచి, వేగం అందుకొని, నలుదిశలా వ్యాపించి, మాడ్రిడ్ ప్రజల చెవులను అమృతవాహినిలా తాకింది.

"దేవుడా! మేం కలగనటం లేదు కదా?" ఒక మహిళ ఆనందం పట్టలేక అరిచింది. ఆమె కళ్లవెంట ఆనందభాష్పాలు జలజలా రాలుతున్నాయి. శత్రుమూకల దిగ్బంధనంలో చిక్కుక్కున్న మాడ్రిక్ నగర వీధుల్లో కవాతు చేస్తున్న ఆ సాయుధులు, శ్రామికవర్గ అంతర్జాతీయతా గీతాన్ని ఫ్రెంచ్, ఇటాలియన్, జర్మన్, పోలిష్, హంగేరియన్, రుమేనియన్ భాషల్లో పాడుతు న్నారు. కష్టకాలంలో ఉన్న స్పెయిన్ సోదరుల సహాయార్థం వచ్చిన "అంతర్జాతీయత బ్రిగేడ్" వలంటీర్లు వారు. కొమింటర్న్ పిలుపు మేరకు స్పెయిన్ ప్రజలతో కలిసి పోరాడడానికి, కలిసి చావడానికి సిద్ధపడి వచ్చిన దేశ దేశాల శ్రామికవర్గ యువకిశోరాలు.

మాడ్రిడ్ ప్రజల ఆనందానికి అవధుల్లేవు. అంతా ఇళ్లలోనుండి వీధుల్లోకి వచ్చి హర్షాతి రేకంతో గంతులు వేశారు. అంతర్జాతీయ యోధులను కౌగిలించుకున్నారు. తమ ఇంటికి రమ్మని ప్రతి వ్యక్తీ అంతర్జాతీయ బ్రిగేడ్‌లోని ప్రతి యోధుణ్ణీ ఆహ్వానించారు. ఆ క్షణాన శత్రువు గురించిగానీ, నగరం దిగ్బంధనంలో వుందనిగానీ, ప్రమాదం పొంచివుందనిగానీ మరచిపోయారు. ఇంతలోనే కేరింతలు, హర్షాతి రేకాల మధ్య దూరంగా ఆకాశంలో మోటారు శబ్దాలు వినిపించాయి.

కొద్దిక్షణాలు భయోత్పాతం.

"విమానాలు! విమానాలు!"

అందరూ అరుస్తున్నారు. ఆకాశంలో నల్లని చుక్కలు క్రమంగా పెద్దవయ్యాయి. ఎవరివో తెలియని విమానాలు నగరానికి చేరువగా వచ్చాయి. కాని విచిత్రం! అవి ప్రజలమీద కాల్పులు జరపడం లేదు. బాంబులు వేయడం లేదు. ఎవరివవి?

ఐ-15, ఐ-16 విమానాల స్క్వాడ్రన్లు. మాడ్రిడ్ గగనతలంమీద చక్కర్లు కొడుతున్నాయి. ఫాసిస్టు మూకలనుండి మాడ్రిడ్‌ను వీరోచితంగా రక్షిస్తున్న ప్రజానీకానికి 'రెడ్ సెల్యూట్' చేస్తు న్నాయి. విమానాలు మరింత క్రిందకి దిగి అంతర్జాతీయ బ్రిగేడ్ దళాలకు అభివందనాలు తెలిపాయి. అప్పుడు చూశారు మాడ్రిడ్ ప్రజలు, ఆ విమానాలపై స్పెయిన్ రిపబ్లిక్ పతకాలు


స్పెయిన్ విప్లవ వీరనారి లా పాషనారా (డోలోరిస్ ఇబరురి), పక్కన, స్పెయిన్ రాజధాని మాడ్రిడ్‌లో ఫాశిస్టు సైన్యాన్ని అడ్డుకోడానికి రోడ్లపై బారికేడ్లు నిర్మించిన ప్రజాసైన్యం

ఎగురుతుండడం.

"అవి సోవియట్ విమానాలు! మన విమానాలు... మనవి... మనవి..!"

వేలాది గొంతులు ఆనందంతో, ఉద్వేగంతో-ఆనందమైన నినాదాలలో ఏకమయ్యాయి.

"వర్ధిల్లాలి కార్మికవర్గ అంతర్జాతీయత!"

"వర్ధిల్లాలి సోవియట్ సోషలిస్టు విప్లవం!"

"వర్ధిల్లాలి స్పెయిన్ ప్రజల ఐక్యత!"

స్పెయిన్ కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షురాలు, వీరనారి లా పాషనారా (డోలోరిస్ ఇబరురి) తన ఆత్మకథలో చెప్పిన ఈ ఘటన నాడు స్పెయిన్ పోరాటానికి అభించిన అంతర్జాతీయ సంఘీభావానికి నిదర్శనం. అభివృద్ధికర శక్తులకు సోవియట్ అందించిన సహకారానికి మచ్చుతునక. ఆ విధంగా కొద్దిరోజుల్లోనే జర్మనీ, బల్గేరియా, ఇటలీ, ఫ్రాన్స్, పోలెండ్, హంగరీ, రుమేనియా, జకోస్లోవేకియా, అమెరికా, బ్రిటన్, బెల్జియం, నార్వే, ఫిన్లాండ్, డెన్మార్క్, స్వీడన్, ఆస్ట్రియా, స్విట్జర్లాండ్, అల్బేనియా, యుగోస్లావియా మొదలైన 54 దేశాల నుండి వలంటీర్లు వచ్చి స్పెయిన్‌లో ఫాసిస్ట్ వ్యతిరేక పోరాటంలో పాల్గొన్నారు. సోవియట్ యూనియన్ నుండి వచ్చిన విమాన దళాలు ఫాసిస్ట్ మూకలను బేజారెత్తించాయి. సోవియట్ అనేక నౌకలలో ఆయుధాలనూ, ఇతర సరుకులను సహాయంగా స్పెయిన్‌కు పంపింది. వీటన్నింటి మూలంగా, స్పెయిన్ ప్రజల, ముఖ్యంగా కమ్యూనిస్టుల సాహసోపేతమైన పోరాట ఫలితంగా 1939 వరకు అంటే సుమారు రెండున్నరేళ్లు ఫాసిస్టులు మాడ్రిడ్ సరిహద్దులు దాటి నగరంలోకి ప్రవేశించలేకపోయారు.

కాని అంతర్జాతీయంగానే ఫాసిస్టు శక్తులు బలం పుంజుకోవడంతో స్పెయిన్ ప్రజాపోరాటాన్ని అవి అణచివేయగలిగాయి. 1939లో ఫాసిస్టులు స్పెయిన్‌లో రాజ్యాధికారం చేపట్టారు. హిట్లరు పోలండ్‌పై దాడిచేసి రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభించకముందే స్పెయిన్‌పై ఫాసిస్టుల దాడి జరిగింది. కమ్యూనిస్టులు, అభివృద్ధి కాముక శక్తుల నాయకత్వంలో స్పెయిన్‌లో ఏర్పడిన ఐక్య సంఘటన ప్రభుత్వం రానున్న యూరప్ ఎలా ఉండబోతోందో పెట్టుబడిదారీ వర్గాలకు చూపించింది. అందుకే యూరప్, అమెరికాలోని పెట్టుబడిదారీ పాలక వర్గాలన్నీ కలిసి స్పెయిన్‌లో ప్రజా ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేశాయి. ఫ్రాంకో సైన్యానికి అన్ని విధాలా మద్దతిచ్చి ప్రజాస్పెయిన్ మీదకు పంపాయి. ఒకరకంగా ఫాసిస్టులు స్పెయిన్‌లో రెండో ప్రపంచ యుద్ధానికి రిహార్సల్స్ వేశారు. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ తదితర పెట్టుబడిదారీ దేశాల మద్దతుతో వారు అక్కడ జయప్రదం కావడంతో తరువాత ప్రపంచమీద పడి రెండో ప్రపంచ యుద్ధాన్ని తెచ్చారు.

అటువంటి చారిత్రక ప్రాధాన్యత కలిగింది కనుకనే స్పెయిన్ అంతర్యుద్ధం ప్రపంచం దృష్టిని ఆకర్షించింది. స్పెయిన్ ప్రజలకు సంఘీభావంగా జరిగిన పోరాటంలో కమ్యూనిస్టులతో బాటు దేశదేశాల నుండి అభివృద్ధి కాముక శక్తులు వచ్చి పాల్గొన్నాయి. అనేక మంది మేధావులు పోరాటానికి సంఘీభావం తెలిపారు. ప్రముఖ మార్క్సిస్టు మేధావి క్రిష్టోఫర్ కాడ్వెల్ వంటి వారు తుపాకి పట్టుకుని స్పెయిన్ అంతర్యుద్ధంలో ఫాసిస్టులతో పోరాడుతూ ప్రాణాలొదిలారు. స్పెయిన్‌కు వచ్చిన అంతర్జాతీయ బ్రిగేడ్‌లో కాడ్వెల్ ఉన్నట్లు తెలుసు. ఆయన ఫాసిస్టులతో పోరాడిన విషయం తెలుసు. కాని ఆయన ఎక్కడ చనిపోయిందీ, ఎప్పుడు చనిపోయిందీ ఇప్పటికీ ఎవరికీ తెలియదు. ఆయన భౌతిక కాయం కూడా ఎవరికీ లభించలేదు. మహా మేధావి అయిన కాడ్వెల్ ఈ అంతర్యుద్ధంలో చనిపోయే నాటికి ఆయన వయసు 29 సంవత్సరాలు మాత్రమే. అప్పటికే ఆయన మార్క్సిజం మీద అనేక గొప్ప గ్రంధాలు రాశాడు. భారత దేశంలో కూడా నాడు అభివృద్ధి కాముకులకు స్పెయిన్ అంతర్యుద్ధంలో ప్రజల పాత్ర స్ఫూర్తినిచ్చింది. కాంగ్రెస్ నేతగా స్వాతంత్ర సమరంలో తలమునకలై ఉన్న జవహర్‌లాల్ నెహ్రూ స్వయంగా స్పెయిన్ వెళ్లి ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలకు మద్దతు ప్రకటించారు.

**(విప్లవ నాయకురాలు, స్పెయిన్ కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షురాలు లా పాషనారా (డోలోరిస్ ఇబరురి) జీవిత కథ 'దె షల్‌నాట్ పాస్' లోని ఒక పుట ఆధారంగా)**



# సోవియట్ అనంతర ప్రపంచం

**ఇజాలు వద్దన్నవారూ, స్వేచ్ఛామార్కెట్‌ను పూజించినవారే ఇప్పుడు సామాజిక న్యాయం గురించీ, సంపద పంపిణీ గురించి మాట్లాడాల్సి వస్తోంది. చరిత్ర అంతమైందని రాసిన ఫ్రాన్సిస్ ఫకుయామా, "9/11 తరువాత చరిత్ర తిరిగి ప్రారంభమైందా?" అని 2002లో వ్యాసం రాశాడు. ప్రపంచ బ్యాంకు అధ్యక్షునిగా పని చేసిన జోసెఫ్ స్టిగ్లిట్జ్ బ్యాంకు విధానాల వల్ల నష్టాలగురించి వెల్లడించాల్సి వచ్చింది.**

ఎస్. వెంకట్రావు

మహత్తర అక్టోబర్ విప్లవ ఫలితంగా ఏర్పడిన సోషలిస్టు సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమై ఒకటిన్న దశాబ్దం దాటింది. ఈ కాలంలో ప్రపంచ వ్యాపితంగా అనేక పరిణామాలు జరిగాయి. 1991లో ఉన్నట్లు ప్రపంచం ఈనాడు లేదు. ఈ కాలంలో సోషలిజానికీ, సామ్రాజ్యవాదానికీ మధ్య వైరుధ్యం ఏ రూపం తీసుకుందో తెలుసుకోవా లంటే పదిహేనేళ్ల ఘటనలను ఒక సారి అవలోకనం చేసుకోవాలి.

సోవియట్ అనంతర ప్రపంచాన్ని మనం స్థూలంగా రెండు దశలుగా చెప్పుకోవచ్చు. మొదటిది, 1990వ దశకంలో అమెరికాకు ఎదురులేని ఆధిపత్యం కలిగిన దశ. రెండోది 21వ శతాబ్దం మలుపునుండి బహుళధృవ ప్రపంచం ఏర్పాటుకోసం జరుగుతున్న ప్రయత్నాల్లో అమెరికా ఆధిపత్యానికి అన్ని రంగాల్లోనూ, ప్రపంచంలోని అన్ని ప్రాంతాల్లోనూ ప్రతిఘటన అంతకంతకూ పెరుగుతున్న దశ.

**అమెరికా ఆధిపత్యంలో ఏకధ్రువ ప్రపంచం**

సోషలిస్టు ప్రపంచంలో 1989 నుండి 1991 వరకు రెండేళ్ల పాటు సంభవించిన పెనుతుపానుకు మొత్తం సోషలిస్టు శిబిరం ఛిన్నాభిన్నమైంది. తూర్పుయూరప్ దేశాల్లో సోషలిస్టు వ్యవస్థలు కుప్పకూలాయి. సోవియట్‌ను రక్షించుకోడానికి 1991 ఆగస్టులో జరిగిన చివరి యత్నం విఫలం కావడంతో మహత్తర సోవియట్ యూనియన్ ముక్కలుగా విడిపోయింది. దాంతో ప్రపంచ పరిణామాలపై సామ్రాజ్యవాదానికి, ముఖ్యంగా అమెరికాకు తిరుగులేని ఆధిక్యత కలిగిన ఏకధృవ ప్రపంచం ఏర్పడింది. ఈ ఆధిపత్యాన్ని ఉపయోగించుకుని అమెరికా అన్నిరంగాల్లోనూ సోషలిజంపైనా, పురోగామి ఆలోచనలపైనా ఎదురుదాడికి దిగింది. ప్రపంచంపై పట్టుపెంచుకోడానికి ప్రయత్నించింది. తొలిదశలో ఈ ప్రయత్నాలకు ప్రతిఘటన వచ్చినా సామ్రాజ్యవాద రథం వాటిని నెట్టుకుంటూ పోయింది.

**సైద్ధాంతిక దాడి:** సోవియట్ పతనానంతరం సామ్రాజ్యవాదం సోషలిజంపైనా, కమ్యూనిస్టు భావాలపైనా సైద్ధాంతిక దాడి ముమ్మరం చేసింది. నయా-ఉదారవాద సిద్ధాంతాలను ముందుకు తెచ్చింది. పెట్టుబడిదారీ వ్యవస్థతో చరిత్ర అంతమైందనీ, ఈ వ్యవస్థకన్నా మిన్న అయిన వ్యవస్థలు ఇక ముందు వచ్చే అవకాశం లేదనీ ప్రచారం చేసింది. ఫ్రాన్సిస్ ఫుకుయామా రాసిన 'చరిత్ర అంతం' (ఎండ్ ఆఫ్ హిస్టరీ) అన్న గ్రంథం ఇటువంటి సిద్ధాంతాలకు మచ్చుతునక. సోషలిజంతో పెట్టుబడిదారీ ప్రపచం ఇన్నాళ్లూ జరిపిన యుద్ధం (ప్రచ్ఛన్న యుద్ధం) అంతమైంది కాబట్టి ఇక ముందు వ్యవస్థల మధ్య యుద్ధాలకు అవకాశం లేదనీ, ఒకవేళ వస్తేగిస్తే వివిధ నాగరికతల మధ్య యుద్ధాలు రావలసిందేనని ప్రచారం అందుకున్నారు. శామ్యూల్ హట్టింగ్టన్ ఈ సిద్ధాంతాన్ని బలపరుస్తూ 'నాగరికతల మధ్య ఘర్షణ' (క్లాష్ ఆఫ్ సివిలైజేషన్స్) అన్న వ్యాసం రాశాడు. ఇక ప్రపచంలో సిద్ధాంతాలంటూ ఉండవు మిగిలేది ప్రజాస్వామ్యం మాత్రమేనని ఫ్రాన్సిస్ ఫకుయామా 'మూడో వెల్లువ' (థర్డ్ వేవ్)లో రాశాడు. సామ్రాజ్యవాదులు సృష్టించిన ఈ సిద్ధాంతాలు కింది స్థాయివరకు వెళ్లాయి. 'కమ్యూనిజం పని అయిపోయింది', 'ఇజాలకు కాలం చెల్లింది', 'పాతసిద్ధాంతాలను పట్టుకు వేలాడకూడదు', అసలు 'సిద్ధాంతాలే వద్దు' అన్న వాదనలు రాజ్యమేలాయి.

మరోవైపు అదే సమయంలో సామ్రాజ్యవాదం, నయా-ఉదారవాద సిద్ధాంతాలను ప్రపంచం మీదకు వదిలింది. సంపద 'పంచడం' కాదు సంపద 'పెంచాలి' అనేది నయా-ఉదారవాదుల ప్రధాన వాదన. సంపద పెంచాలంటే ప్రయివేటు పెట్టుబడులకు సంపూర్ణమైన స్వేచ్ఛ ఇవ్వాలి. పెట్టుబడుల ప్రవాహానికీ, ప్రపంచంలోని ఏమూలలనైనా అవి స్వేచ్ఛగా 'పనిచేసుకోడానికీ' అవకాశాలు కల్పించాలి. ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రయివేటీకరణ విధానాల ద్వారా పెట్టుబడులకు స్వేచ్ఛ లభిస్తాయనీ, దాని వల్ల ఆయా దేశాల్లో సంపద పెరుగుతుందనీ చెప్పాయి. సంపద్వంతులైన కొద్దిమంది పెట్టుబడిదారులనుండి క్రమంగా సంపద కిందికి దిగి సామాన్య ప్రజానీకానికి చేరుతుందని చెప్పింది. దీనికి 'ట్రికిల్‌డౌన్ ఎఫెక్ట్' అని పేరు పెట్టారు. 'ప్రభుత్వం అభివృద్ధి నిరోధకమైంది, ప్రయివేటు అభివృద్ధి కరమైంది',

అందువల్ల 'అన్ని రంగాలనుండి ప్రభుత్వం ఉపసంహరించుకోవాలి' అనే వాదన ముందుకు తెచ్చారు.

ఈ కాలంలో సోషలిజం ఎదురుదెబ్బలు తినడం, నాయా-ఉదావాద సిద్ధాంతాలు ముందుకు రావడంతో ప్రపంచ వ్యాపితంగా వందకు పైగా దేశాల్లో పనిచేస్తున్న కమ్యూనిస్టు పార్టీలు నిలవలేకపోయాయి. కమ్యూనిస్టు వ్యతిరేక తుపానులో అనేక పార్టీలు కొట్టుకు పోయాయి. కొన్ని పార్టీలు పేర్లు మార్చు కున్నాయి. కొన్ని 'మార్క్సిస్టు-లెనినిస్టు' సూత్రా లకు తిలోదకాలిచ్చాయి. ప్రజల్లో బలమైన పునాది కలిగిన ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సమావేశమై పార్టీని రద్దు చేస్తున్నట్లు ప్రకటించింది. అనేక పార్టీలు ఇదే బాట పట్టాయి. అటువంటి క్లిష్ట పరిస్థితుల్లో వేళ్లమీద లెక్కించదగ్గ కొద్దిపాటి పార్టీలు మాత్రమే సోషలిజానికీ, మార్క్సిజం- లెనినిజా నికీ కట్టుబడి ఉన్నట్లు ప్రకటించాయి. వాటిలో భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) ఒకటి. సోవియట్ పతనానంతరం 1993లో పార్టీ కలకత్తాలో మొదటిసారిగా సోషలిజానికి కట్టుబడి ఉన్న పార్టీలతో ఒక అంతర్జాతీయ సదస్సు జరిపింది. తరువాత అటువంటి సదస్సు లు లాటిన్ అమెరికాలోనూ, యూరప్‌లోనూ జరిగాయి. ఇప్పటికీ జరుగుతున్నాయి.

**ఆర్థిక దాడి:** నయా-ఉదారవాద ఆర్థిక విధానాలను అమలు చేయడం కోసం సామ్రాజ్యవాదులు ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకు, డబ్ల్యుటిఓ లను సాధనాలుగా ఉపయోగించు కున్నారు. అప్పుల్లో చిక్కుకున్న దేశాలకు రుణాలిచ్చే పేరుతో ఐఎంఎఫ్, అభివృద్ధి రుణాల పేరుతో ప్రపంచ బ్యాంకులు ఆయా దేశాలపై అనేక షరతులు రుద్దాయి. ఆయా దేశాల ఆర్థికవ్యవస్థలను 'పునర్వ్యవస్థీకరించి' (స్ట్రక్చరల్ రీ ఎడ్జస్ట్‌మెంట్) వాటిలోకి విదేశీ బహుళజాతి సంస్థల పెట్టుబడులూ, ఉత్పత్తు లూ స్వేచ్ఛగా ప్రవేశించేందుకు వీలుకల్పించడ మే ఈ ఆర్థిక పునర్వ్యవస్థీకరణ ముఖ్యోద్దేశం. సరళీకరణ, ప్రయివేటీ కరణ విధానాలను యదేచ్ఛగా ప్రవేశపెట్టారు. అదే సమయంలో 'గాట్' ఒప్పందాన్ని ఆర్థర్ డంకెల్ ముసాయి దాతో విస్తరించి డబ్ల్యుటివోగా మార్చడం ద్వారా వాణిజ్యరంగంలో బహుళజాతి సంస్థల దోపిడీకి తెరతీసింది. ఈ విధానాల వల్ల అన్ని దేశాల్లోకీ విదేశీ పెట్టుబడుల ప్రవాహం పెరిగింది. దోపిడీ పెరిగింది. అందువల్ల లాభపడిన కొందరు కుబేరులైనారు. నష్టపడిన సామాన్యప్రజలు మరింత పేదరికంలోకీ, కష్టాల్లోకీ నెట్టబడ్డారు. ప్రపంచ వ్యాపితంగా దేశాలమధ్య, ప్రజల మధ్య ఆర్థిక అంతరాలు తీవ్రంగా పెరిగాయి.

**రాజకీయ దాడి:** కమ్యూనిస్టు పార్టీలమీదా, వామపక్షాల మీదా ఈ కాలంలో రాజకీయ దాడి కేంద్రీకృతమైంది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల నుండి వర్ధమాన దేశాలవరకు అన్ని దేశాల్లోనూ నయా- ఉదార వాదాన్ని ఆమోదించే పార్టీలు, నేతలకు అధికార పగ్గాలు లభించాయి. అప్పటివరకు కొద్దోగొప్పో సామాజిక న్యాయానికి కట్టుబడిన పార్టీలు కూడా నయా-ఉదారవాద విధానాలకు తలొగ్గాల్సిన పరిస్థితులు కల్పించారు. సంప్ర దాయ పార్టీలు కూడా మితవాదంపైపు మొగ్గాయి. మొత్తం లాటిన్ అమెరికా దేశాల న్నింటా సామ్రాజ్యవాద వ్యతిరేక తిరుగుబాట్లు వెనుకపట్టు పట్టాయి. అమెరికాకూ, దాని బహుళజాతి సంస్థల దోపిడీకీ అనుకూలమైన ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. నిజానికి లాటిన్ అమెరికాలో నాయా- ఉదారవాద విధానా లను అమెరికా 1980వ దశకం ప్రారంభం నుండే అమలుచేయడం ప్రారంభించింది. అందువల్ల సోవియట్ కూలిపోయేనాటికే ఆ దేశాల్లోని ప్రజలు ప్రపంచీకరణ విధానాల దుష్ప్రభావాలను చవిచూసి ఉన్నారు.

సోవియట్ కూలిపోయాక ప్రపంచ వ్యాపితంగా అభివృద్ధి కర ఉద్యమాలు వెనుక పట్టు పట్టాయి. దాంతో ప్రజల అసంతృప్తిని మతతత్వ శక్తులు సొమ్ముచేసుకుని బలపడి నాయి. అనేక దేశాల్లో ఈ శక్తులకు సామ్రాజ్య వాదం అండదండలిచ్చి పోషించింది. ఆఫ్ఘని స్థాన్‌లో తాలిబన్లు, అరబ్‌దేశాల్లో బిన్‌లాడెన్ అనుచర గణం అమెరికా పోషణలోనే పెరిగి పెద్ద వైనాయి. మన దేశంలో ఆర్ఎస్ఎస్ మతోన్మా దం, ముస్లిం దేశాల్లో ఇస్లామిక్ ఛాందసవాదం, శ్రీలంకవంటి దేశాల్లో బౌద్ధ మతత్వం, యూరప్, అమెరికాల్లో క్రైస్తవ ఛాందసవాదం పెరిగాయి. అనేకచోట్ల అధికారంలోకి వచ్చిన ఈ శక్తులతో సామ్రాజ్య వాదులు చేతులు కలిపి నయా- ఉదారవాద ప్రపంచీకరణ విధానాలను అమలు జరిపిం చారు.

సోవియట్ అండ పోవడంతో పాలస్తీనా విమోచనా పోరాటం కూడా వెనుకపట్టు పట్టింది. పాలస్తీనా విమోచనా సంస్థ నాయ కుడు యాసర్ అరాఫత్ అనేక డిమాండ్లను వదులుకుని పశ్చిమతీరం, గాజా ప్రాంతాలతో కూడిన భూభాగంలో మున్సిపల్ అధికారాలతో పాలస్తీనా రాజ్యం ఏర్పాటుకు అంగీకరించాడు. అయినా పాలస్తీనియన్లకు ఈ మాత్రం స్వయం ప్రతిపత్తి కూడా ఇవ్వడానికి ఇజ్రాయిల్ నిరాకరించింది. పాలస్తీనా పోరాటం దెబ్బ తినడంతో మధ్య ఆసియాలోని అరబ్బుల్లో నైరాశ్యం నెలకొంది. ఇది ఇస్లామిక్ ఉగ్రవాదం అభివృద్ధికి మరింత ఊతం ఇచ్చింది.

**సైనిక దాడి:** సామ,దాన,భేద వ్యూహాలు ఫలించనిచోట అమెరికా, ఇతర సామ్రాజ్య వాదులు బలప్రయోగానికి కూడా పాల్పడ్డారు. సోవియట్ కూలిపోవడంతోనే అమెరికా నేతృత్వంలోని 'నాటో' సైన్యం యుగోస్లో వియాపై దాడికి పాల్పడి దాన్ని ముక్కలు చేసింది. 1991లోనే ఇరాక్‌పై సీనియర్ బుష్ (ప్రస్తుత అమెరికా అధ్యక్షుడు జార్జిబుష్ తండ్రి) ఆధ్వర్యంలో అమెరికా దాడిచేసింది. వైమానిక రాకపోకలు నిషేధించింది. చమురు అమ్మకాల పైనా, ఆర్థిక కార్యకలాపాలపైనా ఆంక్షలు విధించింది. పదేళ్లపాటు అమెరికా అమలు చేసిన ఆర్థిక ఆంక్షల వల్ల ఇరాక్ ఆర్థికంగా కృంగిపోయింది. మందులు, సరైన ఆహారం అందక సుమారు 5 లక్షలమంది పిల్లలు మరణించారు. ఈ కాలంలోనే హైతీమీద, సోమాలియామీదా అమెరికా నేరుగానూ, ఐక్యరాజ్యసమితి ముసుగులోనూ దాడులు చేసింది. మరిన్ని దేశాలపై సైనిక దాడులు చేస్తామన్న హెచ్చరికలకు పాల్పడింది. అటు వంటి బెదిరింపులతో కల్నల్ గడాఫీ నాయ కత్వంలోని లిబియాను దారికి తెచ్చుకుంది. ఈ పనులు చేస్తూనే మరోవైపు సంపూర్ణ సైనికాధిపత్యం కోసం ప్రయత్నాలు ముమ్మరం చేసింది. నాటో కూటమిలోకి ఒకనాటి తూర్పు యూరప్ సోషలిస్టు దేశాలను చేర్చుకోవడం ప్రారంభించింది. జాతీయ క్షిపణి రక్షణ వ్యవస్థకు రూపకల్పన చేసింది. ఈ వ్యస్థను రూపొందిస్తే ప్రపంచంలో తన సైనికాధిపత్యానికి ఇక ఎదురుండదనేది అమెరికా భావన.

**సోషలిస్టు దేశాల స్పందన:** సోవి యట్ కూలిపోయిన వెంటనే సామ్రాజ్య వాదులు మిగిలిఉన్న సోషలిస్టు దేశాలపై కూడా దాడిని ఎక్కుపెట్టారు. ఉత్తర కొరియాను ధూర్త దేశంగా ప్రకటించి సైనిక దాడులు చేస్తామని బెదిరిం చారు. క్యూబా మీద భరించలేని ఆంక్షలు విధించారు. కవ్వింపులు ముమ్మరం చేశారు. చైనాలో కూడా అంతర్గత సంక్షోభం సృష్టించ డానికి ప్రయత్నించారు. నిజానికి సోషలిజం కూల్చివేయడానికి అన్ని దేశాలకన్నా ముందు

చైనాలోనే -1989 ఏప్రిల్‌లో తియనాన్‌మెన్ స్క్వేర్‌లో ప్రయత్నం జరిగింది. అయితే డెంగ్ సియావో పింగ్ వంటి సీనియర్ విప్లవ నాయకుల అండతో చైనా కమ్యూనిస్టు పార్టీ ఆ దాడులను తిప్పికొట్టింది. తరువాత దాదాపు మిగిలిన సోషలిస్టు దేశాలన్నీ మారిన పరిస్థితులకు అనుగుణంగా కొన్ని మార్పులు చేసుకుని తమను తాము కాపాడుకున్నాయి. చైనాతో సహా పలు సోషలిస్టు దేశాలు ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టి ప్రపంచీకరణ దశలో సోషలిస్టు ఆర్థిక పురోగమనానికి శ్రీకారం చుట్టాయి.

**ప్రతిఘటన:** ఈ దశాబ్ద కాలంలో సామ్రాజ్యవాదానికి అసలు ప్రతిఘటన లేదని కాదు. నిజానికి ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకు, డబ్ల్యుటిఓ సాధనాలుగా అమెరికా ప్రవేశపెట్టిన నాయా-ఉదారవాద ఆర్థిక విధానాలకు ప్రపంచంలోని అన్ని దేశాల్లోనూ, చివరికి అభివృద్ధి చెందిన యూరప్ దేశాల్లోనూ, తూర్పు యూరప్, రష్యాల్లోనూ ప్రతిఘటన ఎదురైంది. ప్రజలు ఈ విధానాలకు వ్యతిరేకంగా వివిధ రూపాల్లో ఆందోళనలు చేశారు. ముఖ్యంగా పదేళ్ళ ముందుగానే ప్రపంచీకరణ విధానాలు అమలుజరిపిన లాటిన్ అమెరికాలోని అనేక దేశాల్లో 1990వ దశకంలో పెద్ద ఎత్తున ప్రజా ఉద్యమాలు తలెత్తాయి. పెరూలో 'భూమికోసం ప్రత్యక్ష పోరాటం', ఈక్వెడార్‌లో 'మూలవాసుల తిరుగుబాటు', అర్జెంటీనాలో 'వీధి ఆందోళనలు', బొలీవియాలో ప్రజా సాయుధతిరుగుబాట్లు, బ్రెజిల్‌లో 'భూ పోరాటం', చిలీలో సామ్రాజ్య వాద వ్యతిరేక నిరసనలు, ఉరుగ్వేలో నూతన రాజకీయ ఉద్యమ ఆవిర్భావం, వెనిజులాలో సైనిక కుట్రలకు ప్రతిఘటనలు, మెక్సికోలో చియాపాస్ తిరుగుబాటు...ఇలా చెప్పుకుంటూ పోతే లాటిన్ అమెరికా దేశాలన్నింటా ప్రజా ఉద్యమాలు జరిగాయి. ఆసియా, ఆఫ్రికా దేశాల్లో కూడా ప్రపంచీకరణ విధానాలకు వ్యతిరేకంగా ప్రజాందోళనలు జరిగాయి. భారత్‌లో వామపక్షాలు ఈ ఉద్యమాలకు సారథ్యం వహించాయి. నూతన ఆర్థిక విధానాల పేరుతో మన దేశంలో ప్రవేశపెట్టిన ప్రపంచీకరణ, ప్రయివేటీకరణ, సరళీకరణ విధానాలకు వ్యతిరేకంగా అనేక ఆందోళనలూ, ఉద్యమాలూ జరిగాయి. దాదాపు ప్రతి సంవత్సరం సార్వత్రిక సమ్మెలు నిర్వహించబడ్డాయి. అయితే ఈ ప్రతిఘటనోద్యమాలు రాజకీయంగా సంఘటిత పడలేదు. ప్రపంచీకరణ వేగాన్ని ఆపగలిగే స్థితిలో ఇవి లేవు. దక్షిణాఫ్రికాలో జాతివివక్షకు వ్యతిరేకంగా



**షాంఘై 5: 2003 మే 29 రష్యాలోని సెంట్ పీటర్స్‌బర్గ్‌లో సమావేశమైన ఉజ్బెకిస్థాన్, కిర్గిస్థాన్, కజకస్థాన్, రష్యా, చైనా, తజికిస్థాన్ దేశాధినేతలు**

పోరాడిన కమ్యూనిస్టులూ, ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ (ఎఎన్‌సి) కలిసి అధికారంలోకి రావడం ఒక్కటే ఈ కాలంలో పురోగామి శక్తులకు స్ఫూర్తినిచ్చిన ప్రధాన అంశం.

### ఏకధృవ ప్రంచానికి ప్రతిఘటన

అయితే పైన చెప్పిన పరిస్థితి ఇప్పుడు లేదు. ఈ శతాబ్దం ఆరంభం నుండి ప్రపంచ పరిణామాల్లో కొన్ని మార్పులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ముఖ్యంగా కమ్యూనిస్టులకూ, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులకూ సంతోషం కలిగించే మార్పులు జరుగుతున్నాయి. ఈ మార్పులు:

**1) నయా-ఉదారవాద సిద్ధాంతాలు ఆచరణలో తప్పని రుజువవుతున్నాయి:** ఇజాలు వద్దన్నవారూ, స్వేచ్ఛామార్కెట్‌ను పూజించిన వారే ఇప్పుడు సామాజిక న్యాయం గురించీ, సంపద పంపిణీ గురించి మాట్లాడాల్సి వస్తోంది. చరిత్ర అంతమైందని రాసిన ఫ్రాన్సిస్ ఫకుయామా, "9/11 తరువాత చరిత్ర తిరిగి ప్రారంభమైందా?" అని 2002లో వ్యాసం రాశాడు. ప్రపంచ బ్యాంకు అధ్యక్షునిగా పని చేసిన జోసెఫ్ స్టిగ్లిట్జ్ బ్యాంకు విధానాల వల్ల నష్టాలగురించి వెల్లడించాల్సి వచ్చింది. 2004 ప్రపంచ సోషల్ ఫోరమ్‌లో ఆయన పాల్గొని ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటానికి సంఘీభావం తెలపడం విశేషం. నయా-ఉదారవాద ఆర్థిక విధానాలు ప్రపంచ ప్రజల సమస్యలు పరిష్కరించకపోగా అసమానతలనూ, పేదరికాన్నీ పెంచాయన్న విషయం రోజురోజుకూ మరింత స్పష్టమవుతోంది.

**2. ప్రపంచీకరణ పట్ల వ్యతిరేకత పెరుగుతోంది:** అనేక రూపాల్లో ఇది సాగుతోంది. దేశదేశాల్లో ప్రపంచీకరణకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాలు ఒక ఎత్తయితే ప్రపంచ సోషల్ ఫోరమ్ (డబ్ల్యుఎస్‌ఎఫ్) వేదికగా జరుగుతున్న ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటం మరో ఎత్తు. ఇది 1999లో సియాటెల్‌లో ప్రారంభమైంది. అంతకు ముందు చెదురుమదురుగా ఉన్న ప్రపంచీకరణ వ్యతిరేక చర్చ సియాటెల్ ఆందోళనతో అంతర్జాతీయ రూపాన్ని సంతరించుకుంది. అమెరికన్ బహుళజాతి కుభేరుడు బిల్ గేట్స్ ప్రధాన స్థావరమైన సియాటెల్ నగరంలో డబ్ల్యుటిఓ మంత్రిత్వ స్థాయి సమావేశాన్ని వివిధ దేశాలనుండి వచ్చిన సుమారు 50,000 మంది ఆందోళనకారులు అడ్డుకున్నారు. వీరిలో అత్యధిక శాతం అమెరికా, యూరప్ ఇతర అభివృద్ధి చెందిన దేశాలకు చెందిన వారే కావడం విశేషం. ప్రపంచీకరణ విధానాల దుష్ప్రభావాలకు గురైన వివిధ సెక్షన్లకు చెందిన వారు, పలు స్వచ్ఛంద సంస్థల సభ్యులు ఈ ఆందోళనలో ప్రధాన భూమిక పోషించారు. ప్రపంచీకరణకు ప్రత్యామ్నాయం లేదు (దేరీజ్ నో ఆల్టర్నేటివ్-టినా) అని సామ్రాజ్యవాదులు చేస్తున్న ప్రచారాన్ని సియాటెల్ ఆందోళనకారులు సవాలు చేశారు. తరువాత ప్రపంచీకరణకు వ్యతిరేకంగా వివిధ ఖండాల్లో జరుగుతున్న పోరాటానుభవాలను పంచుకునేందుకు 2001 నుండి ఏటేటా ప్రపంచ సోషల్ ఫోరమ్ సమావేశాలు ఏర్పాటు చేయడం మొదలు పెట్టారు.

స్విట్జర్లండ్‌లోని దావోస్ నగరంలో ప్రపంచ అర్థిక ఫోరమ్ (డబ్ల్యుఇఎఫ్) సమావేశాలు ప్రతిఏటా జనవరి చివర, ఫిబ్రవరి ప్రారంభంలో జరుగుతాయి. ఈ సమావేశాలకు బహుళజాతి కంపెనీల సిఇఓలు, అభివృద్ధి చెందిన దేశాల ప్రభుత్వ ప్రతినిధులు, వర్ధమాన దేశాల్లో ప్రపంచీకరణ విధానాలను ఉత్సాహంతో అమలువరిచే నేతలు హజరవుతారు. ప్రపంచీ కరణ విధానాలు అమలవుతున్న తీరును సమీక్షించి వీటికి ఎదురవుతున్న అడ్డంకులను అధిగమించే మార్గాల గురించి చర్చిస్తారు. ప్రపంచీకరణ వ్యతిరేక ఆందోళన కారులు కూడా తమ డబ్ల్యుఎస్ఎఫ్ సమావేశాలకు ఇవే తేదీలను ఎన్నుకున్నారు. అయితే వారు దావోస్‌కు బదులుగా పోర్టో అలెగ్రేను తమ అతిధేయ నగరంగా ఎన్నుకున్నారు. దీనికి కారణం ఉంది. బ్రెజిల్‌లో అప్పట్లో ప్రపంచీకరణ వ్యతిరేక ప్రజాపోరాటానికి నాయకత్వం వహిస్తున్న వర్కర్స్ పార్టీ, పోర్టో అలెగ్రే నగర పాలన పగ్గాలు చేపట్టి ఉంది. ప్రస్తుత బ్రెజిల్ అధ్యక్షుడు లూలా- డ-సిల్వా ఆ పార్టీకి నాయకుడు. అందుకనే 2001 నుండి వరుసగా మూడేళ్ల పాటు అక్కడనే డబ్ల్యుఎస్ఎఫ్ సమావేశాలు జరిపారు. 2004 లో బొంబాయిలోనూ, 2005లో మళ్లీ పోర్టో అలెగ్రె నగరంలోనూ జరిగాయి. 2006 సమా వేశాలు ఒక్క నగరంలో కాకుండా ఒకే సారి మూడు నగరాలు- కారకాస్ (వెనిజులా) బమాకో (మాలి) కరాచీ (పాకిస్తాన్)లలో జరి గాయి. 2007 సమావేశం కెన్యా రాజధాని నైరోబీలో జరిగింది. వచ్చే ఏడాది సమావేశాన్ని ఒక దేశంలో కాకుండా ప్రపంచ వ్యాపితంగా అంటే దాదాపు అన్ని నగరాలు, పట్టణాల్లోనూ జరపాలని నిర్ణయించారు. డబ్ల్యుఎస్ఎఫ్ సమావేశాలు ఎప్పుడెప్పుడు జరిగాయన్నది కాదు ఆ సమావేశాల్లో జరిగిన చర్చ, ఇచ్చిన నినాదాలూ ముఖ్యం. మొదటి సమావేశం "ఈ ప్రపంచం వద్దు' అన్న నినాదంతో ప్రపంచీరకణ విధానాలకు నిరసన తెలపగా, రెండో సమావేశంలో "మరో ప్రపంచం సాధ్యమే' అన్న నినాదం ఇచ్చారు. 2003లో జరిగిన సమా వేశంలో మరో ప్రపంచం ఎలా ఉండాలి అన్నదానిపై చర్చ జరిగింది. అది సోషలిజమా, మరో సమాజమా అన్నది చర్చ. 2004 ముంబయిలో జరిగిన ప్రపంచ సోషల్ ఫోరమ్‌లో మరో ప్రపంచం సోషలిజమే అన్న వారికీ కాదన్న వారికీ మధ్య చర్చ జరగింది.



అనారోగ్యంలో కూడా లాటిన్ అమెరికా పరిణామాలను ప్రభావితం చేస్తున్న కాస్ట్రో

సీతారాం ఏచూరితో సహా పలువురు వామపక్ష నాయకులు మరోప్రపంచం సోషలిజంతోనే సాధ్యమని వక్కాణించగా, జేమ్స్ పెట్రాస్ వంటి వారు దాన్ని వ్యతిరేకించారు. 2005లో మళ్లీ పోర్టో అలెగ్రె నగరంలో డబ్ల్యుఎస్ఎఫ్ సమావేశాలు జరిగే సరికి బ్రెజిల్ ప్రజలు ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటంలో తమ సహచరుడైన లూలా-డ-సిల్వాకు పట్టం కట్టారు. ఈ సమావేశంలో వెనిజులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్ ముఖ్యోపన్యాసం చేస్తూ "మరో ప్రపంచం సోషలిజమే" అని ప్రకటించారు. సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు వ్యతిరేకంగా "21వ శతాబ్దపు సోషలిజం నిర్మించడం" మానవాళి విముక్తికి ఏకైక మార్గమని చెప్పారు. తాను తన దేశంలో ప్రపంచీకరణకు వ్యతిరేకం గా బొలివేరియన్ ప్రత్యామ్నాయాన్ని నిర్మిస్తున్నట్లు ప్రకటించాడు. ఆ విధంగా వరుసగా వచ్చిన ప్రపంచ సోషల్ ఫోరమ్ చర్చలు పరిశీలించేవారికి, ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటం క్రమంగా సోషలిస్టు చైతన్యం దిశగా పయనించడం కనిపిస్తుంది.

**3. అమెరికా దురాక్రమణకు గట్టి ప్రతిఘటన ఎదురవుతోంది:** ఆఫ్ఘనిస్థాన్, ఇరాక్‌లపై యుద్ధాల సందర్భంగా ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు వ్యవహరించిన తీరు, ఇరాక్ యుద్ధ కూపంలో కూరుకుపోయి అమెరికా అల్లాడుతున్న వైనం ప్రపంచ ప్రజలముందు అమెరికాను నగ్నంగా ఎండగట్టాయి. నిజానికి ఇరాక్‌లో అమెరికా ఊహించని ప్రతిఘటన ఎదుర్కోవడం, రోజు రోజుకీ యుద్ధంలో పీకల్లోతు కూరుకుపోవడం మారిన పరిస్థితులకు అద్దం పడుతోంది. 2001 సెప్టెంబర్ 11న అమెరికాలోని ప్రపంచ వాణిజ్య కేంద్ర భవనాలపై ఉగ్రవాదుల జరిపిన దాడులను నెపంగా తీసుకుని అమెరికా ఆఫ్ఘనిస్థాన్‌మీద దాడి చేసింది. తరువాత ఏడాది న్నరకు పూర్తి కట్టుకథలతో కూడిన ఆరోపణలతో ఇరాక్‌మీద దాడి చేసింది. ఇరాక్‌లో కొద్ది వారాల్లోనే తనకు అనుకూలమైన ప్రభుత్వాన్ని స్థాపించగలనని కలలు కన్న అమెరికా మూడేళ్లు గడుస్తున్నా తన లక్ష్యం నెరవేర్చు కోలేకపోగా ఇరాక్‌లో నష్టాలు, దేశంలో విమర్శలు, విదేశాల్లో ఛీత్కరింపులు ఎదుర్కొం టోంది. ఇరాక్ ప్రజలు అమెరికన్లకూ, వారి తైనాతీలకూ వ్యతిరేకంగా మడమ తిప్పకుండా పోరాడుతున్నారు. నూటికి 70 మంది అమెరి కన్లు, ప్రపంచ వ్యాపితంగా మెజారిటీ ప్రజలు ఇరాక్‌నుండి అమెరికా సైనిక బలగాలు వెనక్కు రావాలని కోరుకుంటున్నారంటే ఇరాక్ యుద్ధంలో అమెరికా ప్రతిష్ట ఎంతగా దిగజా రిందో అర్ధమవుతుంది. ఆఫ్ఘన్ దురాక్రమణ జరిపి ఆరేళ్లు గడుస్తున్నా ఇప్పటికీ అక్కడ మెజారిటీ ప్రాంతం తాలిబాన్ల అధీనంలోనే ఉందంటే అమెరికా ప్రతిష్టించిన ప్రభుత్వం ఎంత సమర్ధవంతంగా ఉందో అర్ధమవుతుంది. అదే విధంగా లెబనాన్‌పై అమెరికా ప్రోద్బ లంతో ఇజ్రాయిల్ జరిపిన దాడిని హిజ్‌బుల్ సాయుధ వాలంటీర్లు తిప్పికొట్టడం కూడా అమెరికా ఆధిపత్యానికి ఎదురవుతున్న ప్రత్యక్ష ప్రతిఘటనకు నిదర్శనం.

**4. బహుళ ధృవ ప్రపంచం కోసం ప్రయత్నాలు ముమ్మరమైనాయి:** ఒకవైపు చైనా-రష్యాల వ్యూహాత్మక భాగస్వామ్యం, మరోవైపు లాటిన్ అమెరికా దేశాలను కూడగట్టడానికి క్యూబా, వెనిజులా వంటి దేశాలు తీసుకుంటున్న చర్యలూ, అమెరికా, యూరప్ ఒత్తిళ్లను ఎదిరించేందుకు భారత్-బ్రెజిల్-దక్షిణాఫ్రికాల కూటమి చేస్తున్న ప్రయత్నాలూ....ఇవన్నీ అమెరికా నేతృత్వంలోని ఏకధృవ ప్రపంచం నుండి బహుళధృవ ప్రపం చం వైపుగా పరిణామాలను నడుపుతున్నాయి. రష్యా-చైనాలు షాంఘై-5 కూటమిని ఏర్పాటు చేసి అమెరికా సామ్రాజ్యవాద విస్తరణకు చెక్ పెట్టేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి. రష్యా, చైనాలతోబాటు తజకిస్థాన్, కిర్గిజిస్థాన్, కజకస్థాన్‌లతో ఏర్పడిన ఈ కూటమిలో కొత్తగా ఉజ్జెకిస్తాన్ వచ్చి చేరింది. ఇరాన్, పాకిస్తాన్, మంగోలియా భారత్‌లకు ఇందులో పరిశీలక హోదా ఇచ్చారు. షాంఘై గ్రూపులో పరిశీలకు

నిగా చేరడానికి అమెరికా చేసిన విజ్ఞప్తిని కూటమి తిరస్కరించడం విశేషం. షాంఘై గ్రూపులో పూర్తి స్థాయి సభ్యత్వం కావాలని పాకిస్థాన్, మంగోలియా, ఇరాన్‌లు కోరగా భారత్ కోరలేదు.

లాటిన్ అమెరికాలో వెనిజులా, బొలీవియా, ఉరుగ్వేలు క్యూబా సహాయంతో సామ్రాజ్యవాద వ్యతిరేక బొలివేరియన్ ప్రత్యామ్నాయ కూటమి ఏర్పాటు చేశాయి. సరికొత్తగా ఇందులోకి ఇటీవలనే నికరాగువా వచ్చి చేరింది. ఐఎంఎఫ్-ప్రపంచ బ్యాంకుకు ప్రత్యామ్నాయంగా పేదదేశాల బ్యాంకు (బ్యాంకోసుర్) ఏర్పాటు, సిఎన్‌ఎన్‌కు వ్యతిరేకంగా లాటిన్ అమెరికా దేశాల టెలివిజన్ సంస్థ (టెలిసూర్) ఏర్పాటు, అమెరికా నాయకత్వంలోని 'ఫ్రీ ట్రేడ్ ఏరియా ఆఫ్ ది అమెరికాస్' (ఫాటా)కు ప్రత్యామ్నాయంగా 'బొలివేరియన్ ఆల్టర్నేటివ్ ఫర్‌ది పీపుల్ ఆఫ్ అవర్ అమెరికా (అల్బా) ఏర్పాటు...ఇవన్నీ అమెరికా పెరటి దొడ్డిగా భావించే లాటిన్ అమెరికాలో అమెరికా సామ్రాజ్యవాద ఏకఛత్రాధిపత్యానికి ఎదురవుతున్న సవాళ్లు. ఈరోజున అమెరికా నడిబొడ్డున ఐక్యరాజ్య సమితి భవనంలో నిలబడి జార్జి బుష్‌ను ప్రపంచానికి పట్టిన 'దయ్యం'గా చావెజ్ వర్ణించ గలిగాడంటే అది ఆయన ధైర్యానికి మాత్రమే కాదు, లాటిన్ అమెరికాలో... ఆమాటకొస్తే ప్రపంచ వ్యాపితంగా దిగజారుతున్న అమెరికా ప్రతిష్టకు నిదర్శనం. ఆసియాలోనూ, లాటిన్ అమెరికాలోనూ అమెరికాకు వ్యతిరేకంగా ఏర్పడుతున్న ఈ 'కూటముల' మధ్య ఇటీవలి కాలంలో సంఘీభావం పెరుగుతుండడం గమనించదగ్గ విషయం. వెనిజులా తన చమురు ఎగుమతులను అమెరికానుండి ఇతర దేశాలకు ముఖ్యంగా చైనాకూ, ఇతర లాటిన్ అమెరికా దేశాలకూ మళ్లిస్తోంది. వెనిజులాలో చమురు అన్వేషణకు చైనా సహకరిస్తోంది. అలాగే అమెరికా బెదిరింపులను ఎదుర్కొంటున్న ఇరాన్‌తో ఒకవైపు నుండి చైనా, రష్యా, మరోవైపు నుండి వెనిజులా సంబంధాలు కొనసాగిస్తున్నాయి. ఈ సంఘీభావం అమెరికా ఆధిపత్య ధోరణులు చెక్ పెడుతుందనడంలో సందేహం లేదు. ఇదే సమయంలో ఆఫ్రికాలోని మెజారిటీ దేశాలతో చైనా స్నేహ సహకార సంబంధాలు మెరుగుపడుతున్నాయి. పలు ఆఫ్రికా దేశాలకు చైనా ఆర్థిక, సాంకేతిక సహకారం అందిస్తోంది. దౌత్యరంగంలో కూడా ఇటీవల చైనా చాకచక్యంగా ముందుకు దూసుకుపోతోంది.



లాటిన్ అమెరికాలో బొలివేరియన్ ప్రత్యామ్నాయం: నికరాగువా అధ్యక్షుడు డేనియల్ ఓర్టెగా, క్యూబా ఉపాధ్యక్షుడు కార్లోస్ లాగె, వెనిజులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్, బొలీవియా అధ్యక్షుడు ఇవో మొరెల్స్, హైతీ అధ్యక్షుడు రెనె ప్రివల్ ఇటీవల వెనిజులాలోని టింటోరెరోలో సమావేశమైనప్పటి చిత్రం.

**5. వామపక్షాలకు ప్రజా మద్దతు పెరుగుతోంది:** అన్నిటికీ మించి లాటిన్ అమెరికాలో జరుగుతున్న పరిణామాలు వామపక్షాలకూ, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులకూ ఎంతో స్ఫూర్తినిచ్చేవిధంగా ఉన్నాయి. మొత్తం లాటిన్ అమెరికా ఖండంలో ఇప్పటికిప్పుడు 14 దేశాల్లో వామపక్ష, వామపక్ష-మధ్యేవాద ప్రభుత్వాలను ప్రజలు ఎన్నుకున్నారు. పదేళ్ల క్రితం ఈ దేశాలన్నిటా అమెరికా అనుకూల మితవాద ప్రభుత్వాలే అధికారం చెలాయిస్తున్నాయి. వామపక్షాలు అధికారంలోకి వస్తాయన్న ఆలోచనకే ఆనాడు తావులేదు. ఇంతలోనే ఎంత మార్పు! 1998లో వెనిజులా ఎన్నికల్లో హ్యూగో చావెజ్ విజయంతో ప్రారంభమైన వామపక్ష జైత్రయాత్ర నిన్న మొన్న నికరాగువా అధ్యక్ష ఎన్నికల్లో సాండనిస్టాల నాయకుడైన డేనియల్ ఓర్టెగా విజయం వరకు కొనసాగుతూనే ఉంది. 2006 నవంబర్‌లో నికరాగువాలో జరిగిన ఎన్నికల్లో ఓర్టెగా అమెరికా అనుకూల అభ్యర్థిని ఓడించి విజయం సాధించాడు. తరువాత నెలరోజుల్లోనే వెనిజులాలో అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికల్లో హ్యూగో ఛావెజ్ మరోసారి-ఈ సారి మరింత ఎక్కువ మెజారిటీతో ఎన్నికయ్యాడు. అంతకు ముందు నవంబర్ 26న ఈక్వెడార్‌లో జరిగిన ఎన్నికల్లో సోషలిస్టు భావాలు గల రాఫెల్ కొర్రియా అధ్యక్షునిగా ఎన్నికయ్యారు. అక్టోబర్ 29 జరిగిన ఎన్నికల్లో బ్రెజిల్ అధ్యక్షుడుగా వర్కర్స్ పార్టీ నాయకుడు లూలా-డ-సిల్వా తిరిగి ఎన్నికయ్యాడు. అంతకు ముందటేడు, 2005 డిసెంబర్ ఎన్నికల్లో కొలంబియాలో మూలవాసుల ఉద్యమానికి నాయకత్వం వహించిన ఈవో మోరెల్స్ అధ్యక్షునిగా ఎన్నికయ్యాడు. 2004లో ఉరుగ్వే అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికల్లో తాబార్ వాన్‌క్విజ్ ఎన్నికయ్యారు. 180 ఏళ్లుగా ఈ దేశంలో పరిపాలన సాగిస్తూ వస్తున్న రెండు పార్టీల వ్యవస్థను తోసిరాజని వామపక్ష కూటమి విజయం సాధించడం విశేషం. 2003 నుండి అర్జెంటీనా అధ్యక్షునిగా ఉన్న నెస్టార్ క్రిచ్‌నెర్ భార్య క్రిస్టినా తాజా ఎన్నికల్లో గెలిచారు. వీరంతా వామపక్షాలకు చెందిన వారు కావడం విశేషం. ఒకప్పుడు లాటిన్ అమెరికాలో వేగుచుక్కగా ఒక్క క్యూబా మాత్రమే ఉండేది. అమెరికా పెట్టే అన్ని రకాల వేధింపు లకూ, కుట్రలకూ, కుహకాలకూ గురయ్యేది. ఇప్పుడు క్యూబాకు వెనిజులా, కొలంబియా, ఈక్వెడార్, నికరాగువా తోడయ్యాయి. ఇవన్నీ సామ్రాజ్యవాద విధానాలను ఎదిరించి బొలివేరియన్ ప్రత్యామ్నాయ కూటమిని ఏర్పాటు చేశాయి. అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించి నిలబడే విషయంలో ఈ వామపక్ష ప్రభుత్వాల్లో అనేక తారతమ్యాలున్నాయి. లూలా లాంటి

వామపక్ష వాదులు అధికారంలోకి వచ్చిన తరువాత అమెరికా ఒత్తిళ్లకు అనేక సందర్భాల్లో లొంగిపోయిన ఘటనలూ ఉన్నాయి. అయితే ఈ మొత్తం దేశాల్లో ప్రజలు నయా-ఉదార వాద విధానాలకూ, అమెరికా తమపై రుద్దిన స్వేచ్ఛా మార్కెట్టుకూ వ్యతిరేకంగా తీర్పునిచ్చే క్రమంలో ఈ వామపక్ష ప్రభుత్వాలను ఎన్నుకున్నారన్న విషయం గమనంలో ఉంచుకోవాలి.

వామపక్షాలకు ప్రజాదరణ పెరగడం అనేది లాటిన్ అమెరికాలో మాత్రమే కాదు ప్రపంచీకరణ వ్యతిరేక ప్రజాఉద్యమాలకు వామపక్షాలు నాయకత్వం వహించిన ప్రతిచోటా కనిపిస్తుంది. యూరప్‌లోని అనేక దేశాల్లో జరిగిన మున్సిపల్, సాధారణ ఎన్నికల్లో కమ్యూనిస్టులూ, వామపక్షాలూ గణనీయమైన విజయాలు సాధిస్తున్నాయి. మన దేశంలో కూడా ప్రపంచీకరణ విధానాలను మొదటినుండి వ్యతిరేకించి పోరాడుతూ వచ్చిన వామపక్షాలకు గత ఎన్నికల్లో ప్రజలు అత్యధిక స్థానాల్లో విజయం చేకూర్చిన సంగతి విదితమే. ఈ కాలంలోనే నేపాల్‌లో కమ్యూనిస్టులు ప్రధాన భాగస్వామ్యం వహించిన ఐక్య కూటమి ప్రజా తిరుగుబాటుకు నాయకత్వం వహించి, రాచరికాన్ని కూలదోసింది.

ఇవన్నీ చెప్పడమంటే సోషలిజానికి తిరిగి పూర్వ వైభవం వచ్చినట్లు కాదు. ఇప్పటికీ సోషలిజం, కమ్యూనిస్టు పార్టీలూ ఎదురుదెబ్బ కాచుకునే స్థితిలోనే ఉన్నాయి. అయితే ఇటీవలి కాలంలో జరుగుతున్న పరిణామాలు మాత్రం కమ్యూనిస్టు ఉద్యమం, వామపక్ష శక్తులూ తిరిగి కూడదీసుకుంటున్నాయన్న విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

**6. సోషలిస్టు దేశాలు అభివృద్ధి పథంలో పద్దాయి:** 1989-91 మధ్య సోవియట్, తూర్పుయూరప్ దేశాలు కూలిపోయాక ఇంకా మిగిలి ఉన్న అయిదు సోషలిస్టు దేశాలు- చైనా, వియత్నాం, క్యూబా, ఉత్తర కొరియా, లావోస్‌ల పరిస్థితి ఎలా ఉంటుందోనని పురోగామి శక్తులన్నీ ఆందోళన చెందాయి. అయితే ఈ పదిహేనేళ్ల కాలంలో ఇవి తమకు ఎదురైన ఇబ్బందులను అధిగమించడమే కాదు పురోగామి పథంలో పద్దాయి. ప్రపంచంలోనే అత్యధిక జనాభాగల సోషలిస్టు చైనా గత పదేళ్లుగా దాదాపు పది శాతం అభివృద్ధితో పురోగమి స్తోంది. ఆర్థిక రంగంలోనే కాదు శాస్త్ర, సాంకే తిక రంగంలో కూడా అది అగ్రరాజ్యాలను సవాలు చేయగలుగుతోంది. ఒకప్పుడు లాటిన్ అమెరికాలో ఒంటరి పోరాటం చేసిన క్యూబాను నేడు అనేక దేశాలు ఆదర్శంగా తీసుకుం టున్నాయి. 80 ఏళ్లు దాటిన క్యూబానేత ఫైడల్ కాస్ట్రో నేటికీ లాటిన్ అమెరికా ప్రజలకే కాదు ఎన్నికైన నేతలకు కూడా స్ఫూర్తి నిస్తూ ఉన్నారు.

ప్రపంచ యవనికపై జరుగుతున్న ఈ సానుకూల మార్పులన్నీ చెబుతున్న దొకటే "సోషలిజం అజేయం. పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద వ్యవస్థ ప్రజల సమస్యలు పరిష్కరించ లేదు. సోషలిజంతోనే వాటికి పరిష్కారం లభిస్తుంది." సోవియట్, తూర్పుయూరప్‌లో పెట్టుబడిదారీ వ్యవస్థలు కుప్పకూలిన తరువాత మార్క్సిస్టు పార్టీ చేసిన విశ్లేషణ, పార్టీ సీనియర్ నేతలు చేసిన ప్రకటనలూ నిజమని ఈ పరిణామాలన్నీ రుజువు చేస్తున్నాయి.

**కొనసాగుతున్న అమెరికా ఆధిపత్య ప్రయత్నాలు**

అమెరికా ఆధిపత్యానికి అన్నివైపులనుండి ప్రతిఘటన ఎదురవుతున్నదంటే అర్థం ప్రపంచం పై దాని ఆధిపత్యంగానీ, మరింత ఆధిపత్యం కోసం దాని ప్రయత్నాలుగానీ అంతమైనాయని కాదు. నిజానికి ప్రతిఘటన పెరుగుతున్నకొద్దీ తన ఏకధ్రువ ప్రపంచాధిపత్యాన్ని కాపాడుకోడానికి అమెరికా మరింత బరితెగించి ప్రయత్ని స్తోంది. 9/11 ఉగ్రవాద దాడులను సాకుగా తీసుకుని 'ఉగ్రవాదంపై ప్రపంచవ్యాపిత యుద్ధం' అనే వ్యూహాన్ని అమెరికా అధ్యక్షుడు ప్రకటించడం ఈ ప్రయత్నాల్లో భాగమే. ఉగ్రవాదం ఎక్కడున్నా ముందస్తు హెచ్చరిక లేకుండా దాడి చేసే హక్కు తమకు ఉందని అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్ ప్రకటించాడు. కాని ఎవరినైనా, ఏ సంస్థనైనా ఉగ్రవాదిగా ప్రకటించేది ఎవరు? అమెరికానే. అంటే ప్రపంచంలో తన ఆధిపత్యాన్ని ఎక్కడ, ఎవరు వ్యతిరేకించినా వారిని అమెరికా ఉగ్రవా దిగా ప్రకటిస్తుంది. ముందస్తు హెచ్చరిక లేకుండా దాడి చేస్తుంది. ఇదే విధానం ఆధారం గానే అది తాలిబాన్లను మట్టుబెట్టే నెపంతో ఆఫ్ఘనిస్థాన్‌పై దాడి చేసింది. సద్దాం హుస్సేన్ మారణాయుధాలు దాచిపెట్టాడని, ఉగ్రవాదులకు మద్దతిస్తున్నాడనీ సాకుచెప్పి ఇరాక్‌పై దాడి చేసింది. ఇప్పుడు ఇరాన్‌పై ఇదే మిషతో దాడికి ప్రయత్నిస్తోంది. ఇరాన్ ఉగ్రవాద దేశం గనుక దానితో ఏ దేశమూ స్నేహ సంబంధాలు పెట్టుకోరాదని హుకుంలు జారీచేస్తోంది. ఇదే సాకుతో భారత్- పాక్-ఇరాన్ గ్యాసుపైపు లైను నిర్మాణాన్ని అమెరికా అడ్డుకుంటోంది.

అమెరికా విధానాలకు అడ్డుచెప్పే దేశాల్లో ప్రభుత్వాలను మార్చడానికి సామదాన బేధ దండోపాయాలన్నిటినీ ఉపయోగిస్తోంది. మాజీ సోవియట్ రిపబ్లిక్కులలో అమెరికా అనుకూల స్వచ్ఛంద సంస్థలను ఉపయోగించుకుని అల్లర్లు రేపింది. 'కలర్ రివల్యూషన్స్' పేరుతో అనేక దేశాల్లో ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ఆందోళనలకు పురిగొల్పి తనకు అనుకూలమైన ప్రభుత్వాలను ప్రతిష్ఠించింది. తన మాట వినని దేశాలను 'ధూర్త దేశాలు'గా ప్రకటించి బెదిరింపులకూ, ఆంక్షలకూ పాల్పడుతోంది. తన ఆధిపత్యానికి వ్యతిరేకంగా నిలబడ్డ చైనా-రష్యాలకు వ్యతిరేకంగా సైనిక కూటములను కడుతోంది. నాటో కూటమిలోకి మరిన్ని దేశాలను చేర్చుకుని రష్యా సరిహద్దులవరకు దాన్ని విస్తరించడం, చైనాకు వ్యతిరేకంగా జపాన్, ఆస్ట్రేలియా, సింగపూర్‌లతో కూటమిని ఏర్పాటు చేయడం ఇందులో భాగమే. భారత దేశాన్ని కూడా అమెరికా ఈ కూటమిలోకి లాగుతోంది. ఇటీవల బంగాళా ఖాతంలో జరిగిన అమెరికా-ఆస్ట్రేలియా-జపాన్-సింగపూర్-భారత్ నౌకాదళ విన్యాసాలు ఈ ప్రయత్నాల్లో భాగమే. దురదృష్టమేమంటే అమెరికా రూపొందించిన ఈ ప్రపంచాధిపత్య సైనిక వ్యూహంలో భారత దేశాన్ని అమెరికాకు జూనియర్ భాగస్వామిగా చేయడానికి భారత పాలక వర్గాలు ప్రయత్నిస్తున్నాయి.

మొత్తం మీద తన ఏకధ్రువ ప్రపంచాధిపత్యానికి అన్నివైపులనుండి ప్రతిఘటన ఎదురవుతుండడంతో అమెరికా మరోమారు ప్రపంచాన్ని సోవియట్ కాలం నాటి 'ప్రచ్ఛన్న యుద్ధం' వైపుకు తీసుకుపోతోంది. జాతీయ క్షిపణి రక్షణ వ్యవస్థలతో సహా కొత్త కొత్త ఆయుధాలకు రూపకల్పన చేస్తోంది. అంతరిక్షాన్నీ, సముద్రాలనూ మరోమారు ఆయుధమయం చేస్తోంది. కొత్త కొత్త సైనిక కూటములు నిర్మిస్తోంది. ఈ ప్రయత్నాలను అడ్డుకోకపోతే ప్రపంచాన్ని అది మరో యుద్ధంవైపు నడిపించే ప్రమాదం ఉంది. అందువల్ల సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించాల్సిన అవసరం ఎన్నటికన్నా నేడు ఎక్కువగా ఉంది. అందులోనూ భారత దేశాన్ని సామ్రాజ్యవాద బంటుగా మార్చడానికి మన పాలక పక్షాలు చేస్తున్న ప్రయత్నాలు దేశాన్నీ, ప్రజలనూ మరింత ప్రమాదంలోకి నెడుతున్న తరుణంలో సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాఉద్యమం నిర్మించాల్సిన అవసరం మరింతగా మన ముందుకొచ్చింది. 

# 21వ శతాబ్దం సోషలిజానిదే

## అక్టోబర్ విప్లవ 90వ వార్షికోత్సవ తీర్మానంలో గ్రీస్ కమ్యూనిస్టు పార్టీ విశ్లేషణ

"21వ శతాబ్దంలో విప్లవ శక్తులు తిరిగి కూడదీసుకుంటాయి. అంతర్జాతీయ పెట్టుబడి దాడిని తప్పికొట్టడం జరుగుతుంది. నిర్ణయాత్మకమైన ఎదురుదాడి ప్రారంభమవుతుంది. ప్రపంచ విప్లవోద్యమంలో ఇది ఖచ్చితంగా కొత్త పెరుగుదలను చూసే, కొత్త రకం సామాజిక విప్లవాలను చూసే శతాబ్దం అవుతుంది"

అక్టోబరు మహా విప్లవ 90వ వార్షికోత్సవాల సందర్భంగా ఆ విప్లవ యోధులకు గ్రీస్ కమ్యూనిస్టు పార్టీ (కెకెఇ) నివాళులు అర్పిస్తోంది. అక్టోబర్ విప్లవ బోధలు గ్రీస్ కమ్యూనిస్టు పార్టీ పోరాటలకు నిరంతర మార్గదర్శిగా వుంటాయి. అక్టోబరు విప్లవం కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్‌ల మొదటి ఇంటర్నేషనల్, రెండవ ఇంటర్నేషనల్, వీరోచిత పారిస్ కమ్యూన్‌ల గురించి కమ్యూనిస్టులకు గుర్తు చేస్తుంది. తొలి కార్మిక వర్గ విప్లవంగా పేరొందిన పారిస్ కమ్యూన్ నింగివైపు వేసే ఒక పెద్ద ముందడుగు లాంటిది. అయితే అనుభవ రాహిత్యం వల్ల దానిని కార్మికవర్గం సంఘటితం చేసుకోలేకపోయింది. 'ప్రపంచ కార్మికులారా ఏకం కండు' అని నినదించింది. మూడో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అనగానే మనకు రెడార్మీస్ గుర్తుకొస్తాయి. ఈ ఇంటర్నేషనల్ కు కేంటన్, బెర్లిన్, స్పెయిన్, హంగరి, ఇంకా ప్రపంచంలోని అన్ని కార్మిక కేంద్రాల నుండి ప్రతినిధులు హుజరయ్యారు.

అక్టోబరు మహా విప్లవ విశిష్టత ఏమిటంటే కార్మికవర్గ చారిత్రక కర్తవ్యం వాస్తవ రూపం దాల్చుడాన్ని స్త్రీ, పురుష కమ్యూనిస్టులం దరూ కళ్ళారా చూశారు. మార్క్స్, ఎంగెల్స్ రాసిన కమ్యూనిస్టు మ్యానిఫెస్టోలో పేర్కొన్న దానిని నిజం చేసిన మహత్తర ఘటనగా భావించారు. బూర్జువాలతో అన్ని వర్గాలు తలపడినప్పటికీ కార్మిక వర్గం మాత్రమే నిజమైన విప్లవకర వర్గమని తెలుసుకున్నారు. ఇతర వర్గాలు తెరమరుగు కావడమో, బడా పరిశ్రమ వీటిని తుడిచిపెట్టేయడమో జరిగింది. పరిశ్రమ సృష్టించిన అత్యంత విలక్షణమైన ఉత్పత్తే కార్మికవర్గం. సోషలిస్ట్ విప్లవానికి ముందుండి దారిచూపే ఏజెంటుగా కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన తిరుగులేని పాత్రను అక్టోబరు విప్లవం చాటిచెప్పింది. రాజీపడే సోషలిస్ట్ డెమొక్రటిక్ పార్టీల్లా కాకుండా కమ్యూనిస్టు పార్టీ ఓ వినూత్న తరహాకు చెందినదని రుజువు చేసింది. కార్మికవర్గ అంతర్జాతీయత బలాన్ని చాటి చెప్పింది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం కోసం ప్రాణాలను సైతం తృణప్రాయంగా అర్పించిన లక్షలాది మంది అమర వీరుల, కార్మిక వర్గ చరిత్రలో తిరుగులేని విప్లవకారుల, చరిత్ర నిర్మాతలైన స్త్రీ, పురుష కార్మికుల, పేద రైతుల సాక్షిగా అక్టోబరు విప్లవ స్ఫూర్తిని మేము ముందుకుగొనిపోవడానికి కట్టుబడి వున్నాము. వారి ఆదర్శం మానవాళి ఉనికిని తిరుగులేని రీతిలో చాటి చెప్పడమే కాదు, ప్రజలను చైతన్యవంతుల్ని చేయడం, కమ్యూనిస్టుల, సామాన్య ప్రజానీకం యొక్క ఘనమైన వారసత్వాన్ని లోకానికి తెలియజేసింది.

అక్టోబరు విప్లవం ఇరవయ్యో శతాబ్దిలో సంభవించిన ఒక మహత్తర చారిత్రాత్మక ఘట్టంగా కలకాలం నిలిచివుంటుంది. దీనికి కొన్ని దశాబ్దాల ముందు ఐరోపాను ఆవహించిన 'కమ్యూనిస్టు భూతం' చివరికి (కార్మికవర్గం) అధికారం చేపట్టింది. అక్టోబరు విప్లవం విజయవంతం కావడంతో మానవాళి మనుగడ కోసం పోరాడే కాలం నుంచి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం ఉద్యమించే దిశగా ముందుకు సాగేందుకు మార్గం సుగమమైంది.

"మేము ఈ బృహత్తర కర్తవ్యాన్ని ప్రారంభించాము. ఇది ఎప్పటికి పూర్తవుతుంది? ఏ దేశ కార్మికవర్గం దీనిని విజయవంతం చేస్తుంది? అన్నది అంత ముఖ్యం కాదు. ఇక్కడ చూడాల్సిన ముఖ్యమైన అంశమేమిటంటే మంచుగడ్డ బద్దలైంది. రోడ్డు తెరచుకుంది. గమ్యం స్పష్టంగా వుంది" అని లెనిన్ అన్నమాటలను ఈ సందర్భంగా గుర్తు చేసుకోవాలి.

అక్టోబరు విప్లవం అనేది అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ పురోభివృద్ధికి దివిటీ వంటిది. అది విరజిమ్మే మంటల్లోంచి అనేక కమ్యూనిస్టు పార్టీలు పుట్టుకొచ్చాయి. గ్రీస్ కమ్యూనిస్టు పార్టీ కూడా ఆ విధంగా వచ్చినదే. పెట్టుబడి ఒక అంతర్జాతీయ శక్తిగా అవతరించడం, రెండవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్మికవర్గ ప్రయోజనాలకు ద్రోహం చేయడం వల్ల మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ (1919-1943)ను ఏర్పాటు చేయాల్సిన అవసరం ఏర్పడింది.

1917 అక్టోబర్ విప్లవంతో ఏర్పడిన సోషలిస్టు వ్యవస్థకు తనకు పక్కలో బల్లెంలా ఉంటుందని అంతర్జాతీయ పెట్టుబడి భావించింది. అక్టోబరు సోషలిస్టు విప్లవం పుణ్యమా అని హక్కులు నెలకొల్పుకునేందుకు సానుకూల వాతావరణమేర్పడింది. కార్మికవర్గం

శిరసెత్తుకుని నిలిచింది. అత్యంత అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల్లో సైతం ఈ పరిస్థితి ఏర్పడింది.

సోవియట్‌యూనియన్‌లో కార్మికులు, కర్షకులు సాధించిన ఫలితాలు పెట్టుబడి దారీ దేశాల్లోని కార్మికవర్గానికి ఎంతో ప్రేరణనిచ్చాయి. బూర్జు పాలక పార్టీలు, ఉదారవాదులు, సోషల్ డెమొక్రాట్లు కార్మిక వర్గానికి అయిష్టంగానైనా రాయితీలు ఇవ్వడానికి అంగీకరించడానికి కూడా ఇదే మూల కారణం. అక్టోబరు విప్లవం పాత ప్రపంచం పునాదులనే కదిలించివేసింది. వలసవాదానికి వ్యతిరేకంగా సాగిన పోరాటాలకు ఇది వెంటనే ఊపిరులూదింది. ఇక అప్పటి నుంచి అమానుష ప్రభుత్వాలు కూలిపోనారంభించాయి. అక్టోబరు విప్లవ స్ఫూర్తితో విమోచనోద్యమాలు ఎప్పుడైతే ఊపందుకున్నాయో అప్పటి నుండి అదో ప్రపంచ సంస్కృతిలా మారింది. కళలు, సాహితీ రంగాలపై కూడా ఇది ఎనలేని ప్రభావం చూపింది. అక్టోబరు విప్లవం ఇచ్చిన స్ఫూర్తితో ప్రపంచ వ్యాపితంగా గల ప్రముఖ కళాకారులందరూ విప్లవాత్మక కార్మిక ఉద్యమంలో చేరారు. ఉద్యమాభివృద్ధికి తమ వంతు తోడ్పాటునందిస్తూ, ఆశయాలను ప్రచారం చేస్తూ అంతర్జాతీయ కార్మికవర్గాన్ని ముందుకు తీసుకుపోయేందుకు పాటుపడ్డారు.

1989-91 మధ్య కాలంలో ప్రతీఘాత విప్లవాలు వచ్చినా మన యుగంలో పెట్టుబడిదారీ వ్యవస్థ నుండి సోషలిజానికి సాగే పరివర్తనా క్రమాన్ని అవి ఆపలేవు. ఈ క్రమం ప్రారంభానికి అక్టోబరు విప్లవం ఒక చిహ్నంగా వుండిపోతుంది.

సోషస్టు కమ్యూనిస్టు వ్యవస్థ ఒక ఊహ మాత్రమేనని చేసిన వాదనలో ఏమాత్రం పసలేదని చారిత్రిక పరిణామాలు రుజువు చేశాయి. మానవాళి చరిత్ర అంతా పరిశీలిస్తే ఏ సామాజిక- ఆర్థిక వ్యవస్థ కూడా ఒకేసారి సంఘటితం కాలేదు. పెట్టుబడిదారీ వ్యవస్థ సైతం భూస్వామ్య వ్యవస్థతో పోరాటం వల్లే ఆవిర్భవించిందనే విషయం మరువరాదు. చరిత్ర ముగింపు దశకు చేరుకుంటోందని బూర్జువా వర్గ రాజకీయ ప్రతినిధులు చెబుతున్న దానికి భిన్నంగా సమాజం ముందుకు సాగుతోంది. సోషలిజం ఆవశ్యకత ఇప్పటికీ వుంది. అది నేడు కాకపోతే రేపైనా వస్తుంది.

సోషలిజం ఆవశ్యకత, అది ఎప్పుడు వస్తుందనేది పెట్టుబడిదారీ వ్యవస్థలోని వైరుధ్యాలపై ఆధారపడి వుంటుంది. మానవాళి అత్యున్నతమైన సామాజిక, ఆర్థిక వ్యవస్థకు పరివర్తన చెందేందుకు అవసరమైన భౌతిక పరిస్థితులను పెట్టుబడిదారీ వ్యవస్థే సమకూర్చుతుందనేది కాదనలేని సత్యం. అయితే పెట్టుబడి దారీ వర్గం దూకుడుగా సాగేందుకు ఆస్కారమిస్తున్న ప్రస్తుత వర్గ శక్తుల పొందిక వల్ల ఈ పరివర్తనా క్రమంలో నేడు కొంత జాప్యం జరగవచ్చు.

సోషలిజం దిశగా పరివర్తన సాగించాల్సిన అవసరాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థ తనకుతానుగానే సృష్టిస్తుంది. కార్మిక శ్రమ, ఉత్పత్తి సామాజికమైనప్పుడు అవి అసాధారణమైన స్థాయికి చేరుకుంటాయి. ఈ ప్రైవేట్, పెట్టుబడిదారీ ఆస్తి అంతా సామాజికంగా సంఘటితంగా వున్న శ్రామికవర్గం సృష్టించినదే. వర్తమాన పెట్టుబడిదారీ సమాజాల్లో తలెత్తుతున్న అన్ని సంక్షోభాలకు ఈ వైరుధ్యమే మూలం. అదేసమయంలో పరిష్కారాన్ని కూడా ఇదే చూపిస్తుంది. ఉత్పత్తి శక్తుల అభివృద్ధి స్థాయికి అనుగుణంగా ఉత్పత్తి సంబంధాలను మార్చాల్సి పరిస్థితులు కల్పిస్తుంది. కేంద్రీకృతమైన ఉత్పత్తి సాధనాలపై ప్రయివేటు యాజమాన్యాన్ని రద్దుచేసి వాటిని సమాజపరం చేయమంటుంది. సామాజిక సంపదను సృష్టించేవారి ప్రయోజనాలకు అనుగుణంగా సోషలిస్టు అధికారం ఈ సాధనాలను ప్రణాళికా బద్ధమైన సామాజిక ఉత్పత్తికి ఉపయోగించుకోవాలంటుంది.

అక్టోబర్ విప్లవాన్ని సద్వినియోగం చేసుకునే వాస్తవ పరిస్థితులు లేవనే వాదనలు కేవలం కల్పిత కథలు, లేకుంటే వాస్తవాన్ని అశాస్త్రీయంగా పరిశీలిస్తే వచ్చినవి మాత్రమే.

రష్యాలో అప్పటికే సామ్రాజ్యవాద దశకు చేరుకున్న పెట్టుబడిదారీ సమాజంలో అక్టోబరు విప్లవం జయప్రదమైంది. అయితే రష్యాలో పెట్టుబడిదారీ అభివృద్ధి అసమంగా ఉన్నది. అలానే జారిస్టు సామ్రాజ్యంలోని అత్యధిక భాగంలో పెట్టుబడిదారీ పూర్వ వారసత్వం కొనసాగుతున్నది. అయినప్పటికీ పైన పేర్కొన్న వాస్తవం చెరగిపోదు. రష్యాలో సోషలిస్టు పరివర్తనకు అవసరమైన భౌతిక పరిస్థితులు ఉన్నాయన్న విషయాన్ని ఆ కాలానికి చెందిన గణాంక వివరాలు తెలియ చెప్తున్నాయి. రష్యన్ పారిశ్రామిక కార్మిక వర్గంలో సోవియట్లు నెలకొన్నాయి. అధికారం కోసం సాగిన విప్లవ పోరాటంలో ఇవే కేంద్రాలుగా మారాయి.

శ్రామికవర్గ సంఘటిత శక్తిలో బోల్షివిక్కులకు అపారమైన విశ్వాసం ఉన్నది. ప్రజలను పోరాటంలోకి ఆకర్షించి వారికి నాయకత్వం వహించింది బోల్షివిక్ పార్టీ. ప్రజల విప్లవ చొరవ నుంచి, సంస్థల నుంచి పార్టీ గుణపాఠాలను తీసింది. వర్గపోరాటం తీవ్రతరమైనపుడు ఈ సంస్థలు ఆవిర్భవించాయి. అదే సమయంలో ప్రజల చొరవను మరింత చైతన్యయుతమైన స్థాయికి పార్టీ తీసుకు వెళ్ళింది.

వర్గపోరాటం అనేది చరిత్రలో 'మంత్రసాని పాత్ర' నిర్వహిస్తుందని, అదే విధంగా ఇప్పటి వరకూ జరిగిన చరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్ర అని కారల్‌మార్క్స్ చెప్పిన మాటలు నిజమని రుజువైంది. స్పార్టకస్ నాయకత్వంలోని బానిసలు చేసిన పోరాటం, మధ్యయుగాల్లో రైతాంగ తిరుగుబాట్లు, మహోజ్వలమైన బూర్జువా విప్లవాలు, అన్నిటినీమించి ఫ్రెంచ్ విప్లవం అడుగుజాడల్లోనే అక్టోబర్ విప్లవం కూడా సాగిపోయింది. అక్టోబర్ విప్లవ విజయం శాస్త్రీయ సోషలిస్టు-కమ్యూనిస్టు సిద్ధాంత అధికత్వను నిరూపించింది. 19వ శతాబ్దంలో మానవ మేధస్సు ముందుకు తీసుకొచ్చిన సిద్ధాంతాలన్నిటికన్నా మార్క్సిజం గుణాత్మకంగానే విభిన్నమైనది. ఇంగ్లీషు రాజకీయ అర్థశాస్త్రం, జర్మన్ తత్వశాస్త్రం, ఫ్రెంచ్ ఊహాజనిత సోషలిజంవంటి సామాజిక శాస్త్రాలకన్నా మార్క్సిస్టు సిద్ధాంతం ఎంతో అభివృద్ధి చెందింది.

బూర్జువా విప్లవాలకు స్ఫూర్తినిచ్చి మార్గదర్శకత్వం వహించిన శాస్త్రీయ భావజాలం మరుగున పడింది. బూర్జువావర్గం పురోగమన వర్గంగా కాక అభివృద్ధి నిరోధక వర్గంగా మారటమే ఇందుకు కారణం. శ్రామికవర్గం సాగించే ఆర్థిక, రాజకీయ, సైద్ధాంతిక పోరాటాన్ని ఏకముఖ పోరాటంగా బోల్షివిక్కులు భావించారు. అగ్రగామి సిద్ధాంతాలు స్వీకరించిన పార్టీ మాత్రమే అగ్రగామి పోరాటంలో నిలబడగలదన్నది లెనినిస్టు సూత్రం. సోషలిస్టు-కమ్యూనిస్టు భావజాలాన్ని విప్లవ కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధి పరిచి శ్రామికవర్గంలో వ్యాపింప చేసింది. వారిని అగ్రగామి దళంగా సంఘటిత పరిచింది. కనుకనే కమ్యూనిస్టు పార్టీ ఆవశ్యకతను నొక్కిచెప్పవలసి వస్తోంది. బూర్జువా

భావజాలంతోనూ, అదే విధంగా రకరకాలైన అవకాశవాద, సంస్కరణ సిద్ధాంతాలతోనూ జరిపిన పోరాటంలో సోషలిస్టు విప్లవ సిద్ధాంతం ఆవిష్కృతమైంది. సంస్కరణల ద్వారా శ్రామికవర్గ పరిస్థితులలో మార్పురాక పోవటానికిగల కారణాలను ఈ సిద్ధాంతం శాస్త్రీయంగా నిరూపించింది.

బోల్షివిక్ పార్టీని స్థాపించిన (1903) తర్వాత లెనిన్ అనుచరులకూ, అవకాశవాదులకూ మధ్య అనేక సంవత్సరాల పాటు భీషణ పోరాటం జరిగింది. నిబంధనల మేరకు పార్టీ సభ్యులకు హక్కులను, బాధ్యతలను కల్పిస్తూ మొట్టమొదటి సారిగా రాజకీయ చరిత్రలో బోల్షివిక్ పార్టీ ఉనికిలోకి వచ్చింది. కేంద్రీకృత ప్రజాస్వామ్యం ఈ పార్టీ కీలకసూత్రంగా ఉంది. అదే విధంగా స్వతంత్ర అభిప్రాయాలను కలిగివుంటూ విమర్శించే హక్కు, ఒకసారి నిర్ణయాన్ని తీసుకున్న తర్వాత దాన్ని ఉమ్మడిగా ఆచరించటం, శ్రామిక ప్రజలతో బలమైన సంబంధాలను కలిగి ఉండటం, అంతర్గత ప్రజాస్వామ్యం, ఆత్మవిమర్శ అనేవి పార్టీ ప్రధాన లక్షణాలుగా ఉన్నాయి.

లెనిన్ నాయకత్వంలో బోల్షివిక్‌పార్టీ సమగ్ర సిద్ధాంతం కలిగిన పార్టీగా రూపుదిద్దుకున్నది. సామాజిక-రాజకీయ శక్తులను అంచనా వేయటం, వ్యూహాత్మక లక్ష్యానికి దూరం కాకుండానే రాజకీయ సర్దుబాట్లు చేసుకోవటం, ఉద్యమావసరాలకు అనుగుణమైన నినాదాలను ఇవ్వగలగటం ఈ పార్టీ విశిష్టతలు. మొదటి ప్రపంచయుద్ధ కాలంలో బోల్షివిక్కులు చేపట్టిన విధానాలు విప్లవ విజయానికి దారితీసిన వాటిలో ప్రధాన పాత్రను నిర్వహించాయి. ఈ యుద్ధం, సామ్రాజ్యవాదుల యుద్ధం. మార్కెట్లను పునఃపంపిణీ చేసుకోవటం, వలసలను విస్తరించటం ఈ యుద్ధ లక్ష్యాలు. రష్యన్ సమాజంలోని అన్ని వైరుధ్యాలనూ ఈ యుద్ధం తీవ్రతరం చేసింది. ప్రజల జీవితాలు దిగజారిపోయాయి. శ్రామికవర్గాన్ని దోపిడీ చేస్తూ లక్షలాది రైతులను అధోగతికి నెట్టివేసే దేశీయ విధానాలకు, యుద్ధ లక్ష్యాలకూ తేడా లేదన్న విషయాన్ని ప్రజలు అర్థం చేసుకున్నారు.

ఇదిలా ఉండగా రెండవ ఇంటర్నేషనల్ నాయకత్వం యుద్ధంయొక్క సామ్రాజ్యవాద స్వభావాన్ని మరుగుపరుస్తూ 'మాతృభూమి రక్షణ' అన్న నినాదాన్ని ఇచ్చింది. ఆరకంగా ప్రపంచ వ్యాప్తంగాగల కార్మికవర్గంలో చీలికలు



**1917 అక్టోబర్ విప్లవం సందర్భంగా వింటర్ ప్యాలేస్ ముట్టడి: నిజానికి ఈ ముట్టడి రాత్రి పూట జరిగింది. పై ఫోటోలోని దృశ్యం 1920లో అక్టోబర్ విప్లవ 3వ వార్షికోత్సవం సందర్భంగా ఆనాటి ఘటనలు ఎలా జరిగాయో చూపిస్తున్నపుడు తీసిన ఫోటో.**

తెచ్చింది. 'జాతీయ' బందిపోట్లయిన బూర్జువా వర్గాన్ని రక్షకునిగా చిత్రించింది. తద్విరుద్ధంగా బోల్షివిక్కులు యుద్ధాన్ని ఖండించారు. సామ్రాజ్యవాద యుద్ధాన్ని పాలకవర్గాలను కూలదోసే యుద్ధంగా మార్చాలని వారు వాదించారు. వర్గదోపిడీ, సామ్రాజ్యవాదుల అణిచివేత వైదొలగినప్పుడే శాంతి స్థాపనకు మార్గం ఏర్పడగలదని వారు చెప్పారు. దుర్భరమైన ప్రజల జీవన పరిస్థితులు సోషలిస్టు విప్లవానికి మార్గాన్ని సుగమం చేశాయి. విప్లవానికి ఈ క్రింది పరిస్థితులు అత్యావశ్యకమని లెనిన్ నొక్కిచెప్పాడు.

1. ఎలాంటిమార్పూ లేకుండా పరిపాలనను సాగించటంలో పాలకవర్గాల అశక్తత.....విప్లవం జయప్రదం కావాలంటే 'దిగువస్థాయి వర్గాలు యిచ్చ' మాత్రమే చాలదు. గతంలోవలె జీవించలేని అశక్తత పైస్థాయి వర్గాల్లో ఉండాలి.

2. అణగారిన వర్గాల దారిద్ర్య దైన్యాలు అంతకముందు కన్నా తీవ్రతరం కావాలి.

3. పైన చెప్పిన కారణాల రీత్యా ప్రజల కార్యకలాపాల్లో గణనీయమైన పెరుగుదల ఉండాలి.

యుద్ధం ముగిసిన తర్వాత, విప్లవ ప్రజానీకాన్ని, 1917 ఫిబ్రవరిలో అధికారాన్ని చేపట్టిన బూర్జువాల యొక్క ప్రభావానికి బోల్షివిక్కులు విడిచిపెట్టలేదు. వారిని అక్టోబర్ విప్లవ దిశలో నడిపించారు. 1917 ఫిబ్రవరి -అక్టోబర్ మాసాల మధ్య ఏర్పడిన ప్రభుత్వంలో వారు భాగస్వాములు కాలేదు. విప్లవ పరిస్థితిని నిలబెట్టడానికేగాక సోవియట్లలోని బలాబలాల పొందికలో మార్పు తీసుకుని వచ్చే వైరుధ్యాలను కమ్యూనిస్టులు అవకాశంగా మలచుకున్నారు. ఏ సమస్యల పరిష్కారం కోసమైతే కోట్లాది ప్రజలు జీవన్మరణ పోరాటం సాగిస్తున్నారో, ఆ సమస్యలను కెరెన్‌స్కీ బూర్జువా ప్రభుత్వం పరిష్కరించ లేకపోయింది. 'అన్ని అధికారాలూ సోవియట్లకే' అన్న నినాదం శ్రామిక ప్రజలను ఆకట్టుకుంది. బూర్జువా సైన్యంలోని ఒకభాగం కూడా దీని వైపు ఆకర్షితమైంది. అభ్యుదయ నిరోధకులైన అధికారులను తొలగించి వారిస్థానంలో విప్లవకారులను. సైనికులు ఎన్నుకున్నారు.

సామ్రాజ్యవాద వ్యవస్థలో బలహీనమైన లింకు అన్న లెనిన్ సిద్ధాంతం సత్యమని పూర్తిగా రుజువైంది. సోషలిస్టు విప్లవం కొన్ని దేశాల్లో లేదా ఒకే ఒక దేశంలో విజయవంతం కావటానికి అవకాశాలున్నాయన్న వాస్తవం ముందుకు వచ్చింది. సోవియట్ల పునాదిపై ఆధారపడి ఉనికిలోకి వచ్చిన శ్రామికవర్గ నియంతృత్వ ప్రభుత్వం, పురాతన ప్రభుత్వ యంత్రాంగాన్ని తోసిపుచ్చింది. ప్రజాస్వామ్యానికి ప్రాతిపదిక సొంత ఆస్తియా?

లేక సొంత ఆస్తిని రద్దు చేసే పోరాటమా?....... స్వేచ్ఛా, సమానత్వాలు కార్మికులకు, కార్మికవర్గానికా? లేక పీడకవర్గానికా?..... ఇదే మన నినాదం అని లెనిన్ స్పష్టం చేశాడు. కార్మికవర్గ నియంతృత్వం అంటే దోపిడీదారులకు వ్యతిరేకంగా హింసాకాండను సాగించటం కానేకాదు. విదేశీ సైనికుల జోక్యం, దేశీయ బూర్జువా కుట్రలు అంతర్గత కలహాలు వగైరాలకు వ్యతిరేకంగా నూతన సోవియట్ ప్రభుత్వం ముందుకు పోవాల్సి వచ్చింది. బూర్జువాలూ, అవకాశవాదులూ ఉన్మత్తంగా వ్యవహరిస్తున్నారంటే అదేమీ యాదృచ్ఛికం కాదు. ఈనాటికి కూడా కమ్యూనిస్టు పోరాటాన్ని అగౌరవ పరిచేటందుకుగానూ వారు 'స్టాలిన్ వ్యతిరేక' పోరాటాన్ని సాగిస్తున్నారు.

'శాశ్వత విప్లవం' అంటూ ట్రాట్స్కీ ముందుకు తీసుకువచ్చిన సిద్ధాంతానికి విరుద్ధంగా ఒకే దేశంలో సోషలిజాన్ని నిర్మించటం సాధ్యమేనన్న సిద్ధాంతంపై పార్టీ కార్యకలాపాలు ఆధారపడ్డాయి. శ్రామికవర్గ ఐక్యతపైనా, పేద రైతులతో పొత్తుపైనా పార్టీ ఆధారపడింది. ఈ పరిస్థితులే లేకుంటే సోషలిస్టు పారిశ్రామిక అభివృద్ధి, సమష్టి వ్యవసాయ ఉత్పత్తులూ సాధ్యం కావు. సోషలిజం నిర్మాణంలో స్టకనోవైట్ ఉద్యమం అగ్రభాగాన నిలచింది. ఈ ఉద్యమంలో లక్షల సంఖ్యలో విప్లవకారులు చేరారు. నూతన సమాజానికి చెందిన సారవంతమైన పొర యిది. దీనంతటికీ మనం అభినందనలు చెప్పవలసిందే. సామ్రాజ్యవాదులు తీసుకు వచ్చిన రెండవ ప్రపంచ యుద్ధం నాటికి సోవియట్ యూనియన్ బ్రహ్మాండమైన ఆర్థిక, సైనిక శక్తిగా రూపొందింది.

రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిస్టులకు వ్యతిరేకంగా విజయాన్ని సాధించటంలో సోవియట్ కీలకమైన పాత్ర పోషించింది. తమ దేశంపైకి దండెత్తి వచ్చిన జర్మనీ, దాని మిత్రుల సైనిక యంత్రాంగాన్ని సోవియట్ యూనియన్ తుత్తునియలు చేసింది. జర్మన్ దళాల దురాక్రమణ నుంచి ఐరోపాలోని పలు దేశాలను సోవియట్ విముక్తి చేసింది. మాతృభూమి కోసం జరిగిన ఈ పోరాటంలో రెండు కోట్ల మంది సోవియట్ పౌరులు ప్రాణ త్యాగం చేశారు. దాదాపు కోటిమంది క్షతగాత్రులయ్యారు. ఎర్రసేన విజయాన్ని సాధించటంతో . జాతీయ విముక్తి పోరాటాలకూ, ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమాలకు మంచి ఊపు వచ్చింది. ఈ పోరాటాలలోనూ, ఉద్యమాలలోనూ కమ్యూనిస్టు పార్టీలు అగ్రభాగాన నిలచాయి. రెండవ ప్రపంచ యుద్ధంలో స్టాలిన్‌గ్రాడ్ పోరాటం చాలా కీలకమైనది. అక్ష రాజ్యాలకు (జపాన్–జర్మనీ–ఇటలీ ఫాసిస్టు రాజ్యాలకు) నష్టం వాటిల్లింది.

ఆఫ్ఘనిస్థాన్, అంగోలా, కాంబోడియా, దక్షిణ యెమెన్, ఇథియోపియావంటి అనేక దేశాలకు సోవియట్ సహాయాన్ని అందచేసింది. సోవియట్‌తో పాటు వార్సా సంధి దేశాలు కూడా ఎంతగానో సహాయపడ్డాయి. యుద్ధాలకూ, వందలాది స్థానిక ఘర్షణలకూ కారణమైన సామ్రాజ్యవాదం రగిలించిన ఉద్రిక్తతలను తొలగించి శాంతి కోసం సోవియట్ ఎంతగానో కృషి చేసింది. అణ్వస్త్రాలను తొలగించటానికి లేదా రద్దు చేయటానికి, అదేవిధంగా కొత్తవి తయారు చేయకుండా ఉండేటందుకూ సోవియట్ యూనియన్ అనేక ప్రతిపాదనలు చేసింది. కాని పెట్టుబడిదారీ దేశాల జగడాల మారి వైఖరి కారణంగా ఇవేవీ ఫలప్రదం కాలేదు. వార్సా సంధి (సామ్రాజ్యవాదుల నాటో కూటమి ఏర్పడిన ఆరు సంవత్సరాలకు, అంటే 1955లో ఉనికిలోకి వచ్చింది) రక్షణకు సాధనంగానూ, సోషలిజానికి పట్టుగొమ్మగానూ నిలచింది. ఈ రెండు కూటములను ఒకేసారిగా రద్దు చేద్దామని సోవియట్ యూనియన్ తదితర సభ్య దేశాలు ప్రతిపాదించాయి. కాని దానికి సరైన సమాధానం లేదు. ప్రతీఘాత విప్లవం నుంచి సోషలిజాన్ని రక్షించటం కోసమే హంగరీ (1956), జెకోస్లవేకియా(1968)లకు వార్సాకూటమి అంతర్జాతీయ సహాయాన్ని అందచేసింది. పెట్టుబడిదారీ విధానానికీ, సోషలిజానికీ మధ్య అంతర్జాతీయ స్థాయిలో వర్గ పోరాటం ప్రారంభమైంది.

సోవియట్ ప్రజలకు శాశ్వతమైన, నిలకడైన ఉపాధి, ఉచిత విద్యా, వైద్య సదుపాయము, తక్కువ ఖర్చుతో గృహవసతి, అత్యధిక ప్రజలకు ప్రాథమికమైన రాజకీయ, సామాజిక హక్కులకు హామీ వంటివన్నీ అక్టోబరు విప్లవం కారణంగానే సమకూరాయి. అక్టోబరు విప్లవం జయప్రదం అయిన కొన్ని సంవత్సరాలకే సోవియట్‌లో నిరుద్యోగం తొలగిపోయింది. 1956 తరువాత వారంలో ఐదు రోజుల పనిదినం, రోజుకు 7 గంటలు, 6 గంటలు పని అమలులోకి వచ్చింది. శ్రామికులందరికీ విశ్రాంతి సమయాన్ని కేటాయించింది. విశ్రాంతి సదనాలను, వినోద కేంద్రాలను ప్రభుత్వం నిర్మించింది. పెద్దయెత్తున సినిమా థియేటర్లు, సంగీత, సాంస్కృతిక కేంద్రాలు, నాటక శాలలు, గ్రంథాలయాలు నిర్మాణమయ్యాయి. సైబీరియా వంటి సుదూర ప్రాంతాలలోని కుగ్రామాలలో సైతం ఇవి నెలకొన్నాయి. వీటి నిర్మాణం కోసం పెద్దయెత్తున నిధులను ఖర్చు పెట్టటమేకాక, వేలాది కార్యకర్తలు అహోరాత్రాలు శ్రమించారు.

సామాజిక భద్రతకు సోవియట్ యూనియన్ అత్యంత ప్రాధాన్యతను ఇచ్చింది. ఉద్యోగ విరమణ వయసు స్త్రీలకు 55గానూ, పురుషులకు 60గానూ ప్రభుత్వం నిర్ణయించింది. సామాజిక భద్రతా నిధులు ప్రభుత్వ బడ్జెట్ నుంచే కేటాయించేవారు. పరిశ్రమలు కూడా విరాళాలు ఇచ్చేవి. ఐరోపాలోని ఇతర సోషలిస్టు దేశాలలో కూడా ఇలాంటి చర్యలే అమలయ్యాయి. పెట్టుబడిదారీ దేశాలలోవలె సోషలిస్టు దేశాలలో శ్రామికులకు అభద్రతా భావనగానీ, ఆదుర్దాగానీ ఉండేవి కావు.

మహిళలను అణచివేయటాన్ని, వారిపట్ల వివక్షతను చూపటాన్ని తొలగించేలా సోవియట్ ప్రభుత్వం తగిన చర్యలను తీసుకున్నది. స్త్రీలకు పూర్తి హక్కులు సంక్రమించాయి. మాతృత్వాన్ని వైయక్తిక లేదా కుటుంబ అంశంగాకాక సామాజిక అంశంగా పరిగణించింది. ఉచిత సౌకర్యాల కల్పన ద్వారా అనేక రకాలైన కుటుంబ శ్రమల నుంచి స్త్రీలకు ప్రభుత్వం విముక్తి కలిగించింది. ప్రత్యేకించి యువజంటలపట్ల అత్యంత శ్రద్ధను ప్రదర్శించింది. స్త్రీ పురుషుల మధ్యవున్న అసమానతలన్నిటినీ తొలగించలేకపోయినప్పటికీ, స్త్రీలపట్ల నిర్లక్ష్యాన్నీ, ఆమెను ద్వితీయ శ్రేణి పౌరురాలిగా పరిగణించటాన్నీ రూపుమాపింది.

విద్యాస్థాయిని పెంచటం సోవియట్ విధానంలో అంతర్భాగంగా మారిపోయింది. సోవియట్‌లోని శ్రమజీవులలో నాలుగింట ఒకవంతుమంది విశ్వవిద్యాలయ విద్య పూర్తిచేసుకున్న వారో లేదా ప్రాథమికోన్నత విద్యను పూర్తి చేసుకున్నవారుగానో ఉన్నారు. 1917లో మూడింట రెండువంతులమంది నిరక్షరాస్యులన్న సంగతిని ఈ సందర్భంగా మనం గుర్తుంచు కోవాలి. ఎల్లెడెలా శాస్త్ర విజ్ఞానం వెల్లివిరిసింది. యూరిగగారిన్‌ను



2004లో మాస్కోలో కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో 50,000 మందితో జరిగిన ర్యాలీలో ఒక దృశ్యం

తీసుకుని తొలి మానవ నౌక అంతరిక్షంలోకి వెళ్ళింది. భౌతిక శాస్త్రం, గణితం, రసాయన తదితర శాస్త్రాలలో సోవియట్ గణనీయమైన పురోగతిని సాధించింది. సోషలిస్టు సంస్కృతిని సృష్టించిన నూతన మానవుని ఆవిష్కరించడం లో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ, కార్మిక రాజ్యము దోహదపడ్డాయి. సోషలిస్టు సంస్కృతి సాధించిన విజయాలు సర్వమానవాళికి అందాయి. చిన్నతనం నుంచే కళలను అభ్యసించేటందుకు వీలుగా అన్ని సదుపాయాలనూ ప్రభుత్వం కల్గించింది. ఆ రకంగా కళా సృజనను అభివృద్ధి పరచింది. సోవియట్‌లో మహోన్నతమైన కళాకారులు ఉండటమేకాక, ప్రజల సాంస్కృతిక స్థాయికూడా పెరిగింది. ఇదేవిధంగా మానవజాతి మేధో విజయాలను పరిరక్షించి, వ్యాప్తిలో పెట్టింది. తత్ఫలితంగా మహోన్నత ములైన కళావారసత్వాన్ని అధ్యయనం చేసే అవకాశం ప్రజలకు లభించింది. లౌరి, వాటికన్‌ల తరువాత హెర్మిటేజ్ పురావస్తు ప్రదర్శనశాల ప్రపంచవ్యాప్తంగా ప్రసిద్ధిగాంచింది. అక్టోబరు విప్లవం జయప్రదం అయిన తొలి రోజులనుంచే సోవియట్ ప్రజలు కళలపట్ల శ్రద్ధ చూపసాగారు. ఆకలి, చలిబాధ, కలరా వ్యాధి పీడిస్తున్నప్పటికీ, యుద్ధంలో మరణాలు సంభవిస్తున్నప్పటికీ ఈ విధంగా జరిగింది.

సోవియట్ యూనియన్ తదితర సోషలిస్టు దేశాలు సాధించిన విజయాలు, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంకన్నా సోషలిస్టు విధానం ఆధిక్యత కలిగిందన్న విషయాన్ని నిరూపిస్తున్నాయి. అక్టోబరు విప్లవ సమయానికి రష్యా వెనుకబాటుతనాన్ని, ఆనాటి అమెరికాతో నేకాక, బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్‌లతో పోల్చి చూస్తే సోషలిస్టు వ్యవస్థ ఆధిక్యత మరింత స్పష్టంగా రుజువవుతుంది.

మొదటి ప్రపంచ యుద్ధమూ, అంతర్యుద్ధమూ, పదహారు సామ్రాజ్యవాద దేశాల సైనిక జోక్యమూ మిగిల్చిన శిధిలాలపై రష్యాలో సోషలిస్టు నిర్మాణం ప్రారంభమైంది. వీటికి తోడు రెండవ ప్రపంచ యుద్ధ విధ్వంసం కూడా తోడైంది. ఇతర దేశాల సహాయం లేకుండా కేవలం నాలుగు సంవత్సరాల కాలంలో (1945-49) సోవియట్ యూనియన్ పునర్నిర్మాణం పూర్తయింది. సోవియట్ సోషలిస్టు వ్యవస్థ సామర్థ్యానికి ఇది ఒక ఉదాహరణ. తద్విరుద్ధంగా ఐరోపాలోని పెట్టుబడిదారీ దేశాలు తమ పునర్నిర్మాణం కోసం అమెరికా 'మార్షల్ ప్లాన్'పై ఆధారపడ్డాయి. పెట్టుబడిదారీ పంథాలో సమైక్య ఐరోపా దేశాల కూటమి ఏర్పడింది. దీనికి విరుద్ధంగా సోవియట్ యూనియన్ ఉనికిలోకి వచ్చింది. ఈనాడు సామ్రాజ్యవాద కూటమి అధిగమించ రాని వైరుధ్యాలతో సతమతమౌతున్నది. ఉత్పత్తిపై ప్రైవేటు యాజమాన్యం ఉండటంతో ఆధిపత్యం కోసం అవి పోటీపడుతున్నాయి. ఇతర దేశాలతో ఐరోపా యూనియన్ సంబంధాలు అసమానంగా ఉన్నాయి.

జాతీయవాదాన్ని, పెత్తందారీ విధానాన్ని, అకారణ భయాన్ని సోవియట్ ప్రభుత్వం వ్యతిరేకించింది. విడిపోవటంతో సహా స్వయం నిర్ణయాధికార హక్కు ప్రతి ఒక్క జాతికీ ఉన్నదని సోవియట్ ప్రభుత్వం గుర్తించింది. దేశాల మధ్యా, జాతుల మధ్యా పరస్పర గౌరవాన్ని పెంచింది. సోవియట్ యూనియన్‌గా అన్ని జాతులు కలిసిపోవాలన్న భావనను అది పెంపొందించింది. కార్మిక వర్గ అంతర్జాతీయతా సూత్రంపై ఆధారపడి ఈ ప్రతిపాదనను ముందుకు తీసుకొచ్చింది. ఈ సూత్రాన్ని సరిగ్గా అమలు చేసినప్పుడు సోషలిస్టు నిర్మాణంలో వివిధ జాతులను భాషా సాంస్కృతిక బృందా లను కలుపుకు రాగలము. అలాకాకుండా అంతర్గత సమస్యలు ఎక్కువగా ఉన్నప్పుడు కార్మికవర్గ అంతర్జాతీయతా సూత్రాలు విస్మరిస్తే ప్రతిపక్షాలు ఐక్యమయ్యే ప్రమాదం ఉంది. సోషలిస్టు వ్యవస్థలో చోటు చేసుకున్న పొరపాట్లను అవకాశంగా తీసుకున్న సామ్రాజ్యవాదులు విప్లవ ప్రతీఘాత శక్తులతో చేతులు కలిపి సోషలిస్టు వ్యవస్థను బలహీన పరిచే కుట్రలు సాగించారు.

సోషలిస్టు వ్యవస్థను కుప్పకూల్చటం విప్లవ ప్రతీఘాత చర్య మినహా మరొకటి కాదు. ఎందుకంటే ఇది సామాజిక అణచివేతను తీసుకువచ్చింది. పెట్టుబడిదారీ వ్యవస్థ సంపూర్ణ ఆధిపత్యం కారణంగా సోషలిస్టు దేశాల లోపలా, వెలుపలావున్న కోట్లాది ప్రజలు అనేక కడగండ్ల పాలయ్యారన్న సంగతి మనకు తెలుసు. ప్రతీఘాత విప్లవం సంభవించి, సోవియట్ కూలిపోయిన తరువాత మనిషిని మనిషి దోచుకోవడమూ, నేరాలు, వ్యభిచారము, మాదకద్రవ్యాల వాడకం పెచ్చుమీరాయి. సోవియట్ యూనియన్ సంపద దోపిడీకి గురవుతున్నది. గత ఏడు దశాబ్దాల కాలంలో ఎన్నడూ ఎరుగని పరిణామమిది. ఉత్పాదక శక్తులను ప్రతీఘాత విప్లవం ధ్వంసం చేసింది. ప్రతీఘాత విప్లవం కారణంగా నేడు సంభవిస్తున్న సమస్యలన్నీ సోషలిస్టు నిర్మాణం కారణంగా జనించినవని ప్రపంచవ్యాప్తంగా శత్రువులు దుష్ప్రచారం చేస్తున్నారు.

ప్రజలు తాత్కాలికంగా తమ

మద్దతుదారుని, నిజమైన మిత్రుని కోల్పోయారు. సామ్రాజ్యవాదుల దాడులకు వేలాదిమంది చనిపోయారు. అనేకమంది వికలాంగుల య్యారు. 1989-91 తరువాత ఉనికిలోకి వచ్చిన నూతన ప్రపంచ పొందిక కారణంగా బాల్కన్స్, ఇరాక్, ఆఫ్ఘనిస్థాన్, రువాండా, హైతీ, సోమాలియాలలో అసంఖ్యాక ప్రజలు బలిపశువులుగా మారిపోయారు. ప్రజలలో విద్వేషాలను రెచ్చగొట్టి, దేశాలను చీల్చేటందుకై జాతీయవాదం, మత విభేదాలు, సాంస్కృతిక వ్యత్యాసాలు, సోషలిస్టు వ్యతిరేకత, కమ్యూనిస్టు వ్యతిరేకత తదితరాలను సామ్రాజ్యవాదులు తమ ఆయుధాలుగా మార్చుకున్నారు. నూతన అణ్వాయుధాలను అభివృద్ధి చేస్తున్నారు. ప్రభుత్వ అధికారిక విధానాలలో కమ్యూనిస్టు వ్యతిరేకత అంతర్భాగం అవుతున్నది. బూర్జువా ప్రజాస్వామ్యాలు పెట్టుబడి నియంతృత్వాలు తప్ప మరేమీ కాదన్న విషయం అంతకంతకూ తేటతెల్లమవుతున్నది. పోలెండు, జెక్ రిపబ్లిక్‌లలో యుద్ధ నేరస్తులకు, జర్మన్‌తో మిలాఖత్తు అయిన వారికి సత్కారాలు లభిస్తున్నాయి. ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడిన వారికి అవమానాలు ఎదురవు తున్నాయి.

సోషలిస్టు వ్యవస్థ "కుప్పకూలిం దన్న" పదాన్ని మేము వ్యతిరేకిస్తున్నాము. ఎందుకంటే ప్రతిఘాత విప్లవ క్రమం అనివార్యమన్న అర్థాన్ని అది ఇస్తున్నది. అలానే సామాజిక పోరాటాలను అది మరుగు పరుస్తున్నది. ఆయాదేశాలలో రకరకాల తప్పులతోనూ, పొరపాట్లతోనూ, వక్రీకరణలతో నూ. సోషలిస్టు నిర్మాణం పురోగతి దిశలోనే సాగిపోయిందనేది కాదనలేని వాస్తవం. మునుపటి సోషలిస్టు దేశాల అభివృద్ధిలో అవకాశవాదం చోటుచేసుకున్నది. ప్రత్యేకించి వర్గపోరాటం తీవ్రతరమవుతూ, ప్రతిఘాత విప్లవం బలాన్ని పుంజుకుంటున్న సమయంలో ఇది జరిగింది. అయితే మన శత్రువులు మన వైఖరిని వక్రీకరిస్తారు. సామ్రాజ్యవాదులు చుట్టుముట్టి ఉండటంతో సోషలిస్టు వ్యవస్థలో అంతర్గత సమస్యలు ఎక్కువయ్యాయి. సోషలిస్టు నిర్మాణం సంక్లిష్టమన్న నిర్ణయానికి దారితీసింది. సోవియట్ వనరులలో ఎక్కువ భాగాన్ని ఆయుధాల కోసమే వెచ్చించ వలసి వచ్చింది.

యుద్ధానంతరం శాంతియుత సహజీవన పంథా రూపుదిద్దుకున్నది. ప్రత్యేకించి 1956 నాటి సోవియట్ పార్టీ 20వ మహాసభలో ఇది ఉనికిలోకి వచ్చింది. కొన్ని రకాలైన ఊహాజనిత వాదాలకు ఇది దారితీసింది. ఆ రకంగా యుద్ధానికీ, సైనిక జోక్యానికీ అవసరమైన సాధనాలను సామ్రాజ్య వాదులకు విడిచి పెట్టినట్లయింది. ప్రపంచ బలాబలాల పొందికలో మార్పులు రావటానికి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన పరిణామాలు కీలకపాత్ర నిర్వహించాయి. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను రద్దు చేయాలన్న నిర్ణయం 1943 మే-జూన్‌లలో వెలువడింది. దీనితో అంతర్జాతీయ సామ్రాజ్య వ్యవస్థకు ధీటైన విప్లవ వ్యూహాన్ని రూపొందించే కేంద్రం తొలగి పోయిందన్న భావన ఏర్పడింది. రెడార్మీ సహాయంతో తూర్పు ఐరోపాలో సోషలిస్టు వ్యవస్థలు ఏర్పడినప్పటికీ రెండవ ప్రపంచ యుద్ధానంతరం వర్గ పోరాటం తీవ్రతరమైంది.

సామ్రాజ్యవాద యుద్ధాన్నీ లేదా విముక్తి పోరాటాలనూ కార్మికవర్గం అధికారాన్ని హస్తగతం చేసుకునే పోరాటాలుగా పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు మార్చలేక పోయాయి. అవి సోషలిజం లక్ష్యాన్ని వాయిదా వేసి, ఫాసిస్టు వ్యతిరేకతకే పరిమితమ య్యాయి. బూర్జువాలకూ, విప్లవ కార్మికవర్గ అధికారానికీ నడుమ ఒకానొక అధికార రూపం ఉండగలదన్న భావన పరివ్యాప్తిలోకి వచ్చింది. తద్వారా కార్మిక వర్గం అధికారాన్ని సంపాదించు కోవచ్చునని ఆలోచించారు.

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత వివిధ కమ్యూనిస్టు పార్టీల మధ్య నిర్మాణ పరమైన లింకు లేకుండా పోయింది. తత్ఫలి తంగా అంతర్జాతీయ సామ్రాజ్యవాద సమైక్య వ్యూహానికి వ్యతిరేకంగా స్వతంత్ర సమైక్య వ్యూహాన్ని నిలబెట్టారు. 1947లో ఉనికిలోకి వచ్చిన కమ్యూనిస్టు పార్టీల 'సమాచార బ్యూరో' 1956లో రద్దయింది. ఆ తరువాత కమ్యూనిస్టు పార్టీల అంతర్జాతీయ సదస్సులు జరిగాయిగానీ అవేవీ సైద్ధాంతిక ఐక్యతకు దోహదపడలేదు. విప్లవ వ్యూహాన్ని కూడా రూపొందించ లేకపోయాయి. పెట్టుబడిదారీ ఎత్తుగడలను అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం సరిగ్గా అంచనా వేయలేక పోయింది. తొలుత తూర్పు జర్మనీలోనూ, ఆ తరువాత పోలెండు, హంగరీ, జెకొస్లవేకియాల్లోనూ సామ్రాజ్యవాదుల ఎత్తుగడలను పసిగట్టలేకపోయారు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికన్ సామ్రాజ్యవాదం ప్రచ్ఛన్న యుద్ధాన్ని ప్రారంభించింది. సోషలిస్టు దేశాలకు వ్యతిరేకంగా దుష్ప్రచారం సాగించటం, ఆయుధ పోటీ, సోషలిస్టు వ్యవస్థను దెబ్బతీయటం తదితర లక్ష్యాలతో ఈ ప్రచ్ఛన్న యుద్ధం సాగింది. ఇదే సమయంలో సామ్రాజ్యవాద దేశాలు సైనిక, పౌర, ఆర్థిక కూటములను ఏర్పాటు చేశాయి. నాటో, ఐరోపా యూనియన్, ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకు, ఖండాంతర వాణిజ్య ఒప్పందాలు వంటివన్నీ దీని కిందకే వస్తాయి. ప్రపంచంలోని బలాబలాల పొందికను కచ్చితంగా అంచనా వేయడంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం విఫలమైంది. యుద్ధానంతరం పెట్టుబడిదారీ దేశాలు పునస్సంఘటితం కావటంవల్ల కలిగే శక్తిని కూడా అంచనా వేయలేక పోయింది. ఇదే సమయంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సంక్షోభం తీవ్రతరమైంది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఒకవైపున ఉండగా మరోవైపున చైనా కమ్యూనిస్టు పార్టీ, అల్బేనియా పార్టీలు నిలచాయి. పశ్చిమ ఐరోపాలోని కమ్యూనిస్టు ఉద్యమంలో మితవాద అవకాశవాదం తలయెత్తడంతో ఈ సమస్యలు మరింత క్లిష్టమయ్యాయి. ఇదే "యూరో కమ్యూనిజం" పేరుతో ముందుకు వచ్చింది. ఇది సోషల్ డెమొక్రసీతో జతకట్టింది. ఈ రెండూ సోవియట్ వ్యతిరేకతనే వ్యక్తం చేశాయి. చైనా పార్టీ కూడా ఇదే ధోరణిని ప్రదర్శించింది. అప్పటిలో పెట్టుబడిదారీ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలలోనూ, అధికారంలోవున్న కమ్యూనిస్టు పార్టీలలోనూ చోటుచేసుకున్న అవకాశవాదం పరస్పరం ప్రభావాన్ని చూపాయి. సోషలిస్టు దేశాలకు వ్యతిరేకంగా అణుబాంబులను వేస్తామన్న బెదిరింపులు కూడా అప్పటిలో వచ్చాయి.

ఈ సందర్భంగా ఒక విషయాన్ని గుర్తించాలి. పెట్టుబడిదారీ విధానానికీ, సోషలిజం- కమ్యూనిజంలకు మధ్య మౌలికంగానే భేదం ఉన్నది. అదేమిటంటే, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు ఫ్యూడల్ వ్యవస్థ గర్భంలోనే జనించాయి. కాగా, సోషలిస్టు-కమ్యూనిస్టు ఉత్పత్తి సంబంధాలు పెట్టుబడిదారీ వ్యవస్థ గర్భంలో జనించలేదు. ఎందుకంటే సోషలిస్టు సంబంధాలు అన్నిరకాల దోపిడీ రూపాలతోనూ ఘర్షణ పడతాయి.

పెట్టుబడిదారీ వ్యవస్థ నుంచి

సంక్రమించిన అన్ని సామాజిక సంబంధాలను విప్లవ కార్మిక శక్తి కూలద్రోసి, వాటిని కొత్తగా పునర్నిర్మించాలి. నూతన తరహా ఉత్పత్తిని ఎంతో చైతన్యంతో ప్రవేశపెట్టాలి. సోషలిస్టు నిర్మాణం కోసం సామాజిక వైరుధ్యాలను తొలగించాలి. నూతన ఉత్పత్తి సంబంధాలను, పంపిణీని అభివృద్ధి చేయటంలో అనేక సమస్యలు ఉత్పన్నమవుతాయి. పెట్టుబడిదారీ విధానం ఇలాంటి కష్టాలను ఎదుర్కొనలేదు. సోషలిస్టు సమాజంపై పెట్టుబడిదారీ ముద్రలు బలంగా ఉన్నాయి. సోషలిజంలో వర్గ దోపిడీ రద్దవుతుంది. కాని, అన్ని రకాల అసమానతలూ తొలగిపోవు. సోషలిస్టు నిర్మాణ సమయంలోనే పట్టణ ప్రాంతాలకూ, గ్రామసీమలకూ మధ్యా, అలానే శారీరక శ్రమకూ, మానసిక శ్రమకూ మధ్యా వ్యత్యాసాన్ని తొలగించాలి. అప్పుడు మాత్రమే లెనిన్ చెప్పినట్లుగా, "పెట్టుబడిదారీ వ్యవస్థ శవపేటికపై చివరి మేకును కొట్టిన వారమవుతాము".



అమెరికా యుద్ధ సన్నాహాలకు ప్రపంచ వ్యాపితంగా వ్యతిరేకత పెరుగుతోంది: నార్వేలోని ఓస్లో నగరంలో ఇటీవల నాటో విస్తరణకు నిరసనగా ప్రదర్శన చేస్తున్న వారిపై పోలీసులు వాటర్ క్యానన్‌లు ప్రయోగిస్తున్న దృశ్యం

నూతన సమాజాన్ని స్థాపించి అభివృద్ధి చేసేటందుకై సాగే పోరాటానికి, కమ్యూనిస్టు పార్టీ కేంద్రకంగా ఉండే విప్లవ కార్మిక శక్తి నేతృత్వం వహించవలసి వుంది. సోషలిస్టు సమాజ చలన సూత్రాలపై ఆధారపడి పార్టీ వ్యవహరించాలి. కనుక, సోషలిస్టు నిర్మాణానికి శాస్త్రీయ-వర్గ దృక్పథం కలిగిన కమ్యూనిస్టు పార్టీ విధానమూ, శాస్త్రీయ సోషలిజం-కమ్యూనిజం సిద్ధాంతమూ అత్యవసరము. అధికారాన్ని చేపట్టిన పార్టీలు ఈ కర్తవ్యాన్ని జయప్రదంగా నిర్వహించలేదు. అంతేకాక సోషలిస్టు నిర్మాణంలో ఎదురైన వైరుధ్యాలను తొలగించటంలో కూడా అవి విఫలమయ్యాయి. పోటీరహిత వైరుధ్యాలు, పోటీపడేవిగా రూపొందవన్న అవకాశవాద సిద్ధాంతం రుజువుకు నిలవలేదు.

యుద్ధానంతరం నాల్గవ పంచవర్ష ప్రణాళికను (1946-59) విజయవంతంగా పూర్తి చేసినప్పటికీ ఉత్పత్తి సాధనాల ఆధునీకరణ, అభివృద్ధికి సంబంధించి కొన్ని సమస్యలు ఎదురయినట్లు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 19వ మహాసభ పేర్కొన్నది. ఇలాంటి సమస్యలను ఎదుర్కొనేటందుకుగాను 1956లో జరిగిన 20వ మహాసభ కొన్ని అవకాశవాద విధానాలను ముందుకు తీసుకువచ్చింది. అంతేకాక "వ్యక్తిపూజను" ఎదిరించే పేరుతో స్టాలిన్ హయాంలో సోవియట్ ప్రభుత్వం అనుసరించిన విధానాలకు వ్యతిరేకంగా విశృంఖల ప్రచారం జరిగింది. దీని ప్రభావంతో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సైతం మితవాద అవకాశవాదం చోటు చేసుకున్నది. ఉత్పత్తి, పంపిణీలకు సంబంధించి సోషలిస్టు సంబంధాలను పటిష్టం చేయటానికి బదులుగా క్రమక్రమేణా పెట్టుబడిదారీ సంబంధాలు ప్రవేశించాయి. కేంద్ర ప్రణాళిక వెనుకంజ వేసి, సామాజిక యాజమాన్యం డుల్లిపోవటం ప్రారంభమైంది. ప్రైవేటు, సహకార రంగాలలోని వ్యవసాయోత్పత్తులను మార్కెట్‌లో విక్రయించ సాగారు. ధరలు స్థిరంగా లేనపుడు ఈ అమ్మకాలు సాగాయి. పరిశ్రమలలో సామాజిక అసమానతలు బలంగా ఉన్నాయి. ఇవన్నీ పెట్టుబడిదారీ విధానాన్ని ఆహ్వానించేవి.

సోషలిస్టు నిర్మాణం గురించి ఆత్మాశ్రయవాదంతో కూడిన అంచనాలు ప్రారంభమయ్యాయి. సోవియట్‌లో సోషలిజం విజయాన్ని సాధించిందని సోవియట్ పార్టీ 21వ మహాసభ ప్రకటిస్తే, కమ్యూనిస్టు సమాజ నిర్మాణ కార్యక్రమం ప్రారంభమైందని 22వ మహాసభ ప్రకటించింది. 1977లో సవరించిన రాజ్యాంగం "యావత్ ప్రజల రాజ్యం", "ప్రజలందరి పార్టీ" అంటూ ప్రకటించింది. "యావత్ ప్రజల రాజ్యం" అన్న సిద్ధాంతం రాజ్యం యొక్క స్వభావాన్ని మరింతగా మార్చివేసింది. శ్రామిక వర్గానికి ప్రాధాన్యత తగ్గిపోయింది. సోషల్ డెమొక్రసీ స్వభావాన్ని కూడా అది మార్చివేసింది. అదేవిధంగా "ప్రజలందరి పార్టీ" అన్న ఆలోచన కూడా శ్రామికవర్గ స్వభావాన్ని మార్పు చేసింది.

1995లో నిర్వహించిన జాతీయ సదస్సులో గ్రీసు కమ్యూనిస్టు పార్టీ ఇలా పేర్కొన్నది. "ఐరోపాలో సోషలిస్టు వ్యవస్థ కూలిపోవటానికి కారణం, అగ్రశ్రేణి పాత్రను నిర్వహించటంలో పార్టీ బలహీనపడటమే. పెరిస్త్రోయికా కాలంలో పార్టీ బాగా దిగజారి పోయింది". పార్టీని శ్రామిక వర్గం అదుపు చేయటం క్రమంగా బలహీన పడి, తదనంతర కాలంలో పూర్తిగా కనుమరుగయింది. కమ్యూనిస్టుల మధ్య సమానత్వం అన్న ఆదర్శం ఉల్లంఘనకు గురైంది. పార్టీ కార్యకర్తలు తమ స్థానాన్ని జీవనాధారంగా భావించే పరిస్థితులు ఉత్పన్నమయ్యాయి. కార్మికవర్గంగానీ, మొత్తంమీద ప్రజానీకంగానీ సోషలిజాన్ని తిరస్కరించలేదు. "విప్లవంలో విప్లవం, మరింత సోషలిజం" అన్న బూటకపు నినాదాలను పెరిస్త్రోయికా ఇచ్చింది.

ప్రతీఘాత విప్లవానికి శ్రామిక వర్గం స్పందిచలేదన్న (ఎదురుతిరగలేదన్న) వాస్తవానికి కారణమేమిటో దీనివల్ల అర్థం కాగలదు. సామాజిక యాజమాన్య స్వభావాన్ని హరించి, సంకుచితమైన స్వంత ప్రయోజనాలను పెంచి, సామాజిక యాజమాన్య భావాలను తుడిచిపెట్టే పరిస్థితులు సృష్టి అయ్యాయి. ఆత్మసాక్షి హరించుకు పోయింది. నిర్లక్ష్యము, నిరాసక్తత పెరిగిపోయాయి.

దీర్ఘకాలంలో అంతర్జాతీయ కమ్యూ

నిస్టు ఉద్యమాన్ని అపకాశవాదం ఆవహించింది. 20వ శతాబ్దపు పెట్టుబడిదారీ అభివృద్ధిలోనే దాని మూలాలు ఉన్నాయి. దీన్ని సరైన రీతిలో, వాస్తవిక దృక్పథంతో విశ్లేషించలేదు. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీలలోనూ, సోవియట్ కమ్యూనిస్టు పార్టీలోనూ, అధికారంలో ఉన్న ఇతర కమ్యూనిస్టు పార్టీల్లోనూ తలెత్తిన అవకాశ వాదంపై మరింత చారిత్రక పరిశోధన చేయాల్సి ఉంది. 21వ శతాబ్దపు కమ్యూనిస్టు ఉద్యమాన్ని సైద్ధాంతికంగా, రాజకీయంగా పటిష్టపరుచుకోడానికీ, ఐక్యత సాధించడానికీ ఈ పరిశోధన అవసరం.

20వ శతాబ్దపు సోషిలిస్టు నిర్మాణంలో వర్గపోరాట అభివృద్ధి, పెరుగుదలపై విశ్లేషణ చేసి... వచ్చిన నిర్ధారణలను ఇప్పటి ఉద్యమంలో ఉపయోగించుకోవడం కూడా అవసరం. భవిష్యత్ సోషలిస్టు నిర్మాణం ఖచ్చితంగా 20వ శతాబ్దపు స్థాయికన్నా హెచ్చుగా ఉంటుంది. అదే సమయంలో ఇది ఆర్థిక, రాజకీయ, సైద్ధాంతిక రంగాల్లో పెట్టుబడిదారీ వారసత్వంతో మరింత తీవ్రమైన యుద్ధం ద్వారా మాత్రమే లభిస్తుందనేది కూడా వాస్తవం.

నేటి పెట్టుబడి దారీ దేశాల్లోని కార్మి క వర్గ ఉద్యమానికి వస్తే, ఇప్పుడు కొన్ని వ్యవస్థల్లో (పార్లమెంటు, ప్రభుత్వం, యజమానుల అదుపు, ట్రేడ్ యూనియన్లు, స్థానిక స్వపరిపాలనా సంస్థలు వగైరా) ప్రజలు చిక్కుకుని ఉన్నారన్న సమస్య మన ముందుంది. కార్మికోద్యమంపై శక్తివంతమైన బూర్జువా సైద్ధాంతిక ప్రభావం అనేక కమ్యూనిస్టు పార్టీల్లో రివిజినిజం, అవకాశవాదం రూపంలో కూడా కనిపిస్తున్నది.

ఈనాడు వర్గపోరాటం ఆత్మరక్షణ స్థితిలో లేదని ఏనాటికన్నా నేడు ఖచ్చితంగా నిరూపించగలం. కార్మికవర్గం యొక్క, పెట్టుబడియొక్క తక్షణ అవసరాలు మారుతున్న తరుణంలో కొన్ని విజయాలను రక్షించుకొ వగంలో వర్గపోరాటం చురుకుగానే ఉంది. రాజకీయపరమైన కార్యాచరణ ద్వారా, పెట్టుబడి యొక్క వ్యూహాన్ని సవాలు చేసే డిమాండ్లను ముందుకు తీసుకురావడం ద్వారా, ఉత్పత్తి చేసేవారికి ఫలితం దక్కాలన్న డిమాండు ద్వారా మాత్రమే తక్షణ, కొన్ని నిర్దిష్ట దీర్ఘకాలిక ఫలితాలు సాధించగలం. అదే సమయంలో అధికారాన్ని హస్తగతం చేసుకునే స్వీయమానసిక


21వ శతాబ్దపు పోలీసు: ఇరాకీ పసిపిల్లల పైకి తుపాకి ఎక్కుపెడుతున్న అమెరికా సైనికుడు

స్థితులను కూడా సిద్ధం చేసుకోవాలి. అటువంటి పోరాటాలు మాత్రమే బలాబలాలను కార్మిక వర్గానికీ, దాని గట్టి మిత్రులైన ప్రజాబాహుళ్యానికీ అనుకూలంగా మార్చగలవు.

సైద్ధాంతిక రంగంలో కమ్యూనిస్టుల ముందున్న ఒక ప్రధాన కర్తవ్యమేమంటే వారు బూర్జువా దుష్ప్రచారానికి అతీతంగా స్వీయమానసిక దృక్పథంతో కాకుండా వాస్తవిక దృష్టితో 20వ శతాబ్దపు సోషలిజం గురించిన వాస్తవాలను కార్మిక ప్రజల ముందుంచాలి. 'జాతీయ' లక్షణాలకు అనుకూలంగా మలుచుకున్న సోషలిజం 'నమూనాల'కు సంబంధించిన అవకాశవాద సిద్ధాంతాలకు వ్యతిరేకంగానే కాకుండా, లోపాలను గురించి చెప్పుకునేటప్పుడు గుండెలు బాదుకునే పద్ధతులకు విరుద్ధంగా 20వ శతాబ్దంలో సోషలిజం నిర్వహించిన మహత్తర పాత్రను గురించీ, సోషలిజంవైపుగా ప్రపంచాన్ని నెట్టే సోషలిజం అభివృద్ధి సూత్రాల గురించీ ప్రచారం చేయాలి. గ్రీసు కమ్యూనిస్టు పార్టీ ఇతర కమ్యూనిస్టు పార్టీలతో సంబంధాలు పెట్టుకునేటప్పుడు ఈ సూత్రాలనే ప్రాతిపదికగా తీసుకుంటుంది. అంతర్జాతీయ ఉద్యమంలో కమ్యూనిస్టు ధృవాన్ని ఏర్పాటు చేసేటప్పుడు కూడా వీటినే ప్రాతిపదికగా తీసుకుంటుంది. దుష్ప్రచారమూ, కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచార యుద్ధమూ సత్యాన్ని ఎన్నాళ్లో మరుగున ఉంచలేవు. చరిత్రను తిరగ రాయడం అనేది కూడా కమ్యూనిస్టు వ్యతిరేకత యొక్క ఒక పార్శ్వమే. కమ్యూనిస్టులంటే బూర్జువా వర్గానికి ఎంత భయమో ఈ దుష్ప్రచారమే తెలియజేస్తుంది.

అభివృద్ధికి వర్గరహితమైన మార్గం లేక మూడో మార్గం అంటూ ఏదీ లేదు. అటువంటిదేదీ అటు పెట్టుబడిదారీ వ్యవస్థను నియంత్రిస్తున్న సామ్రాజ్యవాదానికీ ఉపయోగపడదు, ప్రజలకీ ఉపయోగపడదు. గతంలోనూ, ఇప్పుడూ ప్రచారం చేసిన, చేస్తున్న కథలన్నీ పటాపంచలయ్యాయి, లేక ఆచరణలో పేలప్పిండిలా ఎగిరిపోయాయి. 'స్వేచ్ఛా ఆర్థికవ్యవస్థ', "పోటీ తత్వం" "ఆధునీకరణ"; 'ఏకాభిప్రాయం', 'సామాజిక చర్చ', 'సంస్థల ప్రజస్వామ్యం', 'ఒన్ వే వీధి', రక్షణ, 'సార్వభౌమాధికార హక్కులు, హద్దులు' వగైరాలన్నీ పటాపంచలయ్యాయి. అసలు సమస్య: అధికారంలో ఎవరున్నారు, ఎవరి ఆధిపత్యం ఉంది, ఎవరికోసం ఇదంతా, ఎక్కడికి ఇది దారితీస్తుంది...ఇదీ.

కార్మికవర్గం, పేద ప్రజలూ గతాన్ని కరుచుకుని ఉండిపోరు. కార్మికవర్గం, ముఖ్యంగా కార్మికవర్గంలోని యువతరం, అలాగే ప్రజల్లోని యువతరం...వీరందరికీ ఒకే భవిష్యతు కావాలి. సామ్రాజ్యవాదం దేన్ని చూసైతే భయపడుతోందో ఆ సోషలిస్టు-కమ్యూనిస్టు భవిష్యత్తు కావాలి. గ్రీసు కమ్యూనిస్టు పార్టీ 15వ మహాసభలో దీన్ని గురించి ఇలా పేర్కొన్నది: "21వ శతాబ్దంలో విప్లవ శక్తులు తిరిగి కూడదీసుకుంటాయి. అంతర్జాతీయ పెట్టుబడి దాడిని తిప్పికొట్టడం జరుగుతుంది. నిర్ణయాత్మ కమైన ఎదురుదాడి ప్రారంభమవుతుంది. ప్రపంచ విప్లవోద్యమంలో ఇది ఖచ్చితంగా కొత్త పెరుగుదలను చూసే, కొత్త రకం సామాజిక విప్లవాలను చూసే శతాబ్దం అవుతుంది".



# జోతిబా ఫూలె

(2వ పేజీ నుండి)

ఉపాధ్యాయురాలిగా తీర్చిదిద్దాడు. ఆడది ఇల్లుదాటి బయటకు రావడమూ, పైగా ఉపాధ్యాయినిగా పనిచేయడమూనా అంటూ అగ్రవర్ణాలవారు సావిత్రీబాయిపై కత్తిగట్టారు. ఆమెను తిట్టారు. శాపనార్థాలు పెట్టారు. ఆమె బడికి వెళ్లి వచ్చేటప్పుడు బురద చల్లేవారు, రాళ్లు విసిరేవాళ్లు. ఈ అవాంతరాలు ఎదురవుతాయని జ్యోతిరావు దంపతులు ముందే ఊహించారు.

జోతిరావు పాఠశాల ఐదారు నెలలు నిరంతరాయంగా నడిచింది. మిత్రుడు గోవాండే అవసరమైన పుస్తకాలూ తదితర సామాగ్రి పంపేవాడు. జోతిరావు నిద్రాహారాలు మాని పిల్లలకు పాఠాలు చెబుతుండేవాడు. దాంతో అగ్రవర్ణాలవారు జోతిరావును వదిలి తండ్రిని బాధించడం మొదలుపెట్టారు. నీ ఇంట్లో ఇలాంటి పనులు జరగడానికి వీల్లేదని హెచ్చరించారు. మతం పట్ల మూఢ విశ్వాసం పెంచుకున్న గోవిందరావు వారికి బదులు చెప్పలేకపోయాడు. వారి కపటోపాయాలకూ, కుతంత్రాలకూ లొంగిపోయాడు. మతాన్ని ధిక్కరించడం మహా పాపమని కొడుక్కి చెప్పాడు. ప్రాణం పోయినా లక్ష్య సాధనలో వెనక్కి వెళ్లేది లేదని బదులు చెప్పాడు జోతిరావు. సావిత్రీబాయి భర్తను అనుసరించింది. తండ్రి ఇంటి నుంచి బయటకు వచ్చాక జీవిక కోసం ఏదో ఒక పని వెతుక్కోవలసిన అవసరం ఏర్పడింది. పాఠశాల నడపడం సాధ్యం కాలేదు. ఆర్థిక పరిస్థితి కొంత మెరుగయ్యాక పాఠశాల మళ్లీ తెరవాలని భావించాడు. బడి పెట్టడానికి చోటు దొరకలేదు. ఎవరూ ఇల్లు ఇవ్వడానికి ఒప్పుకోలేదు. చివరికి గోవాండే చూపిన స్థలంలో బడి ప్రారంభమైంది. పాఠశాల నిర్వహణలో చాలా సమస్యలు ఎదుర్కొన్నాడు. విద్యార్థినులు తాగడానికి మంచినీళ్లు తదితర సదుపాయాలు కూడా సమస్యలే అయ్యాయి. నిమ్న జాతి పిల్లలను బావులు, చెరువుల దగ్గరకు రానిచ్చేవారు కాదు. వారికోసం ప్రత్యేకంగా మంచినీళ్లు పట్టి తెచ్చేవాడు. పిల్లలు బడికి వేసుకు రావడానికి బట్టలు ఇచ్చేవాడు. పాఠశాల నిర్వహణలో రెండేళ్లు గడిచాయి. జోతిరావుకు ఎంతో అనుభవమూ, ధైర్యమూ వచ్చింది. ఆయన మామూలు బడిపిల్లలకు చదువు చెప్పిన ఉపాధ్యాయుడే కాదు, సమాజానికే చదువు చెప్పిన వాడిగా గుర్తింపు తెచ్చుకున్నాడు. జోతిని అందరూ ఆప్యాయంగా జోతిబా అని పిలవడం ప్రారంభించారు.

1852లో నిమ్న జాతుల్లో విద్యా ప్రచారం లక్ష్యంగా ఒక సంస్థను ఏర్పాటు చేశాడు. స్త్రీల విద్య విషయంలో ప్రశంసనీయమైన కృషి చేసిన జోతిబాను బ్రిటీష్ ప్రభుత్వం సత్కరించింది. అప్పటికి జోతిబా వయస్సు 25 ఏళ్లు. ఒక శూద్రునికి పండిత సత్కారం జరగడం సనాతన బ్రాహ్మణ వర్గం అసూయతో మండిపోయింది. జోతిబాపై హత్యా ప్రయత్నం కూడా చేయించారు. అయినా జోతిబా దంపతులు నిమ్న జాతుల పాఠశాలల కోసం సుమారు 10 సంవత్సరాలపాటు కృషి చేశారు. అవి స్థిరపడ్డాయనుకొన్న తర్వాతనే వాటి నుంచి ఇతర సాంఘిక, సేవా కార్యక్రమాలవైపు దృష్టి మళ్లించారు. జోతిబా దృష్టి ఎప్పుడూ సాంఘిక వ్యవస్థపైనా, మానవత్వపు విలువలపైనా ఉండేది. బాధలు పడుతున్న ప్రతివారి గురించీ ఆలోచించేవాడు. మూఢాచారాలనూ నమ్మకాలనూ హేతుబద్ధంగా పరిశీలించేవాడు. సతీసహగమనం, బాల్య వివాహం, వైధవ్యం, శిశుహత్యల వంటి సమస్యలపై రాజారామ్‌మోహన్‌రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ చేస్తున్న కృషి ఆయనను ఎంతో ఆకర్షించింది. ఈ సమయంలోనే జోతిబా అభాగినులయిన వితంతువుల కోసం ఓ శరణాలయం స్థాపించాడు. నిలువ నీడలేని, వితంతువుల అక్రమ సంతానానికి ఇది ఆశ్రయంగా నిలిచింది. వితంతువులు తమ ప్రసవానికి ఇక్కడకు వచ్చేవారు. కొందరు శిశువులను అక్కడే వదిలి వెళ్లేవారు. వారి బాధ్యత శరణాలయమే తీసుకునేది. దేశంలో ఆనాటికి అలాంటి సంస్థల్లో జోతిబా స్థాపించిన శరణాలయమే మొదటిగి. అప్పటి సంఘ సంస్కర్తలు చాలా మంది ఈ ఆశ్రమం పట్ల ఆసక్తి కనబరిచారు.

జోతిబా జానపద రీతిలో దేశీయమైన పలుకుబళ్లతో జాతి ప్రగతిని కోరి పదాలు రాశాడు. కింది వర్గాల ప్రజలను జాగృతులను చేయడానికి పుస్తకాలు, కరపత్రాలు ప్రచురించడంతో సరిపెట్టకుండా 'సత్యశోధక్ సమాజ్' సంస్థను ఏర్పాటు చేసి తన విశాల భావాలకు మరింత ప్రచారం ఇవ్వడానికి పూనుకున్నాడు. తర్వాత జోతిబా పురోహితులు లేకుండా పెళ్లిళ్లు చేయించే పని ప్రారంభించాడు. తరతరాలుగా తమను అజ్ఞానంలో ఉంచి సాంఘికంగానూ, వ్యక్తి పరంగానూ మానవత్వపు విలువలను దోచిన అగ్రవర్ణాలను ఎదుర్కోవాలని ప్రజలకు పిలుపునిచ్చిన జోతిబా, సాంఘిక పురోగమనానికి అప్పటి బ్రిటీష్ పాలన అనుకూలంగా ఉందని విశ్వసించాడు. అయితే బ్రిటీష్‌వారికి అనుకూలుడుగాగానీ, సహాయకుడుగా గానీ పనిచేయలేదు. మానవ సమాజంలో భేదభావాలు కల్పించింది వేదాలేననీ నమ్మాడు. వేదాలు, పురాణాల్లోని వ్యక్తులంటే తగని కోపం ప్రదర్శించేవాడు.

వర్షాభావం వల్ల కలిగిన అప్పటి కరువులో లక్షలాది మంది మరణించారు. ఆ కరువు రోజుల్లో జోతిబా చేసిన సేవ గొప్పది. రోజురోజుకూ ఎక్కువవుతున్న శిశుమరణాలు ఆయనను కలవరపరిచాయి. 'విక్టోరియా బాలాశ్రమ్' పేరుతో ఒక ఆశ్రమం తెరిచాడు. అందులో రోజూ రెండువేల మంది పిల్లలకు ఉదయమూ సాయంత్రమూ రొట్టెలు పంచేవారు. 1880 ప్రాంతాల్లో ఆయన పూనే మున్సిపల్ సభ్యుడిగా కిందివర్గాల ప్రజల సౌకర్యం కోసం పాటుపడ్డాడు. జోతిబా మద్యపాన వ్యతిరేకి. మద్యం దుకాణాలు అరికట్టేందుకు శక్తివంచన లేకుండా కృషి చేశాడు. పత్రికల్లో ఎన్నో వ్యాసాలు రాశాడు. అధికారులకు వినతిపత్రాలిచ్చాడు. ప్రజల్లో పరివర్తన తెచ్చేందుకు విశేషంగా ప్రయత్నించాడు. బాలగంగాధర తిలక్, ఆగార్కర్ ప్రజల్లో సాంఘిక చైతన్యం కలిగించే ధ్యేయంతో 'మరాఠా', 'కేసరి' పత్రికలు మొదలు పెట్టారు. ఒకసారి కోల్హాపూర్ సంస్థాన వ్యవహారాలను గురించి రాసినందుకు ఈ పత్రికలపై దావా నడిచింది. ఆ సందర్భంలో తిలక్‌కు రక్షణ ఇచ్చిన ఇద్దరిలో ఒకరు రామ్‌శేర్ ఉరవణ. ఆయన వెనుక ప్రోద్బలం జోతిబాదే. 1885లో భారత జాతీయ కాంగ్రెస్ ఆవిర్భవించింది. కాంగ్రెస్ కార్యకలాపాలనూ, నాయకుల దృక్పథాన్నీ జోతిబా నిశితంగా పరిశీలించాడు. ఆ నాయకులపై ఆయనకు నమ్మకం కలగలేదు. సమాజంలోని కింది వర్గాలపై నిజమైన శ్రద్ధ చూపితేనే తప్ప అది అచ్చమైన జాతీయ సంస్థ కాలేదని ఆయన అన్నాడు. తమకు పిల్లలు లేని కారణంగా పన్నెండు రోజుల శిశువును చేరదీసి పెంచుకుంటున్నామనీ, తన ఆస్తిపాస్తులు యావత్తూ అతనికే చెందేలా 1987లో విల్లు రాశాడు. 1988 జూలైలో జోతిబా ఆరోగ్యం దెబ్బతింది. గుండె పోటు వచ్చింది. దానితోనే పక్షవాతం వచ్చి శరీరం కుడి భాగం చచ్చుబడిపోయింది. అదే సంవత్సరం నవంబర్ 27న కన్నుమూశాడు. "జోతిబా ఫూలే ఆధునిక భారత సమాజంలో అందరి కంటే గొప్ప శూద్రుడు. హిందూ సమాజంలో అగ్రకులాల వారి బానిసలుగా బతుకుతున్న కింది కులాల వారిలో తమ బానిసత్వం పట్ల ఆయన చైతన్యం రగిలించారు." అని జోతిబా ఫూలే గురించి డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ అన్నారు.



KRSA102H116 EL/2006/17554. Postal Regd.No. /SD/407/07-09

# శ్రామికవర్గ నాయకత్వంలో మాత్రమే నిజమైన విప్లవ ప్రభుత్వమేర్పడుతుంది



వి.ఐ. లెనిన్

మనం పటిష్టమైన విప్లవ ప్రభుత్వాన్ని కోరుకుంటున్నాం. .....

అయితే, ఆ విప్లవాన్ని తీసుకొస్తున్న వర్గం ఏది, విప్లవం ఎవరికి వ్యతిరేకంగా జరుగుతుంది అన్నదే అసలు సమస్య.

విప్లవం జారుచక్రవర్తులకు వ్యతిరేకంగా జరుగుతోందా? అదే నిజమైతే ఈ రోజున రష్యాలో ఉన్న అత్యధిక భూస్వాములూ, పెట్టుబడిదారులూ విప్లవకారులే. విప్లవం వచ్చితీరుతుందన్నప్పుడు అభివృద్ధి నిరోధకులు కూడా దానితో వచ్చి చేరిపోతారు. నేటి పరిస్థితుల్లో జారుచక్రవర్తికి వ్యతిరేకంగా విప్లవం జరుగుతోంది అనడం ప్రజలను వంచించడమే.

మరి విప్లవం భూస్వాములకు వ్యతిరేకంగా జరుగుతోందా? అదే నిజమైతే అత్యధిక భాగం రైతాంగం, చివరికి స్థితిమంతులైన రైతులు కూడా, బహుశా రష్యా జనాభాలో నూటికి తొంభయి మంది విప్లవకారులే అవుతారు. పెట్టుబడిదారుల్లో కొందరు కూడా విప్లవకారులుగా మారడానికి సిద్ధపడతారు. ఎందుకంటే ఇక భూస్వాములను కాపాడ్డం సాధ్యం కాదని నిర్ణయించుకున్న వీరు విప్లవం పక్షంలో చేరిపోవడం మంచిదనుకుంటారు. ఆవిధంగా పరిస్థితులు పెట్టుబడిదారీ విధానానికి క్షేమదాయకంగా ఉంచడానికి ప్రయత్నిస్తారు.

విప్లవం పెట్టుబడిదారులకు వ్యతిరేకంగానా? అదీ ఇప్పటి అసలు సమస్య. అదే కీలకాంశం. ఎందుకంటే పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా విప్లవం తేకుండా శాంతి నెలకొల్పడం, త్వరగా యుద్ధం ముగించడం సాధ్యం కావు....... ఇప్పుడు రెండే ప్రత్యామ్నాయాలు మిగిలాయి. సర్వనాశనమైపోవడమా, లేక పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా విప్లవం తేవడమా. సమస్య అలా ముందుకొచ్చింది. పరిణామాలు అలా తోసుకొచ్చాయి.....

పాక్షిక-శ్రామికుల మద్దతో అధికారాన్ని చేపట్టిన శ్రామిక వర్గం మాత్రమే దేశానికి నిజంగా పటిష్టమైన, నిజంగా విప్లవకరమైన ప్రభుత్వాన్ని అందించగలదు. అది నిజంగా పటిష్టంగా ఎందుకుంటుందంటే దానికి వర్గ చైతన్యం కలిగిన మెజారిటీ ప్రజల గట్టి మద్దతు ఉంటుంది కనుక. అది నిజంగా పటిష్టంగా ఎందుకుంటుందంటే అది పెట్టుబడిదారులకూ-చిన్న యజమానులకూ మధ్య, కోటీశ్వరులకూ- పెటీబూర్జువాలకూ మధ్య ఏర్పడిన "ఒప్పందాల" మీద ఆధారపడింది కాదు కనుక. శ్రామికవర్గ ప్రభుత్వం మాత్రమే నిజమైన విప్లవకర ప్రభుత్వంగా ఉంటుంది, ఎందుకంటే ప్రజలు చెప్పనలవికాని ఈతిబాధల్లో ఉంటే అది పెట్టుబడిదారీ లాభాలకోసం వెంపర్లాడదు కాబట్టి. అది మాత్రమే ప్రజల విప్లవోత్సాహాన్ని పెంపొందించగలదు, నిలపగలదు, దాన్ని పదిరెట్లు పెంచగలదు, ప్రతిరోజూ, ప్రతి గంటా ప్రజలకు అందించగలదు కాబట్టి. అది మాత్రమే ప్రజలను నమ్ముకుని వారితో ఉంటుంది, వారంటే భయపడదు కాబట్టి. అది మాత్రమే తక్షణం ప్రజల జీవన ప్రమాణాల్ని పెంపొందించడానికి సహకరిస్తుంది కాబట్టి. అది మాత్రమే ప్రజలు మోస్తున్న భయంకర భారాన్ని ధనికులు కూడా సమానంగా భరించేట్లు చేస్తుంది కాబట్టి.

మనం పటిష్టమైన విప్లవ ప్రభుత్వాన్ని కోరుకుంటున్నాం ఎందుకంటే అది మాత్రమే సాధ్యమయ్యే, నమ్మదగ్గ ప్రభుత్వం కాబట్టి.

**(1917 మేలో లెనిన్ రాసిన వ్యాసం మే 19వ తేదీ ప్రావ్దా పత్రికలో ప్రచురించబడింది.)**

Marxistu, monthly organ of Communist Party of India (Marxist) A.P . State Committee.
Printer & Publisher B.V. Raghavulu. RNI Reg.No. APTEL/2006/17554. Vol.2, No.7, November 2007



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M116 |
| పుస్తకం పేరు | మార్క్సిస్టు |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 323 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | saranya |
| పేజీలు విడదీసినది | SARANYA |
| స్కాన్ చేసినది | Afsar |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |